చిన్నమొత్తాల పొదుపు పథకాలు
జీవన వనాల కమృతోదకాలు

Acc.No.31517

మీ సొమ్మును

చిన్న మొత్తాల పొదుపు

పథకాలలో పొదుపు చేయండి.

- సొమ్ముభద్రత
- అధిక రాబడి
- పన్నురాయితీలు

3028 Ron



సొమ్ముభద్రం భవిత బంగారం

**చిన్న మొత్తాల పొదుపు**

జిల్లా కలెక్టర్
ఖమ్మం.

గౌ॥ శ్రీ. ఎ. గిరిధర్, I.A.S., జిల్లా కలెక్టర్, ఖమ్మం. గారి సౌజన్యంతో

# అభినందనాశీర్వాదములు

ఉ॥ చారుపదాంచితంబునయిశ్రావ్యమునైరసవత్తరంబునై
సూరిమనోహరంబునయి శుంభదలంకరణాన్వితంబునై
భూరిసలక్షణంబునయి పొల్చెడికైతగలట్టి కేశవా
చారికిచెల్లునంచును 'రసప్రియ' యన్‌బిరుదంబునిచ్చితిన్

- కవిసింహ పోకూరి కాశీపత్యవధాని, త్వర్థికావ్యనిర్మాత
- మాజీగద్వాల రాజాస్థానకవి.

ఉ॥ నీవురసప్రియుండ వవనిన్ రసవంతములై ప్రసన్నమై
చేవగలట్టి సత్కృతులచే విలసిల్లుచు నుంటివీవు శి
ష్యావళిలోనగ్రజుడ వంచుదలంచుచునుందునిన్ను నీ
తావిభుడిచ్చుగాత బ్రమదంబుగనీకు జిరాయురున్నతుల్,

- వాజపేయ యాజులరామసుబ్బారాయుడు
ప్రసన్నభారతవ్యాస, మాజీకొల్లాపురం, రాజాస్థానకవి.

ఉ॥ నామములెన్నియో కలవునాటికి నేటికి వాటిలోననీ
నామముశ్రేష్ఠమై మొదటినామముగా విలసిల్లె కేశవా
నీమధురప్రసన్నకమనీయ కళాకవనమ్ము గూడ భా
షామణిచల్వతో నెగడి శాశ్వతమై పొగడించు ధాత్రిపై.

- జగజ్జనని వేదాంతకవి, కవితారాజధాని, కొవ్వూరు.

ఉ॥ అర్థిజనంబుగోరిన సహాయముశక్తి కొలందిసల్పని
స్వార్థపరుండు సాధుహితబంధురతుండయి యెన్నడేనియున్
వ్యర్థులజోలికిన్ జనక పండితమైత్రినెసంగి కేశవుం
డర్థగణాంకశాఖనహహా! అధికారమునందివర్ధిలెన్!

- 'ఆంధ్రమిల్టన్' శతావధాని
డి.కె. బాలబ్రహ్మాచార్యులు,మహబూబునగర్.

కం॥ చక్కని చిక్కనికైతల-పెక్కుల రచియించినావు పెద్దలు మెచ్చన్
నిక్కముగ మీకవిత్వము-చక్కెర తేనియలకన్న చవిగలదిసఖా!

కం॥ "అభినవధూర్జటి" యని మి-మ్మభినందించెదను కేశవాచార్యకవీ!
అభవుండనుగ్రహించుత-శుభసౌఖ్యశ్రీలమీకుశోభిలసుకవీ!

- 'కవిభూషణ' 'కవికోకిల' యర్రం విశ్వనాథంగుప్త, ఖమ్మం.

**(పై పెద్దలందరు కీర్తిశేషులు వారికి నాస్మత్యంజలులు)**

# రసప్రియ రామాయణం
## (గేయకావ్యం)

# రావణవధ
## (యుద్ధకాండ)

'రసప్రియ'
శ్రీరంగాపురం పోతేదార్ కేశవాచార్య

రావణవధ గేయకావ్యం -రసప్రియ

భోజ ప్రచురణ : **16**

ప్రథమ ముద్రణ : **500**

చిత్రభానునామ సం॥ శ్రీరామనవమి, 2002

హక్కులు : రచయితవి



**వెల రూ॥ 50/-లు**

ప్రతులకు :
'రసప్రియ' **F. కేశవాచార్య** (Rtd. C.P.O.)
H.No. 6-2-23/A, తుమ్మలగడ్డ బజార్,
ఖమ్మం. ఫోన్ : 08742 - 34409

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
4-1-435 విజ్ఞాన్ భవన్, బ్యాంకుస్ట్రీట్,
హైదరాబాద్ - 500 001.

**నవయుగ బుక్ డిస్ట్రిబ్యూటర్స్**
సుల్తాన్ బజార్, హైదరాబాద్.

ముద్రణ :
**శివశ్రీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్,**
ఓల్డ్‌క్లబ్ రోడ్, ఖమ్మం.
ఫోన్ : 23976

# అంకితం



శ్రీ కల్యాణ ప్రదుండు
శ్రితజనాళి మందారుడు
ఇహపరముల కటాక్షించు
మహనీయ గుణాత్ముండును

వా మాంకమునందు సీత
వామకరంబున చక్రము
దక్షిణహస్తాన శంఖు
లక్ష్మణుండు వామదిశను

శ్రీమన్నారాయణుడే
సీతాలక్ష్మణుల గూడి
జగమునెల్లనుద్ధరింప
చతుర్భుజుడుగా వెలసిన

భద్రాచల రామచంద్ర
పరబ్రహ్మ చరణయుగ్మ
సాన్నిధ్యమునకు ఈకృతి
సమర్పింతు నంకితముగ

'సాహితీ వల్లభ'
**ఆచార్య ఎస్వీ రామారావు**
డీన్, ఫ్యాకల్టీ ఆఫ్ ఆర్ట్స్ (రిటైర్డ్)
ఉస్మానియా విశ్వవిద్యాలయం



# రామకథాసుధ

రామకథారస వాహినిలో ఓలలాడని భారతీయ కవులెవరూ వుండరు. అందునా తెలుగువారికి రాముడన్నా, రామనామమన్నా అత్యంత ప్రీతికరములు. తెలుగునాట ఎవరిని కదిలించినా రామనామమే వినబడుతుంది. "శ్రీరామనామాలు శతకోటి - ఒక్కొక్క పేరు బహుతీపి"

వాల్మీకి రాసార్ద్ర చిత్తంనుండి రమణీయంగా జాలువారిని శ్రీరామకథ తెలుగులో వివిధ సాహిత్య కళారూపాలలో విస్తరించింది. సీతాసమేతంగా అయోధ్యనుండి బయల్దేరిన రాముడు భద్రాద్రి పరిసరాలను పునీతం చేయటంవల్ల కాబోలు మొట్టమొదటి తెలుగు రామాయణం తెలంగాణాలోనే వెలువడింది. కీ॥శే॥ పదమూడవ శతాబ్దంలో కాకతీయ సామంతుడుగా పాలమూరు జిల్లాలోని వర్ధమానపురం (వడ్డెమాను) ప్రాంతాన్ని ఏలిన గోన బుద్ధారెడ్డి విరచించిన ద్విపద రామాయణం తెలుగుభాషలో వెలసిన తొలిసంపూర్ణ రామాయణం. గోనభూపతులు పాండురంగ విఠలుని భక్తులు కావటం వల్ల దీనికి రంగనాథ రామాయణం అన్న ప్రసిద్ధనామం ఏర్పడింది. తొలి తెలుగు పద్య రామాయణమైన భాస్కర రామాయణం కూడా కాకతీయ యుగంలోనే వెలువడటం గమనార్హం. నాటినుంచి ఎందరో తెలుగుకవులు, కవయిత్రులు వివిధ ఛందో రూపాలలో రామకథాగానం చేసి తరించారు.

పాలమూరు జిల్లా శ్రీరంగాపురంలో జన్మించిన ఫోతేదార్ కేశవాచారి ఉద్యోగ రీత్యా భద్రాద్రి ప్రాంతంలో నివసించటం యాదృచ్ఛికమే అయినా అది అతని జన్మకు సార్థకత చేకూర్చింది. గోదావరి ఒడ్డున వున్న రథపు గుట్టను చూడగనే కలిగిన స్పందనతో 'పర్ణశాల' గేయకావ్యం ఆయన కలంనుంచి వెలువడింది. అరణ్యకాండలోని సీతాపహరణ ఘట్టం అందలి ప్రధానకథ. అతివ అపహరణను ప్రతిఘటిస్తూ జటాయుపక్షి పరాక్రమించిన ఘట్టం ఈకవి సామాజిక స్పృహకు నిదర్శనం.

'పర్ణశాల' గేయకృతి సహృదయుల ఆదరాన్ని చూఱగొనటంలో కలిగిన ప్రేరణతో వరుసగా సీతాన్వేషణ (కిష్కింధకాండ), సుందరకాండ, బాలకాండ, అయోధ్యకాండ వెలువడ్డాయి. ప్రస్తుత 'రావణవధ' కావ్యం యుద్ధకాండకు సంబంధించిన భాగం.

"రామ రావణుల సమరము నేమందును రసప్రియా!
ధర్మహాని చేయువాని తల నరుకుట తథ్యమయా!
ధర్మానికి విజయమని అధర్మానికి నాశనమని
గొంతులెత్తి యుగయుగాలు ఘూర్ణిల చెప్పిన సత్యము
ఆనాటికి ఈనాటికి నానాటికి నిత్యమనీ
జగజగాల మార్మోగగ చాటుచు చెప్పిన సత్యము"

తేటతెలుగులో గేయంగా సాగిన 'రావణవధ' రామకథాసుధగా శ్రావ్యమధురంగా రూపుదాల్చింది.

విద్వత్ పోషణకు విఖ్యాతి చెందిన పాలమూరు సంస్థానాలను సందర్శించిన కవిపండితుల సాంగత్యం లభించటం వల్ల చిన్ననాటనే కేశవాచారిలో కవితా గంధం గుబాళించింది. అర్ధగణాంక శాఖలో వృత్తిని చేబట్టిన అతని ప్రవృత్తి అర్థ (శాబ్దార్థములు), గణ (ఛందస్సు) ములకే అంకితమైంది.

"భావుకాంధ్రమనెడి పచ్చని తోటలో 'ప్లాను'లనెడి నీరు పారుచుండ
శ్రీగణాంకవల్లి చిగురించి పుష్పించి ఫలము లీయకున్నె ప్రగతి వెలయ."
(గణాంకవీణ-అమరస్మృతులు)

కేశవాచార్య కవి విరచితమైన పద్య, గేయకృతులలో శతకాలు, గేయగాథలు భక్తిపూరితములై ఆయన ఆధ్యాత్మిక తత్పరతను చాటుతాయి. వాల్మీకి రామాయణము నధ్యయనం చేయగా కలిగిన భావావేశంలో వారు వివిధ కాండలను సులలిత మధురమైన గేయకృతులుగా మలిచారు ఇవిమూలా తిక్రమణం కాకపోయినా కాలానుగుణమైన చిన్న చిన్న మార్పులు వీనిలో ఔచితీ మంతంగా చోటుచేసుకొన్నాయి. శ్రీరంగాపుర క్షేత్రదైవం శ్రీరంగనాయకులను దర్శించిన సన్నివేశం కవి స్వస్థాన వేషభాషాభిమానానికి నిదర్శనం. అర్జునుని తీర్థయాత్రలో గోదావరి తీర్థాన్ని చేర్చిన ఆదికవి నన్నయ్య ఆంధ్రకవులందరికీ మార్గదర్శి అంటే అత్యుక్తి కాదు.

చిత్రకవితా కోవిదులు కీ॥శే॥ కవిసింహ పోకూరి కాశీపతిగారి అభిమానమును పొంది 'రసప్రియ' "కవికోకిల" బిరుదులను గడించటమే కాక, వారి 'కవితాచమత్కృతి'ని సరిక్రొత్త ప్రక్రియగా అంకితము గొనిన సుకృతి శ్రీకేశవాచార్యులు. సప్తతి వసంతాలు పూర్తిఅయి రామకథాగానంలో చరితార్థులైన ఈసుకవికి ఆశ్రీరామచంద్రుడు సకలశుభముల నొసంగుగాక.

సికింద్రాబాద్ — **డా॥ ఎస్వీ రామారావు**

ది : 4 డిసెంబర్, 2001

# పీఠిక

రసప్రియ

రామాయణాన్ని వాల్మీకి మహర్షి "పౌలస్త్యవధ" అని ఒకచోట పేర్కొన్నాడు. పులస్త్య బ్రహ్మపౌత్రుడు రావణుడు. పులస్త్యబ్రహ్మ అంతటి బ్రహ్మర్షికి పౌత్రుడైనప్పటికి దుర్గుణాలకులోనైన వాడగుటచేత రాక్షసుడైనాడు రావణుడు. లోకకంతకుడైన రావణుడు వధ్యుడు. అందుచేత "రావణవధ" అని యుద్ధకాండకు నామకరణం చేశాను.

మంచిని పెంచుట చెడును త్రుంచుటలోనే ధర్మంఉంది. ధర్మగ్లానియైనప్పుడు భగవానుడు స్వయం అవతరించి అధర్మాన్ని త్రుంచి ధర్మాన్ని రక్షిస్తాడు.

"యదాయదాహిధర్మస్య గ్లానిర్భవతి భారత

అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్"

ఈ గీతాసారాంశ ప్రతిరూపమే రామావతారం రామోవిగ్రవాన్ ధర్మ: రాముడు ధర్మస్వరూపుడు తానుస్వయంగా ధర్మాన్ని ఆచరిస్తూ సమస్తలోకాలకు ఆదర్శుడై అధర్మాన్ని నిర్మూలించి ధర్మాన్ని సముద్ధరించడమే రామావతారానికి పరమావధి.

పరదారాపహరణం, పరపీడనం ఇత్యాది అధార్మికపాపకర్ముడై ధర్మహాని చేస్తున్న రావణున్ని ధర్మస్వరూపుడైన రాముడు వధిస్తాడు. అంతేకాదు వానిననుసరించు రాక్షసులను కూడ వినిర్మూలిస్తాడు. రావణవధ అనంతరం ధర్మాత్ముడైన విభీషణుని ధర్మపరిపాలనార్థం లంకకు పట్టాభిషిక్తునిగావిస్తాడు. చెడునుత్రుంచి మంచినిపెంచటమే దీనిపరమార్థం. విభీషణ పట్టాభిషేకమే రామావతారానికి ముఖ్యప్రయోజనం. అందుకే ధర్మమూర్తియైన విభీషణ పట్టాభిషేకంతో రాముడు కృతకృత్యుడైనట్లు బాలకాండలో చెప్పబడింది. "అభిషిచ్యతులంకాయాం రాక్షసేంద్రం విభీషణం కృతకృత్యస్తరామో విజ్వరః ప్రముమోదహ " రావణుని వధించి లంకలోధర్మపరిపాలనార్థం విభీషణుని లంకకు పట్టాభిషిక్తుని జేసి రాముడు సీతాలక్ష్మణ సమేతుడై అయోధ్యకు వచ్చిరాజ్యాభి షిక్తుడై రాజ్య పరిపాలనచేస్తాడు. ప్రజలను కన్న బిడ్డలవలె సేవాతత్పరత తో పదునొకండు వేలయేండ్లు రాజ్యము పాలిస్తాడు. 'రామరాజ్య' మని చక్కని ప్రజాహితైక పరిపాలనగా నానాటికి ఆదర్శమై ప్రకాశిస్తున్న నానుడి లోక ప్రసిద్ధమైయున్నదికదా.

కేవల రావణవధకోసమై ధర్మమూర్తి విభీషణులంకకు రాజుచేయుటకే రాముడవతరించెననుట సరికాదు. వాల్మీకిమహర్షి నారదమహర్షిని అడిగినది ఉత్తమగుణ వంతుని గూర్చి. అనంతకల్యాణ గుణ సంపన్నుడగు రాముని గురించి నారదుడు చెప్పిన వృత్తాంతమే రామాయణమైనది కదా. రామాయణ రత్నాకరంలో లభించినరామ గుణరత్నాలను కొన్నిటిని (యుద్ధకాండపరిమితిలో) గూర్చి ముచ్చటిస్తాను.

<u>కృతజ్ఞతాగుణం :</u> సీతకు రాముని కుశలవార్త దెలిపి రామునికి సీత కుశలవార్త చెప్పినప్పుడు రాముడు హనుమంతుని అభినందించిన విధానం అపూర్వం తననర్వస్వమైన గాఢాలింగనంతో హనుమంతుని అభినుతిస్తాడు.

అరణ్యకాండలో జటాయుయెడజూపిన కృతజ్ఞతాభావం అనన్యసామాన్యమైనది. తనకై ప్రాణాలర్పించిన జటాయువుకు తనతండ్రికివలె దహనసంస్కారాలు చేస్తాడు. రాముని కృతజ్ఞతావిష్కరణ ఇచటపరాకాష్టను జెందినదనవచ్చును.

లక్ష్మణుడు ఇంద్రజిత్తును సంహరించి హనుమ విభీషణాదులతో వచ్చి రాముని కలిసినప్పుడు రాముడు తమ్ముడగు లక్ష్మణుని అతనికి తోడ్పడిన హనుమవిభీషణ వానరసేనలనందరను అభినుతించి వారందరికి పేర్పేరున తన కృతజ్ఞతలు దెలిపి లక్ష్మణునితో అంటాడు.

"రావణునకు కుడిభుజమగు రావణిజంపితివినీవు
రావణుజంపుటనాకది లఘుకార్యంబైయున్నది."

ఉపకరించిన వానికి కృతజ్ఞతలుదెలుపుట దర్పలోపమని ప్రవర్తించు కృతఘ్ను లోకానికి రామునికృతజ్ఞతావిష్కరణజ్ఞానోదయము కలిగించుగాక.

<u>శరణాగత రక్షణాదీక్ష</u> : సుగ్రీవాదులు కాదన్నను శరణమన్న విభీషణునకు అభయ మిచ్చి లంకకు రాజుగానభిషిక్తుని చేస్తాడు రాముడు గూఢచారులైన శుకసారణ శార్దూలాదులను విడిపించుటలో చూపిన ఔదార్యం వాత్సల్యం రాజనీతిజ్ఞత నిరుపమానంకదా.

<u>స్నేహగుణం</u> : సుగ్రీవుడు ఆవేశాతురతతో ఎగిరివెళ్లిరావణుముకుట భంగమొనర్చి తిరిగి వచ్చినప్పుడు రాముడంటాడు "నీకేదైన అనర్థం జరిగితే నాకు సీతతోనేమిపని". అన్నమాటలు స్మరణ మాత్రాన రోమాంచితమగునుకదా."

<u>సౌభ్రాత్రగుణం</u> : మూర్ఛితుడైన లక్ష్మణునిజూచి రాముడంటాడు "దేశదేశే కలత్రాణి దేశదేశేచబాంధవ తంతుదేశంనపశ్యామియత్రభ్రాతా సహోదరః".

ప్రతిదేశంలో భార్యలు బాంధవులు దొరుకవచ్చును కాని లక్ష్మణుని వంటితోడబుట్టినవాడు లభించు దేశమేలేదు రామునిసౌభ్రాత్రతకిది పరాకాష్టకదా!

<u>ప్రతిజ్ఞభంగం సహించనిగుణం</u> : నాగబంధంతో లక్ష్మణసహితం సైన్యమంతా చనిపోయిందని తానుకూడ జీవించలేనని అనుకొని విభీషణుని లంకారాజును చేస్తానన్నమాట తప్పడమనునది తననుదహించి వేస్తుందని, ప్రతిజ్ఞనిలుపుకోలేని చరిత్రహీనుడనౌతానని బాధపడుతాడు రాముని ప్రతిజ్ఞదీక్షాగుణం ఘనతరమైనదికదా! "మాటతప్పటకన్న మరణమేమేలగు".

<u>పరమదయాగుణం</u> : ప్రథమయుద్ధంలో రావణుడు నిర్వీర్యుడై విహ్వలుడై దీనుడై చిక్కినప్పుడు రాముడుజాలిగొని శత్రువుని విడిచిపెట్టిన ఉదాత్తగుణం నాన్యతోదర్శనీయం రామునిదయాళుత ఇచ్చట పరాకాష్టనుచెందినది. "రావణాపాపం చాల అలసిపోయావు, నేనిపుడు నిన్నేమిచేయను నేడులంకకుపోయిసేదతీర్చుకొని కొత్తఆయుధాలతో రేపురా" అనిరాముడంటాడు. తనయెడ పరమకిరాతకానికి పాల్పడిన శత్రువును దైన్యంలోనుండగా

వానిపైదయచూపిన రఘువీరుని దయాళుత పరాకాష్టజెందినదికదా. "చంపదగినయట్టి శత్రువు దీనుడై చిక్కెనేని కీడుచేయరాదు" అనుతెనుగునానుడి ఇచటస్మరణీయం.

**ఆదర్శపాలకుడుగా లోకజ్ఞత :** లోకోపవాదానికి వెరచి సీతకగ్నిప్రవేశానికి అనుమతిస్తాడు రాముడు బహుకాలం భార్య దుర్మార్గుడైన రావణునింటనున్నందున లోకోపవాదంతప్పదు. అట్టిసీతను తెచ్చుకొని ఏలినచో తానుచరిత్రహీనుడుకాగలడని, పాలకుడైన తాను ప్రజలకు ఆదర్శప్రభువుకాజాలడని సీతను స్వీకరించడు. సీతఅగ్ని ప్రవేశించిన పిదప బ్రహ్మరుద్రాదులు వచ్చి సీతపవిత్రురాలని చెపుతారు, అగ్నిదేవుడు స్వయం ప్రత్యక్షమై సీతాదేవి పరమపవిత్రురాలని చెప్పిసీతను రామునకప్పగిస్తాడు. అప్పుడుకాని రాముడు సీతను స్వీకరించడు. లోకులుతనను కాముకుడని తలంచు ప్రమాదము తప్పించుకొనుటకు సీతను అగ్నిపరీక్షకు అనుమతించిన రామునిలోకజ్ఞత ప్రశంశనీయముకదా.

**ఆశ్రితవాత్సల్యము :** రావణవధచే సంతుష్టుడైన ఇంద్రుడు రాముని ఏదైన వరము కోరుకొనుమని అడిగినప్పుడు రాముడు తనకోసం పోరాడి ప్రాణాలు పోగొట్టుకొన్న వానరులందరు తిరిగి జీవించునట్లు అనుగ్రహించవలెనని కోరుకొనిన రాముని అతులితవాత్యల్యగుణమును కొనియాడ వెయ్యినోళ్ల ఫణికైనవశముకాదుకదా!

**సీతారాముల ఉచితజ్ఞత :** రావణవధచే సంతుష్టుడైన ఇంద్రుడు వాయుదేవునిద్వార సమర్పించిన ముక్తాహారమును రాముడు, సీతకు అందజేస్తాడు రావణవధకు తనకన్నా సీతయే ఎక్కువశ్రమపడినదని, కానిసీతాదేవి దానిని హనుమంతునకు అందజేస్తుంది. హనుమంతుడు లేకుంటే రావణవధ సాధ్యమయేదికాదని, ఈసందర్భమున సీతారాములయిరువురి ఉచితజ్ఞత కడు ప్రశంసనీయమైనదికదా.

**వాస్తుజ్యోతిషశకునాదిశాస్త్రాలు :** వీటిప్రసక్తి వచ్చిన చోట వాటిప్రభావాలు విడిచిపెట్టక వివరించాను. శాస్త్రాలు ప్రజోపయుక్తములుకదా అందుకే ఈనాటికి సామాన్య ప్రజానీకం కూడ వీటిని పాటిస్తూనేయున్నది.

**కుంభకర్ణ విభీషణులు :** వీరిరువురూ రావణుని తమ్ములు ఇరువురూ రావణుడు చేసిన సీతాపహరణ మను అకృత్యమునుగర్హించినవారే, ఇదితగదని సీతను రామునకప్పగించి సంధిచేసికొనుమన్నవారు. మూర్ఖుడైన రావణుడు వినలేదు. కోపగించుకొన్నాడు కుంభకర్ణుడు అన్నను నొప్పించనొల్లక అన్నమాట వింటాడు అన్నచేసిన అక్రమానికి సమ్మతిస్తాడు చెడును వినకూడదు కనకూడదు అనకూడదు ఈ మూడేకాక చెడునుచేయనీయకూడదు. ఇదిఒకనీతి కుంభకర్ణుడు అన్నకొరకు చెడును చేయనిస్తాడు నిరోధించలేడు రావణుడు అన్నయైన పాలకుడు పాలకుడెట్టి వాడైన అనగా అధర్మపరుడైనావాని పోషణలో నున్నందుకు సంకటసమయం వచ్చినప్పుడు పోషకుని వదలిపెట్టిపోవడం ధర్మమగునా! కాదు. అయినా పోషకుడై కేవలస్వార్థ కాంక్షగల అన్నకొరకు జాతికి ధర్మానికి హానికరమైన చెడునుసమర్థిస్తాడు.

రణభూమిలో వీరస్వర్గం పొందుతాడు అతని భ్రాతృభక్తి అతని రాజభక్తి అనన్యసామాన్యమైనది. అయితే ఈరెండును దేశభక్తికాజాలవుకదా.కుంభకర్ణునికి దేశభక్తి కన్న బంధుప్రీతి మిన్న. జాతిప్రీతికన్న వ్యక్తి ప్రీతిమిన్న.

విభీషణుడు రావణుని వక్రమార్గంనుండి తప్పించి జాతిహితం కోరి సీతను రామునకప్పగించిసంధిచేసికొమ్మంటాడు. లంకాహితంకోరి పదేపదే వాదిస్తు హితైషియై విశ్వప్రయత్నం చేస్తాడు. రావణుడు విభీషణుని అపార్థంచేసికొని జ్ఞాతివిరోధిగా తలచి తమ్మునికసిరికొడతాడు అనుమానం పెనుభూతం అన్నట్లు అనరాని మాటలంటాడు. ఇక రావణుని మనస్సుమార్చటం తరంకాదని తానుఅన్నతో ఉండి మనలేననిరావణునితో లంకావినాశనం తప్పదని ఆట్లగుటచే ధర్మసంస్థాపన కవకాశముండునని దహించుకు పోయేగృహనుంచి బయటపడటం వివేకమని తలచి శత్రువుతో చేరిశత్రువుకు తోడ్పడతాడు రావణవధానంతరం లంకకు రాజైధర్మపాలనచేస్తాడు విషమించిన శరీరభాగాన్ని ఖండించి ప్రాణరక్షణ చేసినట్లు అధర్మాన్ని నశింపజేసి ధర్మాన్నిరక్షించినట్లు చెడునుత్రుంచి మంచిని పెంచినవాడౌతాడు విభీషణుడు సర్పం ఇంట్లోజొరినప్పుడు దానిని చంపకుండ ఉంటామా! ఇంటిదీపమని ముద్దుపెట్టుకుంటామా! అని విభీషణునిమతం రణభూమిలో ఇంద్రజిత్తు చేసిన తిరస్కాతినికి బదులు విభీషణుడన్నమాటలేఇవి.

కేవలస్వార్థాపేక్షతీర్చుకొనుటకు ధర్మహాని కలిగిస్తూ తన ప్రాణహానికి తనజాతి వినాశనానికి కారకుడైన రావణుని సమర్థించటమా! మర్దించటమా! ఏది సమంజసం? ఏది న్యాయం? రక్తం పీల్చేనల్లిని దోమను పరిపోషించటమా! నలిపిచంపటమా! వాటినినశింపజేసినప్పుడే హాయి ఆరోగ్యం శరీరానికి అట్లేచెడును త్రుంచి మంచిని పరిరక్షించినప్పుడే శాంతిభద్రతలు సౌఖ్యసంక్షేమాలు దేశానికి జాతికి సిద్ధిస్తాయి.

ఆధ్యాత్మిక పరంగా ఏదిఎట్లున్న లౌక్యపరంగా లోకకళ్యాణార్థం జాతి సంక్షేమార్థం కుంభకర్ణ విభీషణలు నిర్వహించిన పాత్రలు పరికించిచూచిన ఎవడు దేశభక్తుడు! ఎవడు జాత్యభిమాని? ఎవడు దేశద్రోహి? ఎవడు భ్రాతృద్రోహి? ఎవడుజాతిద్రోహి? విజ్ఞతతోవిమర్శించిన తేటపడగలదు.

స్వార్థానికి స్వజాతిని బలిపెట్టిన మూర్ఖస్వార్థపిశాచ ప్రభువగు రావణుడూ వాని అధర్మానికి తోడ్పడిన కుంభకర్ణ ఇంద్రజిత్ ప్రహస్తాదులు లోకకళ్యాణార్థం వధింపబడిరికదా. అధర్మాన్ని విడిచి ధర్మాన్ని ఆశ్రయించి దానికి తోడ్పడిన విభీషణుడు "ధర్మోరక్షతి రక్షితః" అన్నట్లు సురక్షితుడై పట్టాభిషిక్తుడయ్యేనుకదా! అందుకే "పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం ధర్మసంస్థాపనార్థాయ సంభవామియుగేయుగే" అని భగవద్గీత చెపుతున్నది.

- రసప్రియ

# రామాయణ రచనకు ప్రేరణ

నేనొక చిన్నకవిని రామాయణమంతటి మహాకావ్యంజోలికి పోయేవాణ్నికాను. అయితే 1976 జనవరిలో ఖమ్మంజిల్లా అధికారిగా బదిలీ అయివచ్చినప్పుడు పర్యటనలో భద్రాచలానికి 36 కి.మీ దూరంలోవున్న పర్ణశాలగ్రామాన్ని దర్శించుకొన్నాను. అచ్చట శోకరాముడిగుడిఉంది. అక్కడే పర్ణశాలకట్టుకొని రాముడు సీతాలక్ష్మణులతో నివాసంచేశాడని అనేకగుర్తులు రుజువుచేస్తున్నవి. రాముడు పర్ణశాల గోదావరి ఒడ్డున కట్టుకొన్నట్లు వాల్మీకం ప్రమాణం. నేను దర్శించిన పర్ణశాల గోదావరి ఒడ్డుననేఉంది.గోదావరి కుడిఒడ్డున ఒకపెద్దగుట్టఉంది అది రథపుగుట్టఅను పేరుతో ప్రసిద్ధం. దానిపైబండిచారలవలె రెండుచారలు గడ్డిమొలవక స్పష్టంగా పాపటవలెకన్పడుతున్నవి. సీతాపహరణానికి రావణుడు తనరథాన్ని కొంతసేపు ఆగుట్టపైన ఆపినాడని చెప్పుకుంటారు. అక్కడే పర్ణశాల శూర్పణఖముఖభంగం, స్వర్ణహరణం సీతాపహరణం, జటాయువు పోరాటం ఇత్యాది జరిగిన సంఘటనలకు తానుసాక్షీభూతమైనదని, నేనాగుట్టనుచూచినప్పుడు నాలోస్పందనకలిగి ఆగుట్ట అక్కడజరిగిన తానుచూచిన సంఘటనలన్ని నాతోచెపుతున్నట్లనిపించింది.

"భద్రాచల సీమలోన పర్ణశాల ఒకటున్నది గోదావరికుడి ఒడ్డున గుట్టఒకటి చెపుతన్నది
పర్ణశాలతనకు సమీపానవెలసియుండినదని రథపుగుట్ట "వినుడీ" యనివ్యథతో కథచెపుతున్నది
సీతాసౌమిత్రులతో శ్రీరాముడునడచి వచ్చి ఇచ్చటనే పర్ణశాల ముచ్చటనిర్మించెనను ॥గోదావరి॥
త్రేతాయుగచక్రవర్తి సీతను పోగొట్టుకొనగ ఎదఏరై శోకించినదిదే ఇదే ప్రాంతమనుచు
రావణరథచక్రమ్ముల రాపిడివడి చాఱలువడ "రథపుగుట్ట"పేరు తనకు ప్రథితమ్మై పోయినదని
సీతనపహరించవచ్చు చెనటి రథమ్మును డీకొని గాయపడ్డ రథపుగుట్ట గేయమొకటి చెపుతున్నది."

అనుగేయ పంక్తులు నాలోఅలవోకగా సాగిపోగా తానుచూచిన సంఘటనలన్నీ చెపుతూ ఆరథపుగుట్ట నాచే "పర్ణశాల గేయకావ్యం" వ్రాయించినది.

రామాయణంలో సీతాపహరణ ఘట్టం చాల ముఖ్య కేంద్రమైనది. పదునాల్గేండ్ల వనవాసంలో ఒకేఏడుమాత్రం మిగిలిఉండగా సీతాపహరణం జరిగినది. అక్కడినుండి రామకథమలుపు తిరిగింది. సీతాపహరణం జరుగకుంటే ఇంతరామాయణం జరిగిఉండేదికాదు. రాముడుసీతాలక్ష్మణులతో ఆఒక్కఏడువనవాసంలో గడిపి అయోధ్యకు వెళ్లిఉండేవాడు. ఇంతరామాయణానికి కారణం సీతాపహరణమే. అట్టిసీతాపహరణ ఘట్టామే 'పర్ణశాల' గేయకావ్యంగా రూపుదిద్దుకొన్నది.

ఒక మానవస్త్రీ ఆక్రందనకు చలించి ఒక పక్షి రాక్షసునెదుర్కొన్న వీరోచితగాథ వ్రాయడమేనాధ్యేయం. అదినాకు సామాజిక స్పృహతో కలిగిన స్పందన. ఆస్పందనతోనేను చేసిన రచనయే 'పర్ణశాల' అది నాడూ నేడూ అమాయక స్త్రీలపై జరిగిన జరుగుతూన్న అమానుష అత్యాచారాలకు చలించి జ్వలించిన మానుషజ్వాల, ఒకమానిని రక్షణకై తెగించి రాక్షసునితో పోరాడిన

పక్షి పౌరుషజ్వాల అదేపర్ణశాల కావ్యంగా రూపుదిద్దుకొన్నది. అది భద్రాచలం దేవస్థానం మరియు తిరుమలతిరుపతి దేవస్థానముల వారి ఆర్థిక సహాయంతో, శ్రీరానవమి 1985 నాటికి ముద్రితమై వెలుగుచూసింది. (రచనద్మూర్మతి 1981-82లో) పండితుల ప్రోత్సాహంలభించింది. విశ్వవిఖ్యాత విద్వాంసులు, డా॥ దివాకర్ల వెంకటావధానుల ప్రశంసలకు పాత్రమైంది జ్ఞానపీఠపురస్కార గ్రహీత, డా॥ సి. నారాయణరెడ్డి గారి మరియు నాటి ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి డా॥ దాశరథి గారల పొగడ్తల చూరగొన్నది. పర్ణశాల క్యాసెటు రూపంలో దేవాదాయ కమీషనరుగారి ఆర్డర్సుకొనుగోలుపై వెలువడింది. అన్నిగ్రంధాలయాలు కొనుగోలుచేయుటకు గ్రంధాలయ సంస్థడైరెక్టరు గారి ఆర్డర్సు జారీఅయినవి. కాని కొనుగోలు అర్డర్సురాలేదు. సుమారు రెండు దశాబ్దాలకు ఒక్క గ్రంధాలయం, ఖమ్మం నుండి ఆర్డర్సు వచ్చినవికాని ప్రతులులేవు. ఇట్టిప్రోత్సాహబలంతో అరణ్యకాండ అంతర్భాగమైన పర్ణశాల పిదప రామాయణంలోని కాండలన్ని గేయరూపంలో వాల్మీకీయం ఆధారంగా పరిసమాప్తి చేసితిని రామాయణం వ్రాయాలనినేనెప్పుడు అనుకోలేదు. అట్లనుకొని ఉంటేబాలకాండతో ప్రారంభించేవాణ్ని. అరణ్యకాండలోని పర్ణశాలతో ప్రారంభించాను. పర్ణశాల, సీతాన్వేషణ (కిష్కింధాకాండ) సుందరకాండ, బాలకాండ, అయోధ్యాకాండ ప్రస్తుత రావణవధ (యుద్ధకాండ) క్రమంగా వ్రాయగా ముద్రితమైనవి. భద్రాచలం దేవస్థానం, తిరుమల తిరుపతి దేవస్థానములు, తె.వి. విద్యాలయం, ధార్మికగ్రంధ పోషకులు ఆర్థిక సహాయం అందజేసిరి. వారివారికి నాకృతజ్ఞతలు. ఇది అంతానేను రామాయణం వ్రాయడం ముద్రణకావడం శ్రీరామభద్రుని కృపావిశేషమని నమ్ముతున్నాను.

నన్నురామాయణాన్ని వ్రాయడానికి ప్రేరేపించిన రథపుగుట్టకు కృతజ్ఞలెంతచెప్పుకున్నా తక్కువే "ధరాధరము జడమైనను దురాగతమునెదురించెను" అనుస్ఫూర్తి ప్రేరణనాలో రేకెత్తించి ఒకమానిని ఆక్రందనకు స్పందించి పక్షి రాక్షసునెదుర్కొన్న వీరోచితగాధ వినిపిస్తూ నాలో సామాజిక స్పృహకలిగించి నాచేపర్ణశాల వ్రాయించిన రథపుగుట్టకు వీరజటాయువుకు వినమ్రుడనై ప్రణమిల్లుతున్నాను

గేయం శ్రవణపేయమని రామాయణ గేయకావ్యంగా ఆరుసంపుటాలు సంతరించి పూరించితిని శ్రుతిసౌఖ్యంకోసం యడాగమనుగాగమాలను కొన్నిచోట్ల పాటించలేదు. యతినియతి పాటిస్తూ విసుగురాకుండుటకు గతులు మారుస్తు కొన్నిచోట్ల అంత్యచ్ఛేకాలతో గుణవిశేషమను కొన్న కొన్ని స్వకీయాలతో వాల్మీకాన్ని అనుసరించి సరళబాషలో వ్రాశాను. పండితపామరులు చదివి ఆనందించగలరని నమ్ముతూ ఈగేయరామాయణాన్ని తెలుగుపాఠకులకు సమర్పిస్తున్నాను దీనిని పఠించువారలకు రామానుగ్రహంకలుగుగాక!

"సర్వేజనా సుఖినోభవంతు
సమస్తసన్మంగళానిభవంతు"

ఖమ్మం.
తేది : 11-08-2002, శ్రీకృష్ణజన్మాష్టమి

-'రసప్రియ' కేశవాచార్య

# పితామహస్మృత్యంజలి

శా॥ తాతా! రామకథాసుధా రసమొకింతన్నీకుద్రాపింతు సం
ప్రీతిన్ గైకొని చూడుదీనిరుచి ఆపీయూషమున్ మించు న
ద్వైతబ్రహ్మపరాత్పరైక పదమున్ ప్రాప్తిల్లగాజేయు శ్రీ
సీతారామకథాసుధారసముసంసేవించు సంతృప్తిమై.

ఆ॥ కోడిపుంజుకున్న వాడియువేడియు
గలమగాడ! యుద్ధకాండమనిన
నీకు మక్కువయని నిన్నిందుస్మరియింతు
భోజయార్యతాత పుణ్యచరిత!

కం॥ దసరా రోజున మమ్ముల
నసితాంగంబులకు తైలమంటుచుచిలుము
న్నసివోవ జేయుడని మా
కెసదెల్పితి జడిమశుద్ధి యివ్విధిసేయన్.

గీ॥ అపరధన్వంత్రివై నీవుయలరిగూడ
మానవుల నిరామయులుగ మనగజేయు
నట్టి దివ్యౌషధములకన్వెట్టుయత్న
మందు శ్రమియించి శ్రమియించి యలసి తుదకు
దివికరిగితి ధన్వంత్రితోతెలిసికొనగ.

ఆ॥ ఒక్కనాడు నేను కుక్కుటాండము వంటి
బరువుగుండునినుము పగిదినుండు
దాని నల్మర గని "తాతాయిదేమని"
అడిగి తంత తాతకశ్రులూరె!

ఆ॥ ఆగ్రహాన పలికె అపరంజిగాదీని
జేయనెంచియుంటి సేతునేమి!
పక్షవాతమిపుడు పైబడెనని విధి
నెంతతిట్టుకొంటి వంతజెంది!

ఆ॥ కుంటిమాబు తురుక కులమువాడైనను- వానిజాలితోడ స్వర్ణవృత్తి
పనినినేర్పి బ్రతుకుబాట జూపిన నీవు - మానవత్వమున్న మనిషివి కద!

గీ॥ స్వర్ణశిల్ప కళానిధీ! సర్వమాన - వాళికళ్యాణమూర్తి! విశ్వజ్ఞగోత్ర!
మత్పితామహ! గేయ రామాయణమున - నినుస్మరించితి సద్గతినీకొదవుత!

ఆ॥ నిమ్మపండువన్నె నీమయి వర్ణము - పదులతొమ్మిదైన పండ్లురాళ్లు
దీర్ఘనాసిక కొసతీరు వీణనుబోలు - మత్పితామహ నిన్ను మరువలేను

గీ॥ స్వప్నమున నిన్ను లోతుకూపమున గాంచి - నిన్నుపైకితీయగ ప్రయత్నించుచున్ను
అభినుతించుచు పైకి నీయంతనీవు - వచ్చితివి పుణ్యలోకసంప్రాప్తి నీకు
కలుగు శ్రీరామకృతిని నిన్ దలచుకతన

# రావణ వధ అన్వేషణ క్రమము

**ప్రథమాశ్వాసము (సర్గలు 1-19) :** సముద్రముదాటు ఆలోచన. రావణమంత్రాగం. దుర్నిమిత్తాలు చెపుతూ విభీషణ హితవు రావణ సభాచర్చ. కుంభకర్ణుడు మొదట నిదించి పిదప భ్రాతృప్రేమతో శత్రుసంహారం చేతుననుట. విభీషణ హితవు. రావణ దూషణ. విభీషణ శరణాగతి అభిషిక్తుడగుట.

**ద్వితీయాశ్వాసము (సర్గలు 20-35) :** రావణచారులు. సముద్రుని ఉపాసించుట సేతుబంధనం. రావణ గూఢచారులు. సారణ శుకులతో రావణ పరిశీలన. విద్యుత్‌జిహ్వుని తంత్రజాలము. మాతమాతామహుల హితబోధ.

**తృతీయాశ్వాసము (సర్గలు 36-50) :** రావణ లంకా రక్షణ వ్యూహం. రాముని రణవ్యూహం. సువేలాద్రిపై రేయివిడిది. అద్రిపైనుండి రాముడు లంకనుచూచుట. సుగ్రీవుని ఆవేశం రావణుతో మల్లయుద్ధం. అంగదరాయబారం. యుద్ధారంభం. దొమ్మిపోరు. నాగపాశబంధం. సీతవిలాపం. స్మృతికిరాని తమ్ముని చూచి రాముడు విలపించుట. గరుడునిరాక విమోచనం.

**చతుర్థాశ్వాసము (సర్గలు 51-67):** రాక్షసయోధులవధ. ప్రహస్తునివధ. రావణుడు మొదటిసారి రణభూమికి వచ్చుట. సుగ్రీవ హనుమ నీలాదులతో లక్ష్మణునితో యుద్ధం. రామరావణ ప్రథమ సంగ్రామం. రావణ భంగపాటు. కుంభకర్ణుని నిదుర మేల్కొలుపుట. రావణకుంభ కర్ణుల సంవాదం. సుగ్రీవాది వానర వీరులతో కుంభకర్ణుని యుద్ధం. రామునిచే కుంభకర్ణవధ.

**పంచమాశ్వాసము (సర్గలు 68-79) :** రావణనిర్వేదం. రావణ సుతానుజుల మరణం. ఇంద్రజిత్తు మాయయుద్ధం. బ్రహ్మాస్త్ర ప్రయోగం. హనుమంతుడు ఓషధగిరి తెచ్చుట. రామాదులు మూర్ఛదేరుట. వానరులు లంకను కాల్చుట. కుంభనికుంభాదుల వధ. మకరాక్షవధ.

**షష్ఠాశ్వాసము (సర్గలు 80-91) :** ఇంద్రజిత్తు మరల మాయయుద్ధం. మాయసీతను వధించుట. దుఃఖించురాముని లక్ష్మణుడోదార్చుట. ఇంద్రజిత్తు వధకై లక్ష్మణుడు విభీషణ హనుమదాదులతో వెడలుట. ఇంద్రజిత్తు విభీషణుల సంవాదం. లక్ష్మణుచే ఇంద్రజిత్తువధ. రాముని కృతజ్ఞతాగుణం.

**సప్తమాశ్వాసము (సర్గలు 92-103) :** రావణ విషాదం. సీతనుచంపబోవు రావణుని సుపార్శ్వుడు వారించుట. రాక్షసస్త్రీల విలాపం. రావణుడు ముగ్గురు మంత్రులతో యుద్ధానికి వెడలుట. సుగ్రీవుని విజృంభణ. విరూపాక్ష మహోదర మహాపార్శ్వులవధ. రామరావణ యుద్ధారంభం. లక్ష్మణ రావణ యుద్ధం. రావణుని గంటలశక్తిచే లక్ష్మణుడు మూర్ఛిల్లుట. మూర్ఛిల్లిన లక్ష్మణుని కపులకప్పగించి రాముడు రావణునితో పోరుట. రావణుడు నిలువలేక లంకకు పరుగెత్తుట. రాముడు మూర్ఛితుడైన తమ్మునిచూచి దుఃఖించుట. హనుమంతుడు ఓషధగిరి తెచ్చుట. మూర్ఛదేరిన లక్ష్మణుడు రాముని పోరుకు ప్రోత్సహించుట. ఇంద్రు పనుపున మాతలిరథము తెచ్చుట.

**అష్టమాశ్వాసము (సర్గలు 104-123) :** రామరావణ సంగ్రామం. అదిత్యహృదయం. రావణ సంహారం. రావణ మరణం సర్వలోక పర్వదినం. విభీషణ రావణరాణుల విలాపం. విభీషణ పట్టాభిషేకం. సీతకు విజయవార్త. సీత రాముని దర్శించుట. రాముని కఠినోక్తులు. సీతసమాధానం. అగ్నిపరీక్ష. బ్రహ్మాదుల ప్రత్యక్షం. అగ్నిదేవుడు సీత నిష్కళంకయని రామునికప్పగించుట. రామునిలోకజ్ఞత. రాముని ఆశ్రితవత్సలత.

**నవమాశ్వాసము (సర్గలు 124-131) :** అయోధ్యకు ప్రయాణం. రాముడు సీతకు మార్గమందు విశేషములు తెలుపుట. భరద్వాజాశ్రమం చేరుట. భరతునకు ముందువార్త. అయోధ్యనలంకరించుట. భరతరామ సమాగమం. రాముడునంది గ్రామానికి వచ్చుట. అయోధ్యకు వచ్చుట. పట్టాభిషేకం. ఉత్తరశ్రీరంగం. రామరాజ్యం. ఫలశ్రుతి. మంగళగీతి.

# రావణ వధ గేయకావ్యం

## ప్రథమా శ్వాసం

శ్రీగౌరీప్రియసుతునకు
శిరము వాల్చి కైమోడిచి
బాసరేశ్వరీ దేవికి
భక్తి నతుల సమర్పించి

వాల్మీకి మునీశ్వరునకు
వందనముల నాచరించి
తెనుగు కవీశ్వరులనెల్ల
మనసారగ ప్రస్తుతించి

తేట తెనుగు గేయములో
పాటవోలె పాడుకొనగ
రామాయణ కావ్యములో
'రామణవధ' రచియింతును.

### సముద్రము దాటు ఆలోచన

సింధువు లంఘించి లంక
జేరి సీతజాడ నెరిగి
మరలివచ్చి రామునకు న
మస్కరించి హనుమంతుడు

చూచితి సీతమ్మననుచు
శుభవార్తను వినిపించెను
హర్షాతిశయమున రాము
డతని కౌగిలించుకొనెను

ఆ కౌగిలి ఆనంద.
మ్మది కైవల్యమును మించు
అది పరమానంద మొ కా
దది బ్రహ్మానంద మేమొ !

హనుమంతా! మా యిర్వురి
అసువుల నిలబెట్టినావు
నీఉపకారమునకు నే
నేమీయ గలాడనయ్య !

అని హనుమని తనువెల్లను
తన చేతులతో తడుముచు
ఆప్యాయత పొంగిపొరల
ఆనందాశ్రులు రాల్చుచు

"అంబుధి దాటిన వీరా!
అస్మ దాపదాంబుధిలో
నీవునాకు నావవైతి
నీ ఋణమెటు దీర్చుకొందు"

అనురాముని కృతజ్ఞతా
గుణవృష్టి కృతఘ్నుదవా
గ్నుల నార్పగ వర్షించుత!
కలిలో ధర్మము నిల్చుత!

రాముని మాటలకు హనుమ
యేమనుటకు మాటరాక
పరవశించి రామయ్యకు
కరములు మోడిచి మ్రొక్కెను.

అంతట సుగ్రీవుడు విను
నట్లు రాముడిట్లనియెను
"సీతాన్వేషణ కార్యము
సిద్ధించెను కానిప్పుడు

ఈ వానరసైన్యముతో
ఈ వారిధి దాటుటెట్లు"
అనుచు దిగులుపడు రాముని
కనియెనిట్లు సుగ్రీవుడు

ప్రభూ! నీవు సామాన్యుని
పగిది దిగులుపడుట తగదు
పనులన్నియు దిగులువలన
పాడైపోవునటందురు

నిరుత్సాహ పడుట మాని
నీవు ధైర్యమూనవలయు
సముద్రమును దాటు ఉపా
యము నాలోచించవలయు

నీరధి మీదను వారధి
నిర్మాణముసేయుటెట్లొ
దాని గూర్చి చింతించుము
తక్కిన పని సులభమగును

అపుడు దిగులువిడి రాముడు
హనుమంతునితో నిట్లను-
"నా తపోబలము చేతను
సేతువు నిర్మించగలను

లేదా సాగరజలముల
తృటిలోనెండించగలను
హనుమా లంకానగర ర
హస్యములేమిటొ చెప్పుము"

అని రాముడు పలికినంత
హనుమంతుండిట్లెనియెను
"రాఘవేంద్ర! లంకాదు
ర్గము దుర్భేద్యంబయినది

దానికి నాలుగు సింహ
ద్వారంబులు గలవు వాటి
నహర్నిశలు ఘోరభయం
కరదైత్యులు రక్షింతురు

లంకాపురి దుర్భేద్యము
రావణుడతి బలవంతుడు
రాక్షస సైనికులంత సు
శిక్షితు లైనట్టివారు

లోనికడుగు పెట్ట పురుగు
కైన వశము గాకుండును
అయినా భయమేమిలేదు
ఆలంకను జొచ్చి నేను

వారలతో పోరుసలిపి
వచ్చినాను కాదా ఇక
లంకమీద దాడిచేసి
రాక్షసుల వధించగలము

ఆజ్ఞనిమ్ము రామా! విజ
యమ్ము మనకు నిశ్చయమ్ము
దండయాత్ర కాజ్ఞనిమ్ము
దాశరథీ మనకు జయము".

ఆనాడుత్తర ఫల్గుణి
అది రామయ్యకు సాధన
తారయగుటచేత బయలు
దేరినారు వారందరు.

అభిజి ల్లగ్నముహూర్తం
బయ్యది మధ్యాహ్నవేళ
వానరసేనలు కిష్కిం
ధానగరమునుండి వెడలె

శుభశకునాలనేకములు
సూచితమయ్యెను వానర
సేన వెడలి దక్షణదిశ
గా నడుచుచు పోసాగెను

పింగళ వర్ణము గలగి కపి
పుంగసేన యది రెండవ
మహాసాగరమువలె శ్రీ
మంతంబై యలరారెను

వారప్పుడు మహేంద్రగిరి
పైనికెక్కి చూచినారు
శతయోజనముల దాకను
జలధి విస్తరించియుండె

దాని దాటు నుపాయమే
దైన దోచదయ్యెనపుడు
బిరిబిర గిరిదిగి వారం
దరు సాగరతటి జేరిరి

మనమిచ్చట విడియుదమిక
ఇన నందన మన మావలి
యొడ్డుజేరుకొను నుపాయ
మొనరగ నాలోచింతము

సముద్రాని కావలి తీ
రమెయున్నట్లగుపించదు
దీని దాటు మార్గమేది
యైన గాని కనిపించదు

ఆకాశము అంబుధివలె
అంబుధి ఆకాశమట్లు
అగుపించుచు వాటిమధ్య
అంతరమే అగుపించదు

పెద్ద పెద్ద మొసళ్లతో
పెను చేపలతో విషస
ర్పాలతో మహార్ణవ మిది
పరమ భయంకరమైనది.

ఇట్టి మహాజలధి దాటు
టెట్లాయని శ్రీరాముడు
ఆవానర వీరులతో
ఆలోచింపగ సాగెను

కడలి రత్నములతో ఆ
కసము తారకలతో సా
మ్యము గలవై కన్పట్టుచు
అతివిచిత్రముగ దోచును

సముద్రమంబరము పగిది
సంశోభిల్లుచు నున్నది
అంబరమంబుధి చందము
అల విలసిల్లుచు నున్నది.

## రావణమంత్రాంగం

అట లంకా నగరములో
అసురేంద్రుడు దశకంఠుడు
సచివ బంధు మిత్రులతో
చర్చింపగ సభ చేసెను

లజ్జా భర వదనుండై
లంకేశుడు సభాసదుల
సంబోధించుచు వారల
సలహా గోరుచునిట్లనె.

ఓ రాక్షస వీరు లార!
మీరంతా యుండి కూడ

ఈ లంకాపురములోని
కేలాగున ఒక్కకోతి
ప్రవేశించుటే కాకను
ప్రాసాదాలను కూల్చెను

జనకసుతను చూచినాడు
మన లంకా నగర రహ
స్యాలను కని పెట్టినాడు
శత్రుదూత కోతివాడు

మనవీరుల నెందరినో
మట్టుపెట్టి మనలంకా
పురమంతా కాల్చివేసి
తిరిగి వెళ్లి పోయినాడు

ఇది మనరీవికి భంగము
ఇది మనకవమానకరము
ఇది మన రాక్షస జాతికె
యెంత కళంకమొచూడుడు

జయము మంత్రమూల మంద్రు
సచివోత్తములారా! మీ
రిప్పుడు మనకర్తవ్యమ
దేమిటొ ఆలోచింపుడు

వేలాదిగ కపివీరుల
తో లంకా పురిపై దం
డెత్తి వచ్చె రాముడు వా
డిక జలధిని దాట గలడు

అతడు పరాక్రమము చేత
అంబుధినెండించగలడు
లేదా మరియొక యుపాయ
మేదైనా పూన గలడు

నాహిత మెయ్యదియో లం
కాహిత మెయ్యేదియోదా
నిని గూర్చి సమగ్రముగా
నిర్భయముగ చెప్ప గలరు

అని రావణుడీ విధముగ
అడిగినంత బుద్ధిలేని
నీతి లేని బలశాలురు
నిశాచరులు పల్కిరిట్లు.

రాక్షసేంద్ర! మన సేనలు
శిక్షితులై దుర్జయులై
యుండగ మీరేల యిట్టు
లూరకయే చింతింతురు

ప్రభువర! పరిఘలు శక్తులు
పట్టిసములు శూలాయుధ
ములు నెన్నో మనదగ్గర
గలవు శత్రువుల జంపగ

మంత్రశక్తి తంత్రశక్తి
యంత్రశక్తి మనకున్నది
మానవ మారణహోమము
మనకు నుగ్గుపాల విద్య

రాక్షసవీరులము మేము
రామలక్ష్మణుల రణమున
మాయలెన్ని పన్ని యైన
మట్టుపెట్ట గలవారము

యుద్ధనీతి మాకేటికి
యుద్ధములో శత్రువులను
వెన్నుపోటు పొడిచియైన
విజయము సాధించగలము

ప్రాణముతో చిక్కెనేని
పగవానిని చిత్రహింస
పెట్టి కిరాతక చర్యల
మట్టుపెట్ట గల వారము

(చేజిక్కిన పగవానిని
చిత్రహింస పెట్టుట రా
క్షసులెరుగరు కానిప్పుడు
కార్గిల్ శత్రువు నేర్పెను.)

ఓ రాజా! నీ వూరక
ఉండుమొక్క ఇంద్రజిత్తు
వానరసేనల నెల్లర
వధగావించగ జాలును

అసురేంద్రా! మీరింతగ
ఆందోళన జెందనేల
కోతి మూకతో మానవ
మాత్రుడైన రాముడెంత?

వానిని బరిమార్చి వాని
సేనల హత మార్చగలము
నీవిక వైదేహిగూడి
నిశ్చింతగ సుఖియింపుము

పన్నగుల జయించినావు
పరమేశుని సఖుని కుబే
రుని జయించి పుష్పకమును
గొని లంకకు తెచ్చినావు

బ్రహ్మవరాల్ పొందినావు
భండనమున దేవేంద్రుని
జయించితివి దుర్జయుడవు
శత్రుభయంకరుడ వీవు

నీవా మానవ మాత్రుని
కింత భీతి జెందనేల?
నీభయమున గ్రహాలన్ని
నీ ఆనతి మీరవుగద!

మనమేమరి యున్నపుడొక
మర్కట మాగడ మొనర్చె
లేకుంటే మనచే యమ
లోకానికి పోకుండున?

మనలో వేలాది మంది
మానవరూపము ధరించి
భరతుడు పంపగ వచ్చిన
వారల మని నమ్మింతుము

రామునితో కలిసిపోయి
లంకకు రాగలము నింగి
పైన నుండి క్రిందనుండి
పగతురపై దాడిచేసి
క్షణములోన శత్రువులను
సంహరించి వేయగలము

ఇటుల కుటిల నీతితోడ
ఎదురుదెబ్బ చాటు దెబ్బ
కొట్టికొట్టి శత్రువులను
మట్టుపెట్టి వేయగలము.

ఓరాక్షస రాజా! మే
ముండగ నీకేలభయము
శత్రువులను చంపగలము
జయము నిశ్చయమ్ము మనకు

అనితమ బలపరాక్రమా
లను గురించి చెప్ప కొనుచు

ప్రగల్భాలు పలికినారు
ప్రహస్తాది నిశాచరులు

కొలువు జేరి విభుని తీపి
పలుకులతో మభ్య పెట్టి
తప్పుదారి పట్టించెడి
గొప్ప వారలెపుడుండిరి.

దాయిలున్నది శిశువును
దగా చేసి చంపుటకా?
సచివాగ్రణులున్నది తమ
జనపాలుని కూల్చుటకా ?

మూఢ ప్రభు కొలువునందు
మూఢసచివులే యుండిరి
దశకంఠుని మంత్రులంత
తప్పుత్రోవ పట్టించిరి.

జ్ఞానాంధుడు దశకంఠుడు
జ్ఞానహీన మంత్రులతో

గూడినాడు గ్రుడ్డివాడు
గ్రుడ్డివాండ్ల గూడి నట్లు

**విభీషణహిత బోధ**

చేతులను జోడించి అన్నకు
శిరము వాల్చి నమస్కరించి వి
భీషణుడు నిర్భయత సభనభి
భాషణముగావించె నిట్లని

భ్రాత! విను మనమిపుడె దండో
పాయమును చేపట్టకూడదు
ఇంకనూ సామాదులను మన
మేమి యుపయోగించమైతిమి

రాముడే మరుపాటులేని దు
రాధర్షుడు మహాబలాఢ్యుడు
అతడు మన కేకీడు చేసెను
అపహరించితి వతని భార్యను

తనకు తానే ఖరుడతనిపై
దాడి చేసెను ఆత్మరక్షణ
కై వధించెను ఖరుని రాముడు
నీవతనిపై కేగుటెందుకు?

పరస్త్రీలను పట్టి తెచ్చుట
పరమ పాపమటంచు తెలియద?
అట్టి పాప ఫలంబు లంకా
పట్టణమునకు నాశహేతువు

రత్నములతో నేనుగులతో
రమ్యమై అలరారు లంకను
దాశరథి తన భాణములచే
నాశమొనరించుటకు ముందే

జానకిని రాఘవున కీవలె
కానిచో రాక్షసులు హతమై
లంకనాశనమగుట తథ్యము
భ్రాత! నాహితవాక్కువిన వలె

అన్నయా! నేబంధు ప్రీతిని
విన్నవించితి హితము వినమని
అను విభీషణు నాదరించక
అసురనాథుడు సభముగించెను.

## దర్నిమిత్తాలు తెలుపుతూ ఇంటికేగి హితవు చెప్పట

రాత్రిగడిచెను వేకువాయెను
రావణేంద్రుని విజయమునకై
వేద మంత్రధ్వనులు మంగళ
వాద్యశంఖధ్వనులు మ్రోగెను.

రావణుని దర్శించగా ధ
ర్మాత్ముడు విభీషణుడు వచ్చెను
జయముపల్కినమస్కరించి ప్ర
సన్నునిగ రావణుని చేసుక-

అగ్రజా! మనలంకలోనికి
అగ్నికణములు పొగలుకమ్మను
అగ్ని హోత్రగృహాల వేదా
ధ్యయనశాలల పక్వశాలల

ఉరగములు కన్పడుచున్నవి
కరులు మదమును కార్చుకున్నవి
హవికిచీమలు పట్టుచున్నవి
ఆవులకు పాలెండుచున్నవి.

కాకి మూకలు అరుచుచున్నవి
గ్రద్దగుంపులు తిరుగుచున్నవి
ఉభయ సంధ్యల నక్కగుంపులు
అభంకరముగ అరుచుచున్నవి.

ఈ అమంగళ సూచకములగు
ఈనిమిత్తాలన్నియును మన
లంకకును రాక్షసులకును ని
శ్శంకగా రాబోవుకీడును

తెలుపుచున్నవి అట్టి కీడును
తొలగజేయగ సీతనిపుడే
రామునకు నర్పించుటొకటే
క్షేమకరమని నాకు దోచును.

ఇదియు నంతయు దెలిసికూడను
ఇట్టియాలోచనమునెవ్వరు
నీకు భయపడి చెప్పకుండిరి
నీముఖస్తుతి చేయుచుండిరి.

భయముచే సత్యమునుదాచుట
పాడియైనదినాడు నేడును
నిజము దాచుటకన్న చాటుట
విజయకరమని తలతురెందరు?

## రావణ మూర్ఖత్వం

తనకు మంచి చెప్పిన త
మ్ముని మాటలు లెక్కించక
పరమ కోపమున నాతని
పంపించెను దశకంఠుడు

శునకంబెముకను కొరుకుచు
తననోటిని గాయపరిచి
గార్చు నెత్తురును ద్రాగుచు
కమ్మగనుందని తలచును

కామమోహమున మూర్ఖుడు
కన్నులు గప్పగ సత్యము
గాంచలేక గ్రుడ్డివాని
కరణి గుంట పడిపోవును

కాలముముంచుక వచ్చిన
కాలుడైన నిలువలేడు
లంకేశ్వరుడెంత వాని
ప్రాణాలను తోడివేయు

ఏటమునిగి పోవువాడు
తోటివాని ముంచినట్లు
రాక్షసజాతినె ముంచెను
రావణాసురుడు మూర్ఖుడు

నాకుదేని వలన అమం
గళమురాదు నాకెవ్వని
వలన భయములేదని రా
వణుడు విర్రవీగి పలికె

తనయింటికి వచ్చి హితవు
తగ చెప్పిన విభీషణుని
వీడుకొలిపి గర్వముతో
వెడలె మహాసభాస్థలికి.

## రావణ సభా చర్చ

మంత్రి బంధుమిత్రులు సా
మంతులైన వారెల్లరు
గుంపులు గుంపులుగజేరి
ఇంపుగ సభకరుదెంచిరి.

కుంభకర్ణ విభీషణ ని
కుంభ మహాపార్శ్వ ప్రహ
స్తాది ముఖ్యగణములెల్ల
రా సభకరుదెంచి నారు

తాచేసిన పని తప్పని
దానికప్పిపుచ్చనెంచి
అనునయ మొలకించి సభను
అనుకూలము జేసికొనగ
సభను కలయ జూచూచు రా
క్షస రాజిట్లని పలికెను.

మహావీరులారా! మీ
సహాయమున ఎన్నో ఘన
విజయములను సాధించితి
విఫలుడ కాలేదెన్నడు

మీ సలహాసహాయాలు
మేలెప్పుడు నాకు గూర్చె
కానిప్పుడు ఒక విషయము
కలవరపడజేసెనన్ను

నేనీవిషయము ముందుగ
నే మీకెరిగించ నుంటి
కాని అప్పుడింక కుంభ
కర్ణుడు నిద్రించుచుండె

ఇది రావణవాక్పతురత
ఇందునిజము కానరాదు
ఆలోచనకై విభీష
ణాదులు లేకున్నారా

ఆలోచించక చేసిన
అపరాధము పామువోలె
వెంటాడగ తప్పుకొనగ
వెయ్యి అబద్ధాలాడును

దండకాటవిని రాముడు
దారసహోదరులతోడ
నున్నప్పుడు ఒంటరిదై
యున్నప్పుడు మాయచేసి

రాముని ప్రియపత్ని జనక
రాజపుత్రి సీతను నే
నపహరించుకొని తెచ్చితి
ఆమె మోహమున చిక్కితి

ఆమె అందచందమునకు
కామపరవశుండనైతి
ఆమెను వశపరుచుకొనుట
కహరహ మారాట పడితి

అందరాని ద్రాక్ష కొరకు
అర్రులు చాచెడి బుడుతని
చందము నేనాసుందరి
పొందుకొరకు తపియించితి

దూరాలకు పరుగెత్తిన
తురగమట్లు కామభార
మున కడు అలసితిని కాని
నను జానకి వలను గొనదు

ఎంత వేడు కొన్నగాని
ఇంతి సెజ్జపై కెక్కదు
రాముని హతమార్చినచో
రమణి మనసు మారగలదు.

వెడద కనులు గల జానకి
విభుని రాక కెదురుచూచు
చొక్క ఏడు గడువు కోరి
యున్నది నే సరి యంటిని.

తనకు తానె గడువు నిచ్చి
ధరాతనయ కోరినదని
అనృత మాడి సభవారిని
అడ్డదారి పట్టించెను.

తాను దొంగిలించి ఒకని
పైన నేరమును మోపెడు
దానవాధముని మాడికి
మానవాధములు నుండిరి.

మదన పీడితుడనై ఆ
మదవతి నెటు విడువగలను
రామలక్ష్మణుల వధించి
రామసతిని చేపట్టుదు

అయినను మనమనుకున్న
ట్లవదు కదా! ప్రతియొక్కటి
దైవ వశము కావున మీ
రీ విషయము యోచింపుడు

ఒకే ఒక్క కోతి వాడు
ఉదధి దాటి లంక జొచ్చి
సీతను గనుగొని లంకను
చీకాకొనరించి వెళ్లె

వారధి కావలి యొడ్డున
వానరసేనా వాహిని
తో మనపై దండెత్తగ
రామలక్ష్మణులు వచ్చిరి

మన్మథపరవశుడను నే
మహితనయను విడువలేను
వైరుల కడతేర్చి కాని
వైదేహిని పొందలేను.

రామలక్ష్మణుల జంపుట
రామసతిని నే పొందుట
దీని గూర్చి యుపాయమే
దైన మీరు చెప్పవలయు

అనురావణు మూర్ఖపు భా
షణ మాలించిన నెంటనె
కోపావేశమును జెంది
కుంభకర్ణుడిట్లనియెను.

**కుంభకర్ణుడు మొదట నిందించి పిదప శత్రువు సంహారము జేతుననుట**

పరస్త్రీని కామించిన
పశుప్రాయుడా! సీతను
తనవారలు లేనప్పుడు
దగా చేసి తెచ్చినావు

బలాత్కారముగ సీతను
పట్టితేక ముందే నీ
వీయాలోచన చేయక
ఇపుడు చేసిలాభమేమి?

సభలో నేనొకడ లేని
సాకునుకొని సభచేయక
స్వేచ్ఛగ స్వార్థేచ్ఛకు బలి
చేసినావు జాతినెల్ల-

ఇక రావణ! నీకృత్యము
నెవరు సమర్థించ తగదు
యుపాయ మాలోచింపక
అపాయమును తెచ్చుకొంటి

వయినను నీతో బుట్టువు
నైనందున శత్రువులను
వధియింతును రణమందున
వారు ఇంద్రవరుణులైన,

నీకృత్య మకృత్యమైన
నీకోరిక దీర్చుటకై
ఆపదలో నిను వీడను
అసువులడ్డుపెట్టగలను.

రామలక్ష్మణుల వధించి
రామసతిని చిరకాలము
నీ వశవర్తినిగ జేతు
రావణాగ్రజా! నమ్ముము.

(జాతినీతి యేమైనా
స్వార్థానికి మిన్నకాదు
నాడును నేడును కొందరి
పాడు బుద్ధులిట్లుండును)

రాజ భక్తు డెవడు? విప
ద్రాజినుండి తన రాజును
విడువక తనప్రాణాలను
విడువనైన విడుచువాడ?

రాజ భక్తుడెవడుర? దు
ర్మార్గుడైన తనరాజును
సన్మార్గము బట్ట జేసి
శాంతికై శ్రమించువాడ?

భ్రాతృ భక్తికన్న మిన్న
రాజభక్తి కాదా మరి
రాజ భక్తి దేశ భక్తి
రాజిలునా ఒక్కటిగా?

తప్పుదారిబట్టు ప్రభువు
తామునుగుచు ప్రజలముంచు
మునుగువాని బట్టుకొనుట
మునుగుటకా? తేలుటకా?

పాడుబుద్ధి ప్రభువును బల
పరుచుటయా విరుచుటయా
పాడైపోవుట కొరకై
ప్రభుభక్తిని చాటుదురా!

ఎవడు వాడు ఎవడు వాడు?
ఎవడు దేశభక్తుడు? దే
శవినాశము నుండి రక్ష
సలుప ప్రయత్నించువాడు?

వాడు విభీషణుని వంటి
వాడెకదా! విషమించిన
అంగంబును ఖండించుట
ఆవశ్యక మౌనుకదా!

"రామలక్ష్మణుల వధించి
ఆ మర్కట సమూహాల
మ్రింగి వేతు యదేచ్ఛముగ
క్రీడించుము భోగించుము

రామ మరణవార్తను విని
భూమిజ నీపదములపై
పడిపోవును నీవిక ఆ
పడతి గూడి సుఖియించుము

మహాపార్శ్వ ప్రహస్తాది
మంత్రులు రావణుని ముఖ
ప్రీతి కొరకు ప్రగల్భాలు
రీతి దప్పి పలికి నారు

ఇంద్రుని బంధించినాను
ఇకయీ నరవానరులన
భయమేలని ఇంద్రజిత్తు
ప్రగల్భాలు పలికినాడు

అంతవరకు లంకేశుని
లంతరాత్మ సవ్యాస
వ్యాలకు అటుయిటునూగిస
లాడుచుండగా యిప్పుడు

కుంభకర్ణ ధైర్యోక్తులు
కొండంత బలమ్ముగూర్చ
ప్రహస్తాది మంత్రుల ప్రో
త్బలము మదమునుసికొల్పెను.

పెద్దకొడుకు యింద్రజిత్తు
బిరుసెక్కిన పొగరు కూత
లింద్రజాలమట్లు రాక్ష
సేంద్రుని పెడదారి నెట్టె

దశకంతుడు అపసవ్యపు
దారి బట్టినాడిప్పుడు
కుమతుల మంత్రాంగముతో
కూలిపోక తప్పదతడు.

మదమెక్కిన మత్తేభము
మాద్కిదశగ్రీవుడు దుర
హంకారమదాంధు డగుచు
ఆ సభ నిట్లని పలికెను.
పోరులో మహేంద్రునంత
శూరుని ఓడించి నాను
దేవదానవాదులనే
తికమక పట్టించినాను

ఈ మానవ మాత్రు లెంత
యీ వానర జాతి యెంత
నా ప్రతాప దావాగ్నికి
నాశనమై పోకుందురె?

సంగ్రామములో రాముని
సంహారము గావింతును
వైదేహిని యెట్లైనను
వశవర్తిని జేసి కొందు.

## విభీషణ హితోక్తి

అను లంకేశుని మాటలు
విని లేచి విభీషణు డి
ట్లని పలికెను రాజా! నీ
వట్లనకుము అట్లనకుము

జనకజ యను కాలసర్ప
మును మెడలో వేసికొంటి
వదినిను కరువక మానదు
అన్నా సీతను వదలుము

రామబాణములు నిను నీ
రాక్షసజాతిని చంపును
వానరసేనా మహా ప్ర
వాహిని లంకను ముంచును.

నామాటల నాలకించి
భూమి సుతను రామునకిడి
సుఖముగ నుండుము లంకను
క్షోభనుండి రక్షించుము.

మహా పార్శ్వ ప్రహస్తాది
మంత్రి గణము కుంభకర్ణ
మేఘనాథ నికుంభాది
మేటి వీరులెందరైన

రామ శరాస్త్రాగ్ని భస్మ
రాశులౌదురిది సత్యము

రాక్షసజాతి సమూలము
గా క్షయమొందక ముందే

రావణాగ్రజా! సంధికి
రావలె సీతను రామున
కర్పించి శరణ్యమనుట
అత్యంతా వశ్యకరము

నీవిక రాక్షసజాతిని
నీటముంచెదో లేదా
సంక్షోభము నుండి జాతి
సంరక్షణ జేసికొనెదో!

నీవిపుడే తేల్చి కొనుము
నీజాతి శ్రేయమునే
కాంక్షించెదొ లేక జాతి
సంక్షోభము వాంఛించెదో!
ఓ రాక్షస రాజేంద్రా
నీరాక్షస మంత్రాంగము
నిను నీటను ముంచివైచు
నీజాతిని త్రుంచివైచు.

ముఖప్రీతి కై నీ మె
ప్పును పొందుటకై యీ మన
మంత్రులంత నిన్నిపుడప
మార్గము పట్టించినారు

ఇప్పటికైనను మించిన
దేమిలేదు సీతను రా
మునకిచ్చి శరణ్యమనుము
మన జాతిని రక్షంచుము.

అధర్మమును అక్రమమును
అరికట్టే వాడెవడు వి

భీషణు విన లంకలోన
వెతకిచూడ లేడెవ్వడు.

సీతను రాముని కిచ్చుట
క్షేమకరము నీకును నీ
బంధుమిత్ర రాక్షసులకు
సందేహము లేదిందున

కానిచో సబాంధవముగ
కాకుత్థ్సుని బాణాలకు
ఆహుతియై పోకతప్ప
దగ్రజ! నామాటవినుము

ధర్మరతుండగు రాముని
ధర్మమెపుడు రక్షంచును
ధర్మోరక్షతి రక్షిత
ధర్మసూక్తి కలదు కదా!

అన్నా నామాట వినుము
అసురజాతి రక్షించుము
నామాటలు అప్రియమై
నను నను నమ్ముము నమ్ముము.

అని హితవాక్యము పల్కిన
ఆవిభీషణుని గని రా
వణు డిట్లని కఠినముగా
పలికినాడు నిండుసభను.

**రావణ దూషణ**

శత్రువుతో నైన కుపిత
సర్పము తో నైనను సహ
వాసము తగు కాని సఖుని
వలెనటించు శత్రువుతో

కలిసియుండ రాదు జ్ఞాతి
జ్ఞాతులకెప్పుడు కష్టము
కలిగిన సంతోషించును
జ్ఞాతివైరమిది సహజము.

ఉన్నత పదవులనందుచు
సన్నుతినొందుచునుండిన
జ్ఞాతిని తక్కువ జూతురు
జ్ఞాతి వైరమిది సహజము

సంపదలో కలిసియుండి
సంకటమున విడిపోదురు
ఇది దాయాదుల నైజము
ఎద నొచ్చును వివరించగ

జ్ఞాతులందు ముఖ్యుడనై
సకలైశ్వర్యములననుభ
వించుచుండనోర్వలేక
వికటముగా మాట్లాడెదు.

నాచే సుఖముల బడయుచు
నా శత్రువునే పొగడెదు
తుమ్మెద పూదేనె డ్రాగి
పిమ్మట పువు వీడునట్లు

స్నానమాచరించి పిదప
సామజమది తొండముతో
దుమ్ముజల్లు కొను నట్లుగ
దుష్టుని వలె వర్తించితి

వురుములురిమి చినుకైనను
కురియ నట్టి మేఘమువలె
ఉపకరించునటు నటించి
అపకరించు దుష్టజనుడు

చపలత్వము స్త్రీలయందు
సాధుత్వము గోవులందు
జ్ఞాతులందు అపకారము
కలిగియుండు టిది సహజము

ఓ విభీషణా! నీవు స
హోదరుడవు కాకయిట్లు
మాట్లాడిన వాని శిరము
మరుక్షణమె యెగిరియుండు.

ఛీఛీ కుల పాంశకుడా!
ఛీఛీ నీ మొగము జూడ
ద్రోహి! నీవిచటి నుండి
తొలగి పొమ్ము తత్క్షణమే

ఈ విధముగ కోపముతో
రావణాసురుడు పలుకగ
అవమానము సైచలేక
హస్తమ్మున గదను దాల్చి

తన నలువురు సచివులతో
విను వీధికి నెగిసిపోయి
అచట నుండి విభీషణుడు
అన్నతోడ నిట్లనియెను.

రావణాగ్రజా! విను నా
కీవు అన్నవైనందున
నీహితవును గోరినేను
ఇంతగ చెప్పితిని కాని

కాలము ముంచుక వచ్చిన
కారణమున నామాటలు
చెవికెక్కక పోయె నింక
చేటు దాపురించ నుండె.

అన్నా! నా మాటలు నీ
కప్రియమైనను హితకర
మైనవి నీ అహమువలన
అందు నిజము గన నైతివి.

అహమువల్ల అంధుడవై
అద్దములో చూడలేవు
స్వార్థముతో వాస్తవమను
సౌందర్యము గాంచలేవు.

ఇచ్చకోలు చెప్పు వారు
యెందరైన కలరు గాని
చేదునిజము చెప్పరెవరు
చెప్పిన విను వారుండరు.

అగ్నిచే దహించు గృహము
నార్ప ప్రయత్నించునట్లు
రాబోయెడి కీడు నివా
రణకై నింతగచెప్పితి

ముప్పు నుండి నిన్ను నేను
తప్పింపగ పలికిన నా
పలుకులు వినవైతి కాల
వశుడవగుట చేత నీవు

నే నిచ్చుట నున్న నీకు
హాని కలుగు ననుకొంటివి
ఇచటి నుండి వెడలు చుంటి
నీవిక సుఖముగ నుండుము.

## విభీషణ శరణాగతి-అభిషేకము

అని విభీషణుడు నల్వురు
అమాత్యులను గూడి రామ
లక్ష్మణాదులున్నట్టి స్థ
లంబున కరుదెంచినాడు.

గగనవీధి కదలి దాటి
గదాపాణియై ఎవడో
అనుచరచతుష్ట యముతో
అరుదెంచుచు నున్నాడిట

వాడెవడో రాకాసుడు
వాడుమనల వధియించుట
కైవస్తున్నాడని సు
గ్రీవుడు సందేహించెను.

వెను వెంటనె కపులు సాల
వృక్షములను పెరికి దాడి
చేయ సిద్ధమైనంతట
నేయిట్లనె విభీషణుడు-

ఓ వానరులార నేను
రావణు తమ్ముడను విభీ
షణుడను నాఅన్నను సీ
తను రామునకిమ్మంటిని

నామాటలు వినక అతడు
నన్నువెడల గొట్టినాడు
శరణార్థుడ నన్ను మీరు
శంకించగ వలదు వలదు.

నావాళ్లందరిని వదలి
నాను రామమూర్తిశరణు
గోరవచ్చితీ సంగతి
శ్రీరామునకెరిగించుడు

అనికోరిన విభీషణుని
అనుమానించుచు సుగ్రీ
వుడు నాతని కాశ్రయ మి
వ్వడము కూడదని పలికెను.

తదితర వానరులంతా
తరణిసుతుని బలపరిచిరి
కాని ఒక్కహనుమంతుడు
కాదని వ్యతిరేకించెను

విభీషణుడు శరణుగోరి
విచ్చేసినవాడు గాని
ఇతడు శత్రువై ఇచ్చటి
కేతించిన వాడుకాడు.

ఇతని ముఖములోన కపట
మింతేనియు కానరాదు
కపట మెంత దాచిన అది
కనుపించక మానదెపుడు

కనుక విభీషణుని మనము
మనవాడుగ చేర్చుకొనుట
కనుమానము కానరాదు
అని హను మంతుడు పలికెను

"నన్ను శరణు వేడుచు ను
న్నానని ఎవడనిన కాని
వానికి నేశరణ మిడుదు
వాడెంతటి దోషియైన

ఇది నాదీక్ష యటంచును
ఇకనను శరణన్న వాడు
రావణుడైనను వాని తి
రస్కరించ జాలననుచు

మీరు వెళ్లి విభీషణుని
కూరిమి దోడ్కొని రండని
రాముడనగ సుగ్రీవుడు
రయమున నతనికి దెల్పెను

విభీషణుడు యెకాయెకిని
వెడలి వచ్చి రాముని పా
దాలపైన వ్రాలి పోయి
దాశరథీ శరణ మనెను.

శరణమన్న విభీషణుని
శిరమున చెయి మోపి 'అభయ
మిచ్చితి లంకారాజ్యము
నిచ్చితి' నని రాముడనెను

రాముడడుగ విభీషణుడు
రాక్షసుల రహస్యాలను
తెలియపరుచ రావణుని వ
ధించ ప్రతిజ్ఞను జేయుచు

సౌమిత్రీ! శీఘ్రముగా
సముద్రజలమును తీసుక
రమ్మిపుడే విభీషణుని
లంకకు రాజును జేతును.

అని రాముడు పలుకగ ల
క్ష్మణుడంబుధిజలమును గొని
రాగానె విభీషణుని
రఘువరు డభిషేకించెను.

## ద్వితీయ శ్వాసము

### రావణచారులు

తన తమ్ముడు విభీషణుడు
తనను విడిచి వెళ్లి శత్రు
వును జేరిన వెంటనె రా
వణు డాందోళన జెందెను

తమ్మునిచే శత్రువునకు
తన లంకారహస్యాలు
తెలసిపోవు రామలక్ష్మ
ణుల వ్యూహంబెట్లున్నదొ!

సముద్రమున కుత్తర తీ
రమున శత్రుసేన విడిచి
యున్నదనుచు శార్దూలుడు
విన్నవించె రావణునకు

శుకుడు రావణుడు పంపగ
సుగ్రీవుని కడకు వచ్చి
నింగినుండి రావణసం
దేశమిట్లు వినిపించెను.

"ఋక్షరజసు కొడుకు వీవు
కక్ష మనకు తగదు మనము
బ్రహ్మకు మనుమలము భ్రాతృ
సములము పగయేల మనకు

జనక నందినిని రాముని
సతిని నేను కొని తెచ్చిన
నీకేటికి బాధ తిరిగి
నీవారలతో వెళ్లుము"

అని రహస్య సందేశము
వినిపించెడి శుకుని కపులు
పట్టుకొనిరి బంధించిరి
గట్టిదెబ్బలే కొట్టిరి.

రామప్రభు నే దూతను
రక్షింపుండని యరచెను.
రాముడంత వానిజంప
రాదని విడుడని చెప్పెను.

వాడప్పుడు బ్రతికి నింగి
పైకి నెగిరి సుగ్రీవా!
అసురేశునకేమి చెప్ప
మందువనుచు నర్థించెను.

"రాక్షస రాజేంద్రా! నే
రామప్రభునకు మిత్రుడ
నీ వతనికి శత్రువగుట
నేను నీకు శత్రువైతి.

పర దారాపహరణమను
పాపకృత్యమున వధ్యుడ
వైతివి వాలిని జంపిన
యటు నిను రాముడు జంపును.

నిన్నును నీలంకలోని
నిశాచరుల నెల్లర హత
మార్చగలము ఇక కుట్రప్ర
యత్నంబులు మానుకొనుము

వాలికి మిత్రుడవు నీవు
వాలి నాకు శత్రువగుట
నీవు నాకు శత్రువైతి
నీవధయే నాధ్యేయము.

ఇట్లంటిని అని మీ దను
జేశుని తో చెప్పు మనుచు
సుగ్రీవుడు పలుకగ విని
శుకు డటు యిటు చూడసాగె

వీడు దూత కాడు వీడు
గూఢచారుడని ప్లవగులు
క్రుద్ధులునై వాని బట్టు
కొని కొట్టిరి బంధించిరి.

సేతు బంధనమ్ము జేసి
సింధువు కావలి యొడ్డును
జేరుకొనిన పిదప కాని
వారు వాని వదల లేదు.

## సముద్రుని ఉపాసించుట

దర్భశయనుడై రాముడు
తనభుజమును దిండుజేసి
కొని పరుండి ప్రాఙ్ముఖుడై
వనధుని సంప్రార్థించెను

నిద్రాహారాలు మాని
నియమ దీక్షతో యెంతగ
ప్రార్థించిన గాని నదీ
పతి దర్శన మీయడాయె.

మూడు నిశలు గడిచెను రా
ముని సహనము దహనమయ్యె
గర్వదర్పమున రత్నా
కరుడు ప్రసన్నుడు కాడయె

సౌమిత్రీ! చూడు నేను
సౌమ్యుడనని లెక్కించక

నాప్రార్థన మన్నించడు
నాకు ద్రోవనీ నొల్లడు.

వీడెంతటి గర్విష్ఠియొ
విదితమయ్యె నేనిపుడే
వీని గర్వమడచెద నా
విల్లంబుల నందీయుము.

శమదమాదిలక్షణముల
జడుడెంచును అసామర్థ్య
లక్షణాలుగా, క్రూరుని
లక్షింతురు లోకులెల్ల

లక్ష్మణ నేనిపుడే ఈ
రత్నాకరు పొగరణతును
అస్మత్ బాణాగ్నికీమ
హార్ణవంబు నెండింతును

సౌమిత్రీ! ఈ సముద్రు
డేమను కున్నాడు నన్ను?
కపిసేనలతో నావలి
గట్టు జేరుదును జూడుము.

అని కోపావేశముతో
కనులు ద్రిప్పుచును రాముడు
శరమును సంధించి వదలె
సంక్షుభితంబయ్యె జలధి

అమహార్ణవములో పెను
అలజడి పుట్టెను జడిసిన
మీన మకర సర్పాదులు
మింటికెగసి పడిపోయెను

పెను గాడ్పులు వీచె ప్రళయ
భీకరబాణాగ్ని కలలు
సుడులు దిరిగి మంటికెగసి
పిడుగుల చప్పుళ్లుచేసె.

ఓ సముద్రుడా! నిన్నిపు
డే సపాతాళముగ నిం
కింప జేతు కాచుకొమ్ము
ఇదిగో నాబ్రహ్మాస్త్రము.

రాముడట్లు తిరుగులేని
బ్రహ్మాస్త్రము సంధించెను
పెనుమబ్బులు నింగి నుండి
పెళపెళమని గర్జించెను

ఉరుములతో మెరుపులతో
ఉల్కలతో నింగి నుండి
పెను భయంకరధ్వనితో
పిడుగులు పెళపెళ రాలెను

చిమ్మచీకటులు గ్రమ్మెను
జీవరాశి తల్లడిలెను
రవిచంద్రులు గతులుదప్పి
రవని యంత కంపించెను

సముద్రుడంతట భయపడి
ఆమడదూరము వెనుకకు
తగ్గిపోయె రాముడపుడు
తన బాణము విడువడయ్యె

పారిపోవు వాని మీద
బాణము వేయుట ధర్మము
కాదని బాణము వదలక
క్షణమాత్రంబాగి పోయె

అపుడు సముద్రుడు జలమ
ధ్యమ్మునుండి పైకి లేచి
బాలభాస్కరుని చందము
ప్రకాశించుచును గన్పడె

తనకుతానె సగరువంశ
జుని రాముని కడకునేగి
మోకరిల్లి శరణమని స
ముద్రుడిట్లు పలికి నాడు

సగరవంశజా! రామా!
సైరించుము నా తప్పును
నేను పంచభూతంబుల
లోన నొకడ నైతి గాన

పంచభూతములు తమశా
శ్వత ధర్మాలను వీడక
నిర్వహించునను సత్యము
నీ వెరుంగుదువు కాదా!

అగాధమై దాటరాని
దైయుండుట నానైజము
నానైజము నాలోగల
ప్రాణుల సంరక్షించును
భయలోభాలకు లోనై
పరిశోషిల్లుట నొల్లను.

నాలో గల జీవుల సం
రక్షణకై నే నెండక
నుండుటకై మార్గమొక్క
టున్నది చెప్పెదవినుమా!

మీ వానరసేన లోన
మేటి శిల్పి నలుడు కలడు

అతడు విశ్వకర్మకొడుకు
అతడు తండ్రియంతవాడు.

అతడు సేతు నిర్మాణము
అవలీలగ సేయగలడు
సేతువు నిర్మించుటలో
చేసెద తగిన సహాయము.

వారధి నిర్మించునపుడు
వానరులకు నేయాపద
క్రూరజంతువులచే రా
కుండునట్లు చూడగలను

రాముడంత శాంతిలి ఓ
సముద్రుడా! నాబ్రహ్మ
స్త్రమునకు లక్ష్యంబెయ్యది
సత్వరమే తెలుపవలయు.

అనినంతనె ద్రుమకుల్యం
బను ప్రదేశమొకటి కలదు
అందు పాపకర్ములు క్రూ
రాత్ము లనేకులు వసింత్రు

ఆపాపాత్ములు నాజల
మాస్వాదింతురు వారల
స్పర్శ మాత్రమైన సహిం
పగ లేకున్నాను నేను

ఆ ద్రుముకుల్యముపైనీ
అస్త్రమును ప్రయోగింపుము
ఘోరపాపకర్ములైన
వారి పీడ తొలగించుము.

అని సముద్రుడనన్నంతనె
తన బ్రహ్మాస్త్రము రాముడు
ద్రుమకుల్యము పై వదిలెను
దుష్టుల వధ గావించెను

రామాస్త్ర స్పర్శకు మరు
భూమి ద్రుమకుల్యంబది
మరుకాంతారముగా జల
మయమై విలసిల్లె నహహ!

సముద్రుడెంత గంభీరు
డమాయకునిగ నటించెను
తనస్వార్థమ్మునకై రా
ముని కొంత నుపేక్షించెను.

## సేతుబంధనము

సగరులు పోషించిన ఈ
సాగరు డెంత కృతఘ్నుడు
దండోపాయమున గాని
దారికి రాడాయె నితడు

ఈ సముద్రుడన్నట్లే
నే సేతువు కట్టగలను
విశ్వకర్మ సుతుడ శిల్ప
విద్య నాకు సహజవిద్య

రామప్రభు! ఇంతవరకు
సముద్రునే ప్రార్థించుచు
నా ప్రసక్తి యెత్తలేదు
నన్నిపు డాజ్ఞాపించుడు

రాము డానతిచ్చెను మ
ర్కటసేనలు నలుని ముందు
నిడుకొని చకచక వారధి
జడధి మీద నిర్మించిరి.

గిరిశిఖరాల్ బండరాళ్లు
బిరబిర కొనితెచ్చినారు
పెద్దపెద్ద వృక్షంబుల
పెకలించుక తెచ్చినారు

గగన వీధి నుండి వాటి
గబిల్లనగ పడవేయగ
క్రూరమైన జలచరాలు
దూరాలకు పారిపోయె

వాటిని క్రమపద్ధతిలో
నీటిపై నమర్చి నలుడు
సేతువు నిర్మించినాడు
శిల్పిప్రతిభే మందును!

పొడవు వంద యోజనాలు
వెడలపు పదియోజనాలు
ఐదు నాళ్లలో వారధి
ఆహా! నిర్మించినారు.

ఎగుడు దిగుడు లేకుండను
ఏవంకర లేకుండను
సమమై నునుపైపాపట
చందము శోభిలె వారధి.

గగన వీధి స్వాతి పథము
కరణి జలధిలో సేతువు
శోభిల్లెను దేవాదులు
చూచి చకితులై పోయిరి.

వానర సేనలు వారధి
పైన నడిచి సముద్రమును
దాటినారు ఆనందో
త్సాహంబున గర్జించుచు

హనుమ భజముపై మీరును
అంగదు మూపున లక్ష్మణు
డధిష్ఠించి గగన వీధి
అంభోనిధి దాట వచ్చు

నని సుగ్రీవుడు సూచిం
చెను కానీ రాముడు కపి
సేనల విడి పోనొల్లక
తాను ముందుగా నడిచెను

లక్ష్మణ సుగ్రీవాదులు
రామప్రభు వెంటరాగ
కపిసేనలు ప్రక్కప్రక్క
కడలి కట్టపై నడిచిరి.

కొందరు నీటను నీదుచు
కొందరు విను వీధి నెగిరి
రాగా మరికొందరు మా
ర్గము చిక్కక వెనుకబడిరి.

వారి భయంకర ధ్వనులు
వారాశిధ్వనిని మ్రింగి
వైచెనహో! దేవాదుల
స్వాంతంబులు పొంగెనహో!

నల నిర్మిత సేతువుపై
నడిచి సముద్రమును దాటి
ప్లవగ సేనతో సీతా
పతి యావలి యొడ్డుజేరె

ఫలమూలస్వాదు జలం
బులు పుష్కలముగ లభించు
అంబుధి దక్షిణ తీరము
నందున కపిసేన విడిసె.

అది పాల్గుణ బహుళాష్టమి
ఆనాడే సువేలాద్రి
నా రోహణ చేసి రాము
డాలంకను తిలకించెను

విశ్వకర్మ మనస్సుతో
వినిర్మించి నట్టిది లం
కానగరము దీని శిల్ప
నైపుణ్య మమోఘమహో!

అని రాముడులంకాప
ట్టణ సౌందర్యమును బొగడు
నతడు విశ్వకర్మకు దౌ
హిత్ర సంతతి వాడు కదా!

శత్రుబలము నచటినుండి
చక్కగ పరిశీలించెను
దానిననుసరించియె కపి
సేనా వ్యూహము పన్నెను.

సౌమిత్రీ! చూచితివా!
సంగ్రామము తప్పదనుచు
దుర్నిమిత్తములు కనపడు
తున్నవి సుస్పష్టముగా

గాలి సుడిగ వీస్తున్నది
నేల ప్రకంపిస్తున్నది
శిఖరాలు చలిస్తున్నవి
చెట్లు కూలి పడుతున్నవి

మేఘంబులు రక్త వర్ష
మే వర్షిస్తున్నవి మృగ
ఖగసంతతులును దీనా
క్రందనలో చేస్తున్నవి

అర్కునిలో నల్లమచ్చ
అగుపడుచున్నది చంద్రుడు
కాంతి తొలగి సంతాపము
కలిగిస్తున్నాడు చూడు

సంధ్యా రక్త వర్ణము గల
జలదంబులు గలదై ఘో
ర భయంకరముగ నున్నది
లంకకు చెడు రానున్నది

ఈనిమిత్త వితతి లంక
లోన సంభవించుటచే
కాళరాత్రి రాక్షసులను
కబళించునటంచు తెలుపు

వ్యూహాకారముగ సైన్య
మొనర విభక్తము లైనవి
ఇక సుగ్రీవా! నీవే
శుకుని విడిచి పెట్టుమనుచు

రాజనీతికోవి దుడగు
రాముడానతిచ్చె నంత
సుగ్రీవుడు వెనువెంటనె
శుకుని విడిచి పెట్టినాడు

రాతిరయ్యె సువేలాద్రి
రామసేవలో నిధియై
రామదండునకు విడిదై
రాజిల్లుచు విలసిల్లెను

## రావణగూఢ చారులు :

బంధముక్తుడైన శుకుడు
పరువున రావణుని జేరి
జరిగిన వృత్తాంతమంత
సవినయముగ వివరించెను

ప్రభూ! మీరు చెప్పినట్లు
ప్లవగేశునితో చెప్పితి
కాని అతడు కినుకజెంది
కఠినముగానిట్లనియెను

రాముడు నామిత్రు డీవు
రాముని శత్రుడవు గాన
నీవు నాకు శత్రుడవే
నిను వధించి తీరవలయు

రాము డద్వితీయ పరా
క్రముడు నిన్ను వాలిని వధి
యించినట్లు వధియించును
ఇట్లంటిని అనిచెప్పుము

అని సుగ్రీవుడు పలికిన
యంతలోన కపులు నన్ను
పట్టుక బంధించినారు
బాధలెన్నొపెట్టినారు

వారు సముద్రము మీదను
వారధి నిర్మించి నారు
వారధిపై జలధి దాటి
వచ్చినారు సేనలతో

రాము డనుగ్రహధాముడు
రాజనీతి దురంధురుడు

నను చంపక వదలిపెట్ట
నాజ్ఞ నిడిన ధర్మాత్ముడు

ఖర కబంధ విరాధులను
కడతేర్చిన రాముడు సు
గ్రీవునితో వచ్చినాడు
నీవిక సీతను రామున

కిచ్చుటయో లేక యుద్ధ
మేసేయుటొ నిర్ణయించు
మని శుకుడన్నంతనె రా
వణు డుగ్రుండై పలికెను

సకల లోకములు నాతో
సమరము సేయగ వచ్చిన
నను జయించ జాలవు సీ
తను రామున కీనొల్లను

అనిపలుకుచు శుక సారణు
లను కపిరూపమున వెళ్లి
పగవాని బలంబెరింగి
పరుగున రండనిపంపెను

వారిరువురు వానరరూ
పానవెళ్లి వానర సై
న్యములోజొరి శత్రువ్యూ
హమ్మును పరికించుచుండ

విభీషణుడు వారల కని
పెట్టిపట్టుకొని రాముని
ముందుంచెను వారప్పుడు
మోకరిల్లి చెప్పుకొనిరి

రామప్రభు! మారావణ
రాజాజ్ఞా బద్ధులమై

వచ్చిన వేగులము దీన
వత్సల! మముదయజూడుము

రాముడపుడు వారలతో
ఏమన్నాడో వినుడీ!
వేగులార మిము చంపము
వెరగుపడకు డింకను మీ

వచ్చినపని మిగిలినచొ, య
ధేచ్ఛగ మాసైన్యంబుల
విస్తృతముగ పరికింపుడు
విభీషణుడు చూపగలడు

'ఇంకను వినుడీ'! అని ఆ
ఇనవంశోత్తము డిట్లనె
"ఓరాక్షసమంత్రులార!
మీరిక మీలంకకేగి

మీరేనికి నామాటలు
ఈరీతిగ చెప్పవలయు

ఏ బలమును నమ్మి నీవు
నాభార్యను అపహరించి
నావో ఆ బలమంతయు
నీవిప్పుడు చూపవలయు

ఆ బలమ్మునకు నీసే
నాబలమును బంధుబలము
తోడుగ చేకొని రేపే
దురమునందు చూపవలయు

రావణ! రేపుదయమె నీ
లంకాప్రాకార బహి

ద్వారములను నీరాక్షస
బలమును ధ్వంసమొనర్తును

నీలంకాపట్టణమును
నీసేనల బంధువులను
విధ్వంసముచేసి వేతు
సిద్ధముగా నుండవలయు

వజ్రాయుధమును బోలిన
బాణములను నీమీదను
వేయుదు నీప్రాణాలను
తీయుదు రక్షించుకొనుము

అని ప్రత్యుత్తరమిచ్చిన
అనఘు చరితురాఘవునకు
జయము పలికినారాశుక
సారణరావణమంత్రులు

తిరిగి వచ్చి రావణునకు
జరిగిన సంగతి చెప్పిరి
రాముడు దుర్జయుడు సీత
రామున కిమ్మని చెప్పిరి

వారి మాట చెవియొగ్గక
వారి గూడి నింగిదాకు
మేడ పైనికెక్కిచూచి
నాడు శత్రుసైన్య మంత

**సారణశుకులతో రావణుని పరిశీలన**

"ఎవడెవడెంతటి వీరుడొ
ఎవడు ముఖ్యుడో సేనకు
నాయకుడెవడో చెప్పుడు
నాకు ఉన్నదున్నట్లుగ

అని రావణుడడిగినంత
టనె సారణుడిట్లనియెను

"రాజా! అడుగోచూడుము
లంక కేసిచూసి రంకె
వేసెడి వాడే నీలుడు
వీరుడు సేనాధ్యక్షుడు

అదిగో! అంగదుడు చూడు
కొదమసింగమై కదనో
త్సాహముతో లంకమీద
దండెత్తగ జృంభించును

వాడు వాలిసుతుడు తండ్రి
వంటి పరాక్రమవంతుడు
వాని వెనుక నలుడు వాడె
వారధి నిర్మించినాడు.

చందన వనమున వసించు
చండపరాక్రమ వంతులు
వెయ్యికోట్ల పైగా కపి
వీరులతో వచ్చినాడు

తానొక్కడె లంకను వి
ధ్వంస మొనర్చెదనంచును
ప్రతిన చేసినాడు వాడు
ప్రజ్ఞాప్రతిభలు గలాడు

అడుగో శ్వేతుడు సుగ్రీ
వుడి దగ్గర కేగీ సైన్య
మును విభజించుచు వ్యూ
హను రచించుచున్నవాడు

అల్లదిగో హనుమంతుడు
అతి బలవంతుడు వాడే

వననిధి లంఘించి వచ్చి
వైదేహిని చూచి వెళ్లె

వాడు సూర్యసుతుని మంత్రి
వాడు రామునకు నమ్మిన
బంటు, వాడు దుర్జయుడని
కంటిమి గద ఆనాడే!

అదిగో కుముదుడు గోమతి
నది యొడ్డున సంకోచన
మను గిరిపై వాసముండు
వనచరులకు రాజు వాడు

కోటి వానరులతో ఆ
కుముదుడు మనలంకమీద
దాడి చేయవచ్చినాడు
వాడుపరాక్రమ వంతుడు

రంభుడదిగొ చండపరా
క్రములగు నూటాముప్పై
లక్షల కపివీరులతో
లంక మీద బడ వచ్చెను

ఆవలించు వాడు శరభు
డదిగో నలుబైలక్షల
కపివీరులతో వచ్చెను
కాలునివలె లంకపైకి

పనసుడు వాడదిగో యే
బైలక్షల సేనతోడ
వచ్చినాడు భయంకరుడు
పారియంత్రగిరికి రేడు

అదిగో వినతుడు వచ్చెను
ఆరవైలక్షల వానర

వీరులతో మనలంకను
విధ్వంసము సేతుననుచు

అదిగో! క్రోధనుడు నిన్ను
కదనానికి కాలు దువ్వి
పిలుచుచునున్నాడు చూడు
భీకర వానర యోధుడు

గవయుడుదిగొ! డెబ్బైల
క్షల వానర వీరులతో
లంక మీద దాడి సేయ
రంకె వేయుచున్న వాడు.

వెయ్య్ కోట్ల దండు తోడ
కయ్యానికి వచ్చెనదిగొ!
హరుడు వాడు సుగ్రీవుని
పరమకింకరుడుశూరుడు

అల్లదిగో! రాజేంద్రా!
భల్లూక మహావీరులు
కాటుక కొండల మాదిరి
కనపడుచున్నారు చూడు.

అదిగో ధూమ్రుడు సమస్త
మైన యెలుగులకు నధిపతి
అతని భ్రాత జాంబవంతు
డన్నకన్న పరాక్రముడు

సురాసురుల యుద్ధములో
సురులకు తోడ్పడుట చేత
జంభారి వరాలొసగిన
జాంబవంతుడతడె చూడు!
ముల్లోక ప్రసిద్ధుడతడు
భల్లూక మహావీరుడు

ఎలుగుబంట్ల కెల్లరకును
ఏలిక యైనట్టి వాడు.

దంబ క్రంద సన్నాదులు
దండి పరాక్రమవంతులు
లంకానగరమ్మును ని
శ్శంక బీకివేయ గలరు

అదిగో కేసరి, శతవలి
అరి భయంకరులు లంకను
తామొక్కరె రూపుమాప
తగినవారమని వచ్చిరి

గజుడు గవాక్షుడు గవయుడు
కదన రంగ సింగంబులు
లంకమీద దూకి పడగ
రంకెలు వేయుచునుండిరి.

అదిగో ప్రమాధి! ప్రమాదు
డతడు, యేనుగుల జంపుట
కతనికి క్రీడావిలాస
మాలము సేయగవచ్చెను

ఇంకను విను రాజా మన
లంక మీద దాడి సేయ
కామరూపులంద ర సం
ఖ్యాకముగా వచ్చినారు.

**శుకుడు** (ఈ శుకుడు మంత్రి. ముందు పోయినవాడు కాదు.)

అని చెప్పుచునున్న సార
ణునకు అడ్డుతగిలి శుకుడు
మహారాజ! సుగ్రీవుని
మంత్రులు మైందద్వివిదులు

వారమృతము ద్రాగినట్టి
వీరవరులు వారి సమీ
పాన సుముఖ దుర్ముఖులను
వారిరువురు దండధరు కు
మారులు తండ్రి సమానులు
వారిని పరికించిచూడు !

గజుడు గవాక్షుడు నీలుడు
గవయుడు నలుడను వీరులు
నొక్కొక్కరు పదికోటుల
యోధుల గుంపుకు నేతలు

ఇంకను విను రాజా మన
లంక మీద దాడిసేయ
కామరూపులంద రసం
ఖ్యాకముగా వచ్చినారు

అడుగో చూడుము హనుమం
తుడు వాడే సీతజాడ
కనుగొని లంకను కాల్చెను
గమనములో వాయుసముడు

వాని సమీపాన శ్యామ
వర్ణుడు వాడే రాముడు
వాని భార్యనపహరించి
హానినిగొనితెచ్చికొంటి (వి)

వాడు మహాశూరుడు నిను
వధ గావింతు నటంచును
ప్రతినజేసి అనికి నిన్ను
పౌరుషమున బిలిచినాడు

వేదవిదుడు అస్త్రవిదుడు
విశ్వజనప్రియుడు వాడు

ధర్మవర్తనుడు గావున
ధర్మమతని యందు నిలుచు

వాని పరాక్రమము లోక
ప్రసిద్ధిమిక వాడిప్పుడు
నిను సబాంధవముగ జంపు
దని లంకకు వచ్చినాడు

వానికి కుడిప్రక్కనున్న
వాడు వానితమ్ముడు ల
క్ష్మణుడను వాడమితపరా
క్రముడన్నకు కుడిభుజమ్ము

మేలిమి బంగారు ఛాయ
మేనివాడు అన్నకొరకు
ప్రాణాలను త్యజియించెడి
భ్రాతృభక్తి పరాయణుడు

వానికెడమ ప్రక్కనున్న
వాడు విభీషణుడు రాము
నాశ్రయించి లంకారా
జ్యాభిషిక్తుడైనవాడు

విభీషణుడు నీతమ్ముడు
విరోధియై నీపై యు
ద్ధమునకు వచ్చెను, స్వార్థము
తమ్ముని పగవానిజేసె!

రామవిభీషణుల నడుమ
రాతికొండ వలె నిలిచిన
వాడే సుగ్రీవుడు కపి
రేడు దాడిసేయవచ్చె

వీరందరు మనలంకను
విధ్వంసముసేయనెంచి

రిక రాముడు రేపే పో
రుకు రమ్మని పిలిచినాడు

రాజేంద్రా! శత్రువు దు
ర్జయుడు గాన సంధిప్రయ
త్నముసేయుడు లేదా యు
ద్ధము సేయగ సిద్ధమవుడు

శుకసారణు లను మాటలు
శ్రుతికఠోరములు కాగా
వైరి పొగడ్తకు వారల
పైనిప్పులు చెరగినాడు

ఓకృతఘ్నులారా! నా
ఉప్పుపులుసుతింటూనే
నాసాన్నిధ్యములోనే
నావైరిని పొగడుదురా?

ఛీ! పొండిక, ఇంతవరకు
సేవ చేసినారు కనుక
మిముచంపకవదలుచుంటి
మీరే నిజమగు శత్రులు.

హితవాక్యము చెవికెక్కదు
మృత్యువు రానున్నప్పుడు
మృష్టాన్నము రోగిష్ఠికి
హితవు పుట్ట కుండునట్లు

సారణశుక చారులచే
శత్రు బలపరాక్రమాల
నెరిగిన వాడై రావణు
డించుక జంకెను కానీ

బయటికి కనరానీయక
ప్రగల్భాలు పలికినాడు

దర్పానికిపోయి ప్రమా
దమును తెచ్చుకొన్నవాడు

## శార్దూలుడు

శార్దూలుడు ప్రముఖగూఢ
చారుడు రావణుపంపున
శత్రుసేనలో జొరబడి
చారుచర్యచేస్తుండగ

విభీషణుడు వానిని గని
పెట్టి పట్టుకొని రాముని
ముందుంచెను కాని వాని
పొమ్మని చెప్పెను రాముడు

తిరిగి వచ్చి రావణుతో
జరిగిన సంగతి చెప్పెను
తానెరిగిన విషయమంత
తగచెప్పెను శార్దూలుడు

రాక్షసేంద్ర!రాముడు దు
ర్జయుడాతని మహాసేన
కలచి పుచ్చ వీల్గానిది
గెలుపు అనూహ్యంబైనది

సేతువు నిర్మించి మహా
సేనతో సముద్రమ్మును
దాటి సువేలాద్రి విడిసి
దాడికి సిద్ధముగనుండె

రాముడులంకా ప్రాకా
రమును చేరులోపలనే
సీతనతనికిమ్ము లేక
సిద్ధమగుము యుద్ధమునకు.

## విద్యుజ్జిహ్వుని తంత్రజాలము

శార్దూలుని మాటలువిని
జంకొకింత కలిగి, రేపె
యుద్ధమనుచు తత్తరమున
విద్యుజ్జిహ్వుని పిలిచెను

మంత్రాలోచన చేసెను
మాయాతంత్రముచేసెను
వైదేహిని మభ్యపెట్టి
వశముచేసికొననెంచెను

రాముని మూర్ధమును ధను
ర్బాణములను మాయాతం
త్రముచే విద్యుజ్జిహ్వుడు
తయారించుకొని తెచ్చెను

"సీతా! ఇదిగో రాముని
శిరస్సు" అని రావణుడా
శిరసునేల మీదపడగ
సీతముందు విసిరేసెను

ఆశిరసును చూడగానె
అవనీసుత మూర్ఛిల్లెను
కొంతసేపటికి తేర్కొని
గోడుగోడుమని యేడ్చెను

నిశాచరా! నన్నుగూడ
నీకత్తికి బలిసేయర!
అని సీతాదేవి మిగుల
ఆర్తిజెంది ప్రార్థించెను

అంతరావణుండిట్లనె
ఇంతీ! నినుచంపుటకే
నింతచేసినానా? నా
చెంతజేరు వంతదీరు

ఇంకెక్కడి రాముడు న
న్నింకనైన వరియించుము
నాభార్యలకందరికిని
నాయకివై సుఖియించుము

అట్టహాసమున రావణు
డవనీసుత మనసుమార్చ
ప్రయత్నమున నున్నప్పుడు
పరిచారకుడొకడు వచ్చె

ప్రభూ! మీకు జయము జయము!
ప్రహస్తుల వారిపుడు మంత్రి
బృందముతో మీకొరకై
వేచియుండిరని చెప్పెను

వెంటనె రావణుడు తిరిగి
వెళ్లెను రాముని శిరస్సు
ధనుర్బాణములు నంత
ర్ధానమ్మై పోయెనపుడు

అది చూచిన సరమ సీత
కనియెనిట్లు చూచితివా
ఇదియంతయు మాయ దీని
నిదివరకే కనుగొంటిని

అదిగో! రణభేరి మ్రోగె!
అంటే రాముడు బ్రతికే
యున్నాడని, అట్లుగాక
యుద్ధభేరి మ్రోగునెట్లు?

నీవిక దుఃఖించవలదు
నీరజాక్షి! నీపతి రిపు
సంహార సమర్థుడతని
సంహరించ లేరెవ్వరు!

అని సరమ విభీషణసతి
జనకాత్మజ నూఅడించె
ఆడవాండ్లు ఆడవాండ్ల
నాదుకొనుట సహజమెకద!

తంత్రాలకు మంత్రాలకు
తలవంచని సత్యానికి
జయతు జయతు జయతు జయతు!
సత్యమేవ జయతు జయతు!

## మాత మాతా మహుల హితబోధ

సరమమాట కూఅడిలిన
జానకి యిట్లన్నది "ఓ
సరమా రావణుడింకే
జాలము పన్నునొ తెలుపుము"

అని అడిగిన జానకితో
అసురవనిత సరమ పలికె
అమ్మా! రావణునితల్లి
నెమ్మికతో నిట్లన్నది

నాయన వినరా రావణ!
ఈ అనర్థదాయకమగు
పాపకార్యమేల నీకు
పరదారను విడిచిపెట్టు

సీతను రాముని కొసంగి
శీఘ్రముగా సంధిచేసి
కొని సుఖముగ నుండుమనెను
వినడయ్యెను రావణుండు

మాతామహుడగు వృద్ధుడు
మాల్యవంతు డెన్నెన్నో

విధముల వివరించి చెప్పె
వినడయ్యెను రావణుండు

చేటు దాపురించునపుడు
చెవి యొగ్గడు మూఢుడెపుడు
విధికి లొంగిపోనివాడు
విశ్వమందె లేడెవ్వడు

తల్లి మాట చెవికెక్కదు
తాతమాట లెక్కించడు
తెలిసిన మూర్ఖుడు తానే
తెలివిమంతు డనితలచును

కాలము ముంచుక వచ్చిన
కనిపించదు వినిపించదు
కాల ప్రవాహాల నాప
గల్గు శక్తి లేనెలేదు.

## తృతీయాశ్వాసము

### రావణుని లంకారక్షణవ్యూహం

ప్రహస్తాది మంత్రులతో
రావణుడాలోచించెను
శత్రుసేన నెదుర్కొనగ
సమరవ్యూహము పన్నెను

లంకాపురి నాలుగు ద్వా
రాల వద్ద రక్షణసే
నావాహిని నియమించెను
రావణేశ్వరుడు శీఘ్రుమె

తూరుపుద్వారమున ప్రహ
స్తుడు,దక్షిణపుంగవనిని

మహాపార్శ్వమహోదరులు
మరి పడమట నింద్రజిత్తు

ఉత్తరమున తాస్వయముగ
నుండునట్లు మధ్యభాగ
మందు విరూపాక్షుడుండు
నట్లు వ్యూహమునుపన్నెను

ద్వీపము దక్షిణ పశ్చిమ
దిశ లంకాపురముండుట
సేతువుత్తరమున నుంట
చే ఉత్తర పడమరలో

ఒత్తిడెక్కువగునని తా
నొక దిశలో నిలిచియు వే
రొకదిశలో నింద్రజిత్తు
నుండునట్లు నియమించెను

ఈవిధి లంకారక్షణ
మేర్పరచి కృతార్థుడనని
యెంచెకాని మిత్తి సమీ
పించినదని యెరుగడతడు

విభీషణుని మంత్రివరులు
విహగాకృతిలో లంకను
జొరియచ్చటి రహస్యాలు
నెరిగి తిరిగి వచ్చినారు.

### రాముని రణవ్యూహం

విభీషణుడు వెంటనె ఆ
విషయాలన్నియు రామున
కెరుక పరుచ నతడప్పుడు
సరియగు వ్యూహముపన్నెను

వానరసేనను నాలుగు
భాగాలుగ చేసి మరియు
ప్లవగ సేనతోరాముడు
పలికెనిట్లు స్పష్టముగా

ప్రహస్తుతో పోరుటకై
ప్రాగ్ద్వారమ్మును నీలుడు
దక్షిణద్వారమును వాలి
తనయుడు, పడమటగవనిని
వాయుసుతుడు ముట్టడించ
వలెనని ఆజ్ఞాపించెను

తాను లక్ష్మణుండుత్తర
ద్వారముకడ దాడిచేసేతు
మనుచు జాంబవంతు విభీ
షణ సుగ్రీవులు సేనా
మధ్యమ్మును రక్షింతురు
మరియునొక్కమాట వినుడు

పొరపాటున వానరు లె
వ్వరు మనుష్యరూపములో
రణమందున గానుపించ
రాదిది కపిసంకేతనము

అయిన నేను నాతమ్ముడు
ఆత్మీయుడువిభీషణుడు
మరియును నాతని నల్వురు
మంత్రులు మొత్తముయేడ్గురు
నరవేషములోనే సం
గరభూమిని గనిపింతుము

నాల్గు విభాగాలుగ వా
నరసేనలు వారివారి

సేనాపతులకు తోడై
చేయవలయు సంగ్రామము

రావణసేనాపతి ఘో
రాతిఘోరభయంకరుడు
వాడు ప్రహస్తుడు వానికి
జోడగు వాడే నీలుడు

పరమభయంకరులు మహా
పార్శ్వమహోదరులు వారి
ఉక్కణచగ తగిన వీరు
డొక్కడు వాడంగదుడే

మంత్రతంత్ర కుతంత్రాల
మాయావి మహేంద్రజిత్తు
వాని జిత్తు లెల్ల చిత్తు
పరుచజాలు హనుమంతుడు

పరదారాసక్తుడు ఋషి
వరుల హింసపెట్టు వాడు
దుష్టరావణుని నేనే
దునుమ నిశ్చయించినాడ.

ప్రాగ్ద్వారమ్మును నీలుడు
పడమటి గవనిని హనుమడు
దక్షిణపుంగవని వాలి
తనయుడు ముట్టడి సేతురు

రావణు డుత్తరపు గవని
రక్షంచును గాన నేను
లక్ష్మణుతో గూడి ఉత్త
రద్వారము ముట్టడింతు

ఇక రావణు డుత్తరదిశ
ఇంద్రజిత్తు పశ్చిమదిశ

నుండి లంక గాపాడగ
భండనమొనరింత్రుగాన

జాంబవంతు డినసూనుడు
సఖుడు విభీషణుడును ఈ
ముప్పురు నుత్తర పశ్చిమ
ముల మధ్యన నిలువ వలయు

రణవ్యూహ మీరీతిగ
రాముడు రచియించి పిదప
సమరనియమముల సేనకు
చక్కగ వివరించి నాడు.

## సువేలాద్రి పైరేయి విడిది

అది సాయంకాల వేళ
అర్కకులోత్తముడు సువే
లాద్రి పైకి నెక్కె నతని
ననుసరించె లక్ష్మణుండు

ఇనసూనుడు విభీషణుడు
హనుమంతుడు జాంబవంతు
డంగ దాది కపి వీరులు
అద్రినెక్కి నా రప్పుడు

అది ఫాల్గుణ బహుళాష్టమి
అర్కుడస్తమించె నిశలు
కమ్మె దివ్వటీలు వెలిగె
గడిచె రేయి అద్రిమీద

ప్రాతఃకాలంబయ్యెను
రామదండు లంకలోని
వనసౌందర్యమును జూచి
మనోల్లాసమున దేలెను.

## రాముడు లంకను చూచుట

శ్రీరాముడు సువేలాద్రి
శిఖరముపై నుండియు లం
కాపట్టణ వైభవమును
కపివీరులతో చూచెను

విశ్వకర్మ నిర్మితమై
వెలసిన లంకా పట్టణ
మద్భుతమై కనువిందై
అగుపించెను రఘువరునకు

ఔరా! ఈఒక్కరాక్ష
సాధము కారణమున ఈ
రాక్షసజాతి సమూలము
గా క్షయమై పోనున్నది.

అనిరాముడు వాపోవుచు
ఆ లంకాపట్టణ మ
ధ్యమున రావణ ప్రాసా
దమును గాంచి నాడప్పుడు

అద్దాని శిఖాగ్రమెక్కి
అసురేంద్రుడు రావణుడు సు
వేలాద్రిని రామాదుల
వీక్షించుచు నుండెనపుడు

## సుగ్రీవుడి ఆవేశము రావణుతో మల్లయుద్ధం

సుగ్రీవుండా రావణు
జూచినాడు తత్క్షణమే
ఆకసాని కెగిరి పోయి
అసురేంద్రుని పై దూకెను.

వాని కిరీటమును నేల
పడరాల్చెను అంత కుపితు
డై రావణు డినసూనుని
అదిమి పట్టి పడవైచెను

పడుతూనే పైకి నెగిరి
ప్లవగేశుడు లంకేశుని
పడగొట్టెను ఒకరినొకరు
పడవైచుచు పోరాడిరి

చిత్ర విచిత్రముగ చాల
సేపు వారు పోరాడిరి
మగటిమితో వారుభయులు
మల్లయుద్ధ మొనరించిరి

రావణుడలసెను మాయా
రణముసేయ యత్నించెను
అది పసికట్టిన కపీంద్రు
డాకసాని కెగిరి వచ్చి
వ్రాలె సువేలాద్రి మీద
రాముడతని కౌగిలించి

సఖుడా! ఇట్లైకాయెకిని
శత్రు మధ్య కేగ తగునన?
రాజువు నీవిట్లొనర్చ
రాదుకదా సుగ్రీవా!

స్నేహితుడా సుగ్రీవా!
నీకేదైన అనర్థము
వాటిలియుండిన నాకిక
వైదేహితో నేమిపని?

అని సూక్ష్మముగా సుగ్రీ
వుని రాముడు మందలించె

వినయమొప్ప సుగ్రీవుడు
విన్నవించె తానిట్లని

దుష్ట రావణుని జూచిన
తోడనె నేనాగలేక
వానిపైన దూకితి పొర
పాటును మన్నించురామ!

రావణుని కిరీటము సు
గ్రీవుడు పడ ద్రోయడమది
రావణ పతనానికి రా
బోవు కీడు సూచించెను.

దుర్నిమిత్తములు లంకకు
ద్యోతక మగుచున్న వదిగొ!
తడవేటికి లంకమీద
దాడిసేయ వెడలు దమని

రాముడు దిగివచ్చె సువే
లాద్రి మీదినుండి వెంట
లక్ష్మణ సుగ్రీవాదులు
రామదండు వెడలి వచ్చె (పాల్గుణ బ॥ 9)

వానర భల్లూక వీర
సేన భయంకర భీకర
సింహగర్జనలు చేసెను
చెదరె రాక్షసులగుండెలు

అయినను రాక్షస వీరులు
అసురపతిని కీర్తించుచు
పెడ బొబ్బలు పెట్టుచు రణ
భేరులు మ్రోగించినారు

## అంగద రాయబారం

అని అనివార్యం బయ్యె న
టంచు తెలిసియును రాముడు
శాంతి కాముకుడు కావున
సంధి ప్రయత్నము చేసెను.

రావణుకడ కంగదుడిని
రాయబారముగ పంపెను
తన మాటలుగా యిట్లని
దనుజపతికి చెప్పమనెను.

"నిశాచరాధమ! మృత్యువు
నీకొర్కై ఎదురు చూచు
చున్నది యిక జీవితాశ
ఉంటే నను శరణు వేడి
సీతనప్పగించుము లే
దా తప్పదు చావు నీకు

ఏ ధీమాతో సీతను
ఈ వెత్తుక పోయినావొ
ఆధీమాతో బయటికి
రా! నాతో యుద్ధానికి

మహితాత్ముల హింసించిన
మహాపాపి! నీ పాపము
పండిన దీవెందేగిన
వదలక నిను వధియింతును

అసురాధమ! నీకు మృత్యు
వాసన్నమ్మైనది నా
భార్య నపహరించిన నిను
వధియించుటకై లంకా

ద్వారము చెంతకు వచ్చితి
తప్పించుక పోలేవిక

నిను నీరాక్షస జాతిని
నిశ్శేషము గావింతును
కావున నీ అపర కర్మ
నీవె చేసికొని రారా!

మూఢాధమ! నీకుచావు
మూడినదిక, నీవేవర
గర్వముతో దేవయక్ష
గంధర్వాదుల హింసిం
చితివో ఆవరగర్వము
గతమయ్యెను బయటికిరా!"

రాముని సందేశముగొని
రాయబారి అంగదుడు చి
వాలున పైకెగిరి పోయి
వాలిపోయె లంకలోన

తాను వాలికొడుకుననుచు
తనపేరంగదుడంచును
రామప్రభు సందేశము
రావణునకు వినిపించెను

ఆమాటలు విన్నంతనె
ఆగ్రహమొందిన వాడై
వీనిచంపుడని రావణు
డానతిచ్చె రాక్షసులకు

వెంటనె నల్వురురాక్షస
వీరులంగదుని గట్టిగ
పట్టుకొనిరి ఒక్కక్షణము
పట్టుబడిన యట్లుండియు

వారిని తన చంకలలో
వాలిసుతుడు గట్టిగ బం
ధించి నింగికెగిరియు క్రిం
దికి వారిని వదలినాడు

వారు క్రిందపడి అసువుల
వదలినారు అంతటితో
ఆగక రావణ ప్రాసా
దాగ్రమునొక తన్నుతన్ని
పడగొట్టి చివాలున తన
బలగములో వ్రాలినాడు

## యుద్ధారంభం (పా॥బ॥9లు)

భవనశిఖరమిట్లు విరిగి
పడుట రావణాంత్యదశను
పొడసూపెను సంధి చెడెను
పొలికేకలు నినదించెను

రాయిరప్ప చెట్టుచేమ
రామదండు తెచ్చితెచ్చి
అప్పటికే అగడ్తలను
కప్పి వేసినారప్పుడు

కోటగోడ లెగబ్రాకుచు
ఘోరభయంకర వానర
బల్లూక మహాసేనలు
కల్లోలము సృష్టించెను

సింహనాదములు చేయుచు
సింహములటు కపిసేనలు
రాక్షసేభములపైబడి
రక్కుచు రణమొనరించెను

రావణుడాజ్ఞాపించెను
రాక్షససేనలు జబ్బలు
చరచుచు బొబ్బలు పెట్టుచు
సమరముసేయగవచ్చెను.

పరశు గదా శక్తి శూల
పట్టిసాలు రాక్షసులకు
బండరాళ్ళు చెట్లు రామ
దండుకు ఖడ్గాయుధాలు

## ద్వంద్వపోరు

ఇరువైపుల ప్రముఖవీర
వరులమధ్య ద్వంద్వయుద్ధ
మురుభీకర ఘోరభయం
కరమై కడుజృంభించెను

అంగదుచే ఇంద్రజిత్తు
శృంగభంగమునుజెందెను
ప్రఘసుడు సుగ్రీవునిచే
భండనమున హతుడయ్యెను

హనుమంతుని ముష్టిఘాత
మునకు చచ్చెజంబుమాలి,
ప్రజంఘనుడు రణమున సం
పాతిచేత హతుండయ్యె

ప్రతపనుడను వాడు నలుని
పైకిదూకిరాగ నలుడు
వేవేగమె వానికనులు
పెరికివైచి వధియించెను

వానరసైన్యమునుమ్రింగ
వచ్చుచున్న ప్రఘసుడనెడి

రాక్షసుని వధించివైచె
రవిసూనుడు సుగ్రీవుడు

అగ్నికేతు రశ్మికేతు
యజ్ఞకోపసుప్తఘ్నులు
రఘువీరునిబాణములకు
రణమందున నిహతులైరి

నీలునిచేత నికుంభుడు
నిహతుడయ్యె రణమందున
వజ్రముష్టిమైందునిచే
వధగావింపబడియెను

ద్వివిదు డశని ప్రభుని సాల
వృక్షముతో కొట్టిచంపె
వీరసుషేణుడు రణమున
విద్యున్మాలిని వధించె

అక్షయ శరముల ననేక
రాక్షసులను గూల్చి విరూ
పాక్షునొకే బాణముతో
బరిమార్చెను లక్ష్మణుండు

రాతిరి కావచ్చె నైన
రణము మాత్రమాగలేదు
వానర రాక్షస యోధుల
వైరాగ్ని శమింపలేదు

రాత్రివేళబలమధికము
రాక్షసులకు గానవారు
జృంభించుచు వానరులను
మ్రింగివేయసాగినారు

వానరులును కోపముతో
పళ్లతోడ గోళ్లతోడ

రక్కిరక్కి కొరికి కొరికి
రాక్షసులను పీడించిరి

చీకటిలో యిరువైపుల
సేనలొకరి నొకరు మోదు
కొనుచు రక్కుకొనుచు చంపు
కొనుచు పోరు సాగించిరి

తనవాడిని పగవాడని
తలచి కొట్టి చంపుకొనిరి
చీకటిపనులన్ని యిట్లె
చీకాకును తెచ్చిపెట్టు

రాక్షసవానరులమ్రింగు
రాత్రి కాళరాత్రియయ్యె
రక్తమాంసములతో రణ
రంగమంత బురదయయ్యె

అదృశ్యులై నిశాచరులు
అంపవాన కురిపించిరి
దిక్కుతోచకను రాముని
దిక్కుకేగినారు కపులు

రాముడపుడు దివ్యాస్త్రము
లను వదలెను వెలుగయ్యెను
రామబాణములు రాక్షసు
లను వదలక వధియించెను

**ఇంద్రజిత్తు**

కుపితుడైన యింద్రజిత్తు
కురిపించెను అంపవాన
వానిమట్టుపెట్టనెంచి
వాలిసుతుడు ముందురికెను

రథమును సారథిని జంపి
రయమున తనపైబడ వ
చ్చెడి అంగదుజూచి ఇంద్ర
జిత్తుడదృశ్యుండయ్యెను

అంగదుని పరాక్రమాలు
అందరు శ్లాఘించినారు
రామలక్ష్మణులు నంగదు
భీమము గొనియాడినారు

అంగదుచే నిర్జితుడై
ఆగ్రహించి యింద్రజిత్తు
భీకరాస్త్రములవేయుచు
పీడించెను వానరులను

## నాగపాశబంధం

అంతే గాకుండగ నా
గాస్త్రమ్ముల ప్రయోగించి
రామలక్ష్మణులను వివశు
లను చేసెను బంధించెను.

అగుపడి పోరాడ లేక
అగుపించక మాయప్రయో
గించి రామ లక్ష్మణులను
వంచించెను బంధించెను

కపట యుద్ధపండితుడగు
ఖలుడు ఇంద్రజిత్తు రామ
లక్ష్మణులను మాయచేసి
నిశ్చేష్టుల చేసినాడు

వారిశరీరాల రక్త
ధారలు ప్రవహించుచుండె
పూసిన మోదుగుతరువుల
పోల్కి వారి తనువులుండె

వానరులదిచూచి దుఃఖ
వారాశిని మునిగి నారు
సుగ్రీవ విభీషణులును
శోకముతో క్రుంగినారు

విజయము సాధించితినని
విర్రవీగి ఇంద్రజిత్తు
తండ్రి వద్ద కేగి అమిత
దర్పముతో నిట్లనియెను

రామలక్ష్మణుల నాగా
స్త్రాలతో వధించితినని
పలుక రావణుడు కొడుకును
పరిష్వంగమున దేర్చెను.

రాక్షసాంగనల బిలిచెను
రణభూమికి, సీతను పు
ష్పకముపైంద తోడ్కొని అ
చ్చట పడియుండిన రాముని
శవమును జూపుండని ఆ
జ్ఞాపించెను దశకంఠుడు

వారటులొనరించినారు
వసుధాత్మజ రామలక్ష్మ
ణులనెత్తురు ముద్దలునై
చలములేక పడుటగాంచి,
గొల్లున విలపించెగుండె
ఝల్లనె చూచినవారికి

## సీతవిలాపము

అయ్యో! నాదురదృష్టము
అవధులులేనట్టిదయ్యో!
నాదుర్లక్షణములచే
నాపతికీస్థితి ఘటిల్లె

జలనిధి బంధించిలంక
చనుదెంచియు పిదప గోప్ప
దంబున మునిగితివా నా
థాయని వలవల యేడ్చెను

అకటా! కాలము బలీయ
మైనదికద! రామలక్ష్మ
ణుల నిట్లొనరించ రావ
ణు తనయున కలవియగునె?

నీవు దీర్ఘసుమంగళివి
నీకు పుత్రసంతానము
కలుగునంచు చిన్ననాడు
పలికిరి జోతిష్కులరసి

లాక్షణికులు నాకుంగల
లక్షణముల మేన నరసి
పట్టపురాణివి అయ్యే
భాగ్యము నీకున్నదనిరి

వైధవ్యము ప్రాప్తించెడి
వక్రలక్షణము లేవియు
నాలోలేవని చెప్పిరి
నన్నుజూచి లాక్షణికులు

ఎట్టి చిహ్నములు ధరించు
నట్టి స్త్రీలు విధవలగుదు

రో? ఆ దుశ్చిహ్నంబుల
నొక్కటైన నాలోలేదు

నాదౌర్భాగ్యవశంబున
నాపతియిట్లైపోయెను!
కాకుండిన నాపతి దీ
ర్ఘాయిష్మంతుడు కాదా!

లాక్షణికులు రాముడు దీ
ర్ఘాయుష్మంతుడటంచును
పలికిరి కానిపుడా పలు.
కులు నబద్ధమై పోయెను

ఈ దుస్థితి సంభవించె
నేల నాకు జ్యోతిష్కుల
పలుకు లబద్ధములాయెను
భాగ్యహీనురాల నేను.'

అపుడు త్రిజట అసురాంగన
అమ్మా!దుఃఖింపకు నీ
పతియును నీదేవరుడును
బ్రతికియె యున్నారనియెను

వారేమృతి నొందినచో
వైదేహీ! నిన్నీ పు
ష్పకమను దివ్యవిమానము
వహియించదు ఇదినిజమ్మా!

వీరెంతగ స్మృతిదప్పిన
వీరిదేహకాంతి యెంత
మాత్రము విడలేదు వీరు
మరణమొంది యుండలేదు

అమ్మా! నీవన్నట్లే
అగునుగాక అనిజానకి

త్రిజటతోడ పలికెనపుడు
తిరిగె పుష్పకములంకకు

తదుపరి త్రిజటాది అసుర
తరుణులు సీతను అశోక
వనమందున మునపటిచో
టున ప్రవేశ పెట్టినారు.

**రాముడు మూర్ఛనుండి తేరుకొనుట**

తనువులంత నెత్తురులో
తడిసిపోయి నేలపై ప
రుండిన రఘువీరసోద
రులను చుట్టు మూగికపులు
ఖిన్న వదనులైయుండగ
కన్నులు తెరుచెను రాముడు

**స్మృతికి రాని తమ్మునిచూచి రాముడు విలపించుట**

నెత్తురు కాల్వలుగ పాఱ
ఒత్తుగ లోతుగ నాటిన
శరములచే సోలిన సో
దరుని లక్ష్మణుని గనగనె,

పెల్లుబికిన దుఃఖముతో
విలపించుచు రాముడనెను
"నాయన లక్ష్మణ నీవిటు
నలుగుడుపడి యుంట గంటి
నేనెంతటి పాపాత్ముడ
నిన్నీస్థితిలో గంటిని

నాకు సీతతో కానీ
నాప్రాణముతో కానీ

పనియేమున్నది నీవిక
చనిపోయినచో తమ్ముడ!

క్షితిని వెదకి సీత వంటి
స్త్రీని పొందవచ్చుగాని
లక్ష్మణుసముడగు తమ్ముడు
లభియించునె ధరనెందున

బాణాలకు నాతమ్ముడు
ప్రాణాలను వీడెనేని
ప్లవగులెల్ల చూచుచుండ
ప్రాణాలను విడుతునేను

అడవికి నావెంట వచ్చి
నట్టివాడు లేకుండగ
నేనయోధ్యకేగినచో
నిందల పాలైపోదును.

దూడను విడనాడి ఆవు
దురపిల్లువిధాన సుమి
త్రమ్మను నేరీతిగ నో
దార్చంగల వాడ నేను

తమ్ముడు లేకుండ అయో
ధ్యకు పోనే పోను నేను
తమ్ముడేడి? అని అడిగిన
అమ్మలకే మందు నేను.

అడవికి నావెంట వచ్చి
నట్టి వాడు యమపురికే
గినచో నేనతని వెంట
చనెదను యమపురికి నేను

నేను దుఃఖితుడ నైనపు
డెల్ల నన్ను నోదార్చెడి

వాడవుగద నాతో మా
ట్లాడవేల నీవిప్పుడు.

నేనెంతగ కోపించిన
తానించుక అప్రియముగ
నాతో మాట్లాడగ నే
నాడును వినియుండలేదు.

విభీషణా! నినులంకకు
విభుని జేతునని యంటిని
నీకిచ్చిన మాటను నే
నిలుపుకొనగ లేనైతిని

ఈ అసత్యదోషము న
న్నిపుడు దహించుచునున్నది
ఇంతకన్న ఘోరనేర
మేమున్నది దుస్సహమిది

సఖుడా సుగ్రీవా! ఇక
సత్వరమే కిష్కింధకు
నీసేనలతో పొమ్మిక
నీకిదియే క్షేమకరము

స్నేహితుడా! నీసేవలు
నిరుపమానములు సంస్మర
ణీయములైయుండు నేనె
నీకుఋణగ్రస్తు నైతి

భ్రాత లక్ష్మణుని విడినే
బ్రతుక లేను క్షణమైనను
వీడుమరణమొందినచో
విడుతునేను ప్రాణములను"

అపుడు విభీషణుడచ్చటి
కరుదెంచెను, నల్లటి వా
డగుటచేత ఇంద్రజిత్తె
అరుదెంచెనటంచు భ్రమసి,

వానరులెల్లరు భయపడి
పారిపోయినారు పిదప
అతడు విభీషణుడని తెలి
యంగ దిగులు వీడినారు.

**నాగపాశ విమోచనం** (50వ సర్గ)

విభీషణుడు రఘువీరుల
వీక్షించెను వారల దు
స్థితికి విలాపించునతని
దినకరసుతు డోదార్చెను.

"సుషేణుగని, మామా రఘు
సోదరులను సైన్యములను
గొని కిష్కింధకు పొమ్మిక
దనుజపతిని సంహరించి

సీతమ్మను గొని తెత్తును
శ్రీరాముని కిర్పింతును"
అని సుగ్రీవుడు పలికిన
యంత సుషేణుండిట్లనె

"ద్రోణచంద్రపర్వతాల
పైన విశల్య సంజీవ
కరణులు పరమౌషధాలు
గలవు వాటి గొని తేవలె

హనుమంతుండొకడె వాటి
గొని తేగల సమర్థుండు"
అతని పంపుడని సుషేణు
డనెను భిషగ్వరుడాతడు.

## గరుడుని రాక

అప్పు డొక్క దివ్యపురుషు
డచ్చటి కరుదెంచినాడు
అతడు గరుత్మంతుడతని
ఆగమనముతో పాములు
భయపడి జడనిధిలోనికి
పారిపోయి దూకిపడెను

రామలక్ష్మణుల నాతడు
సమీపించి నంతటనే
పాశాలుగ చుట్టుకొన్న
పాములు విడిమాయమయ్యె

తత్క్షణమే వారిరువురి
తనువులపై గాయములవి
మాయమయ్యె యధాస్థితిని
మండితులైనారు వారు.

"ఎవరయ్యా! మీరు మమ్ము
ఈ దుస్థితిలోన కటా
క్షించి మమ్మురక్షించగ
వేంచేసిన పుణ్యాత్ములు"

అనుచు రాముడడిగినంత
అండజాగ్రనుండిట్లనె
వినత పుత్రుడను గరుడుడ
వినరయ్యా మీహితుడను

కద్రువసంతతులు మిమ్ము
కష్టపెట్టు చుండజూచి
మీకు హితము చేకూర్చగ
మీకడకరుదెంచి నాను
ఫణిపాశము మిము విడ కా
పాడుటకై వచ్చినాను.

నాగపాశ బంధము విడి
పోగ మీకు సాయపడగ
వచ్చినాను మాయావులు
వంచక రాక్షసులు వీరు

మీరలప్రమత్తముగా
పోరాటము సాగించుడు
మీకనిలో జయముకలుగు
గాక! యనుచు వెడలిపోయె

రామలక్ష్మణులు యెప్పటి
లాగున వీరావేశము
తో పొంగిరి వారలగని
దూకులెత్తినారు కపులు

వానరసేనా హర్ష
ధ్వానాలవి లంకలోన
ఘూర్ణిల్లెను దశకంఠుని
గుండెగుబిల్లని పగిలెను.

# చతుర్థాశ్వాసం

## రాక్షసయోధుల వధ

ఇంద్రజిత్తు బాణాలవి
ఎట్లు వ్యర్థమైపోయెను
ధూమ్రాక్షా! నీవువెళ్లి
రామలక్ష్మణుల వధించు.

అని రావణుడనగనె ధూ
మ్రాక్షు డమిత సేనలతో
రథము మీద పశ్చిమ ద్వా
రమును దాటి వచ్చినాడు
అయితే హనుమంతుడతని
యమపురమున కంపి వైచె

అంత వజ్రదంష్ట్రు డనికి
అరుదెంచెను సేనతోడ
వాండంగదుచే రణమున
వధగావింపంబడియెను

అప్పుడకంపను డనియెడి
అసురాగ్రణి అనికివచ్చె
వాని ధాటికాగలేక
వానరసేనలు భీతిలె

హనుమంతుండెదురు నిల్చి
అకంపనుని హతమార్చెను
జేకొట్టుచు కపిసేనలు
సింహగర్జనలు చేసెను

## ప్రహస్తుని వధ

ప్రహస్తు డసురేంద్రునెదుట
ప్రగల్భాలు పలికినాడు
రథముమీద వచ్చినాడు
రావణసేనానివాడు

పూర్వద్వారము సమీప
మునకు వచ్చె పోరు భయం
కరమయ్యెను వానర రా
క్షససేనలు పరస్పరము
చంపుకొనిరి నెత్తురు మాం
సపుబురదలు ప్రవహించెను.

అగ్నిపుత్రుడగు నీలుం
డా ప్రహస్తునెదుర్కొనెను
అతడు రామదండుకంత
అప్రతిహత సేనాపతి.

ఇరువురు సేనానులు భీ
కరయుద్ధము చేసినారు
రక్తసిక్త తనువులతో
రణభూమిని వారిరువురు
ఎర్రగ విరిసిన కింశుక
వృక్షాలటు వెలసినారు

చివరకు నీలుడు ప్రహస్తు
శిరము మీదపెద్దబండ
బలముకొలది విసరెను తల
పగిలి చచ్చె రాక్షసుండు

## రావణుడు తొలిసారి యుద్ధానికి బయల్దేరుట

రాక్షససేనాని చచ్చె
రావణేంద్రు గుండెజారె
దుఃఖములో రోషముతో
దురముసేయతానె వచ్చె

దనుజేంద్రుని వెంట మహో
దరుడు నింద్రజిత్తు నికుం
భుడకంపను డతికాయుడు
మున్నగుయోధులు వచ్చిరి

వారుత్తరద్వారంబున
వచ్చుచుండ వారిగూర్చి
విభీషణుడు రామునితో
వివరముగా తెలియజేసె

కొండరాళ్లు బండరాళ్లు
గొప్పగొప్ప వృక్షంబులు
రామదండుచేత బట్టి
రావణునెదిరించనుండె

తనసైన్యమువైపు తిరిగి
దశకంఠుడు, "మహావీరు
లారా! మీరంతవెళ్లి
లంకా పట్టణ రక్షణ
లోనుండుడు లేకుండిన
లోన ప్రవేశించు వైరి"

అనుచు నింద్రజితాదులను
వెనుకకు పంపించి వైచి
శత్రువధోత్సాహియగుచు
సైన్యముతో ముందేగెను.

## సుగ్రీవాదులు

సుగ్రీవుడు దశకంఠుని
చూచిచూడగానె మహా
గిరి శిఖరము పెకిలించి వి
సరివేసెను రావణుపై

కాని రావణుడు దానిని
బాణముతో పిండిచేసె
అంతటితో ఆగకపదు
నైనబాణ మొకటివేయ
సుగ్రీవుడు మూర్ఛితుడై
సొరగిసొరగి పడిపోయెను

అంతగవయ గవాక్ష ఋష
భాది మహాకపి వీరులు
పర్వతశిఖరముల దెచ్చి
పడవేసిరి రావణుపై

కాని వాటి నెల్లమధ్య
లోనె రాక్షసేంద్రు బాణ
ములు చూర్ణముచేసె వాన
రుల గుండెలు జారిపోయె

రావణ శరపీడితులై
ఆ వానర వీరులెల్ల
దీనులగుచు రాఘవేంద్రు
దిక్కుకు పరుగెత్తినారు

ధనువునందుకొని రాముడు
రణమునకై సిద్ధపడగ
"అన్నా రావణుని నేనె
హతమార్తును అనుమతిమ్మ
మని లక్ష్మణు డర్థించెను
అనుమతి నిడి రాముడనెను

సోదర! రావణుడు మహా
శూరుడు వీరుడు అణువం
తేని అజాగ్రత వలదని
హెచ్చరించి పంపించెను.

## హనుమంతుడు

అంతకు ముందే మారుతి
అసురనాదునెదుట నిల్చి
దశకంఠా! నీవు దేవ
దానవ గంధర్వయక్ష
రాక్షసాది గణములచే
అక్షయుడవుగా వరముల
బడసినావు కాని నేను
వానరుడను కాచుకొనుము

అని పలికిన హనుమకు రా
వణుడిట్లనె ఓరి కోతి

నీమాటలు చాలించుము
నీబలమును చూపించుము

అంతహనుమ ఓరి నీవు
అపుడే మరచితివా నీ
కొడుకక్షయు జంపిననా
కుడిభుజమిది చూడుమురా!

అసురేంద్రుండాగ్రహించి
హనుమరొమ్ము నరచేతను
చరచినాడు అంతహనుమ
క్షణము సేపుతూలిలేచి,

తన కుడి పిడికిలితో రా
వణు రొమ్మును పొడిచెను ఆ
దెబ్బకొరిగి కొంత వడికి
తెప్పరిల్లి దశకంఠుడు

ఓ వానర! నీవు గొప్ప
యోధుడవే వీరుడవే
నీవు శత్రువే యైనను
నిను బొగడగ తప్పదనెను.

తనను ప్రశంసించు రావ
ణునితో మారుతి యిట్లనె
రావణ! నాదెబ్బకు నీ
ప్రాణాలవి పోలేదే?
అని నేచింతించుచుంటి
నని పిడికిలిబిగియించెను

అంతలోనె కోపముతో
అసురేంద్రుడు హనుమంతుని
పిడిగుద్దొక్కటి గుద్దెను
సుడివడిమూర్ఛిలె మారుతి

"వీనితోడ పోరాటము
హానికరము వీడుమూర్ఛ
తేరినచో నాతోమరి
పోరాటము సాగించును"

అనిముందడుగిడిరావణు
డని లాత్మజునీలునితో
తలపడిపోరాడుచుండు
తరుణములో హనుమంతుడు

తెప్పరిల్లి నలుదిక్కుల
తిలకించుచు రావణుగని
అన్యునితో నీవుయుద్ధ
మాడునపుడు నీపైనే
వచ్చుట నాకదితగదని
వాయునందనుడు పలికెను

## నీలుడు

నీలుడపుడు రావణుతో
నిగ్రహించి తలపడి పో
రాడుచు వానిని మిక్కిలి
పీడించెను తాడించెను

రాక్షసేంద్రుడాగ్నేయా
స్త్రమువేసెను నీలుడు మూ
ర్ఛిల్లె నంతలక్ష్మణు డసు
రేంద్రు నెదుర్కొన వచ్చెను

## లక్ష్మణుడు

వారిద్దరు వీరాలా
పాలుపలుకు చొకరినొకరు
దివ్యాస్త్రంబులచే బా
ధించుకొనుచు పోరాడిరి

తుదకు రావణుని ధనుస్సు
త్రుంచివైచె లక్ష్మణుండు
రాక్షసేంద్రు దేహమంత
రక్తసిక్తమైపోయెను

దానవేంద్రు సహనమపుడు
దహనమ్మైపోగ వాడు
బ్రహ్మదత్తమైనశక్తి
ప్రయోగించినాడంతట

శక్తి ఆయుధమ్మది ల
క్ష్మణురొమ్మున నాటెనంత
నతడు మూర్ఛనొందుచుండ
అసురేంద్రుండతని లంక

కెత్తుక పోదలచి లేవ
నెత్త లేక విఫలుడయ్యె

భూమండలమంత మోయు
భుజగేంద్రునియవతారము
లక్ష్మణుడని యెరుంగడా
రాక్షసపతి రావణుండు

బ్రహ్మవంశమున బుట్టిన
బ్రహ్మజ్ఞానముగలుగున?
వనచరుడైనను హనుమకు
బ్రహ్మమెట్లు వశమయ్యెను

అపుడు హనుమ కుపితుండై
అసురేంద్రని రొమ్మున ఒక
పోటుపొడిచె వాడంతట
మూర్ఛిలె నెత్తురుగ్రక్కుచు

హనుమంతుడు లక్ష్మణున
త్యవలీలగనెత్తుక పో
యెను శక్తియు లక్ష్మణు విడి
దనుజ పతిని జేరుకొనెను.

**రామరావణ ప్రథమ సంగ్రామము**

తత్క్షణమే రాముడు తన
తమ్ముడు ధైన్యము నొందుట
గని కుపితుండై ధనువును
గొని రావణు నెదుర్కొనెను

రథముమీది రావణుతో
రణముసేయుటకు వీలుగ
తనభుజాలపై రాముని
హనుమడు నెక్కించుకొనెను

రామరావణుల మధ్యన
రణమును చూచుటకు దేవ
తలు మహర్షులును వచ్చిరి
తిలకించిరి సంగ్రామము

వజ్రాయుధమును బోలిన
ధ్వని కలిగిన వింటి నారి
స్వనమును సృష్టించుచు రా
వణుతో నిట్లనెరాముడు

"నిశాచరుడ! నిలువునిలువు
నీవు నాకు అప్రియమొన
రించి యెచటికేగియు త
ప్పించుకొనంగను లేవిక

యమునిగాని ఇనునిగాని
అమరేంద్రునిగాని రుద్రదా

తలనుగాని ఆశ్రయించి
తప్పించుకొనంగలేవు

ఇంకెక్కడి కేగిన నా
యెదుట బడిన నీవు తప్పి
కొనగలేవు విడువను నిను
దనుజాధమ! కాచుకొనుము

నీవెవ్వని శక్తి చేత
నిగ్రహించితివొ అతడే
నేనైవచ్చితి ఇక నీ
ప్రాణాలను కాచుకొనుము!

రాముడిట్లు గంభీరము
గా మాట్లాడినవిని రా
ముని వహించు హనుమను రా
వణుడు గొట్టె శరములతో

రావణబాణాలచేత
ప్రహరింపబడినహనుమను
చూచి రాముడతి కోప వ
శుడయి నిశితశరములతో

**రావణ భంగపాటు**

రథమును గుఱ్ఱాలను సా
రథిని జంపి వేసినాడు
పతాకమును కిరీటమును
పత్రధ్వజములను నేల
మట్టము గావించినాడు
దిట్టతనముతో రాముడు

వజ్రాయుధ ఘాతములకె
వణకని రావణుడు రామ

బాణాలకు తాళలేక
భయభ్రాంతుడగుచు ధను
ర్బాణాలను విడి దిక్కులు
పరికించుచు నిలుచుండెను.

అపుడు దయామయుడు రాము
డతని మీద జాలిబూని
"రావణ! బ్రతికితివి నీవు
రణముసేయజాలవు నీ

విక లంకకు పోయి కొంత
విశ్రాంతిని గైకొని ఆ
యుధములు గొని రేపు రమ్ము
యుద్ధానికి - నేడు పొమ్ము".

అనినంతనె సిగ్గుతోడ
అసురేంద్రుడు తలనువాల్చి
తనలంకాపురికేగెను
తలపైకెత్తగ లేకను.

తనభార్యను చెరబట్టిన
దనుజుడు తనచేజిక్కిన
వానితలను తెగనరుకక
వదలిపెట్టె రఘువీరుడు

యుద్ధమందు పారిపోవు
చున్నవాని ఆయుధములు
వదలి దిశలు చూచు వాని
వధియించక పొమ్మనవలె

అనునానుడి పాటించిన
ఘనురఘువీరుని రాముని
యుద్ధనీతి పొగడుచుండె
యుగాయుగాలుగళమువిప్పి

లోకాలను పీడించిన
రూక్షవీక్షణుడు రాక్షస
రాజు పరాజితుడునై ప
రాభూతుండై క్రుంగెను.

రామబాణ పీడితుడై
రావణాసురుడు లంకా
పట్టణమున కేగుదెంచి
దిట్టతనము కోలుపోయి

గుండెజారి దర్పమణగి
కోరలుపీకిన సర్పము
గతి నిర్వీర్యుండై భయ
కంపితుడై దురపిల్లెను

సింహపు పంజాదెబ్బకు
చెదరి బెదరి పారివచ్చు
మదకరివలె, గరుడుని చే
వదలబడిన సర్పమువలె

రామునిచే నిర్జితుడై
లంకలోనికేగి కొలువు
కూటానికి వచ్చి ఇట్లు
మాట్లాడెను మంత్రులతో

నాతపోబలమ్మంతయు
నాశనమైనది నేనొక
మానవునకు నోడితి నా
మానధనము కోలుపోతి

ఆనాడు శపించిన ది
వ్యాంగనయగు వేదవతియు
గిరిజయు నందియు రంభయు
వరుణ కన్యయును పెట్టిన

శాపాలివి నాకిప్పుడు
స్మరణకు వచ్చుచునున్నవి.

వారుచెప్పినట్లు జరిగి
తీరునంచు ననిపించును
ఋషిభాషిత మసత్యమవ
దేనాటికి జరిగితీరు.

## కుంభకర్ణుని నిదుర మేల్కొలుపుట

అని చింతించుచు రావణు
డనుజన్ముని కుంభకర్ణు
నిదురమేలుకొలుపు డనుచు
నిశాచరుల కాజ్ఞలిడెను.

వాడురామలక్ష్మణులను
వధగావించగ జాలును
వానరులను మ్రింగివేయ
వాడొక్కడె సరిపోవును

కుంభకర్ణు లేపుటకై
గుంపులుగా వెళ్లినారు
పిడిగుద్దులు గుద్దినారు
పెడబొబ్బలు పెట్టినారు.

చెట్లతోడ మోదినారు
చెవులనీళ్లు పోసినారు
శిలలతోడ కొట్టినారు
శీకులతో పొడిచినారు.

ముసలముద్గరాలతోడ
మోదినారు తుదకు వెయ్యి
ఏనుగులను వానిపెద్ద
మేనిమీద తోలినారు

అపుడేదో చిన్నపురుగు
లతనిమీద ప్రాకినట్లు
అనిపించగ నోరుతెరచి
ఆవలింత పెట్టినాడు

ఒళ్లువిరుచుకొనుచు వాడు
కళ్లుతెరచి చూచినాడు
క్రుద్ధుడగుచు బుసగొట్టుచు
గద్దించుచు అడిగినాడు.

ఉచ్ఛ్వాసల నిశ్వాసల
ఉరవడికానిశాచరులు
పురుగులవలె యెగిరి యెగిరి
సొరిగి సొరిగి పడిపోయిరి

నన్నెందుకు నిద్రలేపి
నారు ఏమిప్రళయమిపుడు
ముంచుక వచ్చింది నాకు
ముందు తిండిపెట్టుడనెను

దూరముగా నిలబడి ఓ
దొరా! ప్రళయమే ముంచుక
వచ్చిన దిపుడా రాముడు
వచ్చినాడు యుద్ధానికి

మనవాళ్లెందరొ చచ్చిరి
మనలంకకు చేటు వచ్చె
అన్నగారు తమరిని ని
ద్రాంగన గాఢాలింగన

ముసు భంగమొనర్చి సభకు
గొనితెండని పంపించెను
అని అసురులు విన్నవించు
కొనిరి కుంభకర్ణు తోడ

అపుడు కుంభకర్ణుడు తన
కై సిద్ధము చేసిన మాం
సాహారాదుల చూచెను
ఆకలార్చుకొనదలచెను

బండ్లకొలది ఆహారము
వడివడిగా తినివేసెను
కుండలకొలదిగమద్యము
కుక్షినిండగా డ్రాగెను.

## రావణ కుంభకర్ణ సంవాదము

అపుడు కుంభకర్ణుడు తన
అన్నదగ్గరకు వెళ్లెను
సాదరముగ రాక్షస రా
జతని కౌగిలించుకొనెను

కుంభకర్ణు చూడగనే
కొండయంత బలముకలిగి
ఉచితాసనమున తమ్ముని
ఉపవిష్టుని గావించెను.

అవనిజ మూలమున ఉప
ద్రవము వచ్చినది రాముడు
లంకను ముట్టడి చేసెను
రాక్షసులను హతమార్చెను

తమ్ముడు! నీవే ఈఉప
ద్రవమునుండి రక్షించగ
సమర్థుడవు శత్రువులను
సంహరించ గలవాడవు

జరిగిన సంగతి యంతయు
చక్కగ వివరించినాడు

రావణు మాటలువిని యి
ట్లనియె కుంభకర్ణుడపుడు

అన్నా! నేను విభీషణు
డానాడే చెపితిమిగద!
సీతనప్పగించి యుంటె
చేటది రాకుండుకదా!

మంత్రాలోచన సేయక
మదాంధ్యముతో స్వయముగా
పరదారనుకొని తెచ్చిన
పాపానికి ప్రతిఫలమిది

అవివేకముతో నీవీ
అకృత్యమును చేసినావు
దానిఫలిత మనుభవించ
తప్పదుకద! శాస్త్రజ్ఞా!

కుంభకర్ణు మాటలు విని
క్రుద్ధుడగుచు ఏమిటి నీ
ఉపదేశము? నాకే నీ
వుపదేశించెడి వాడవ?

నాతమ్ముడవై యుండియు
నా ఆజ్ఞను పాటించక
ఆపదలోనున్న నన్ను
ఆదుకొనంగను రావా?

ఇంద్రునంతవాడవైన
ఏమిప్రయోజనము నాకు
నాయాజ్ఞను పాటించని
నా తమ్ముడ వీవుంటివి.

చేయవలసినది చేయక
చేయని పనిచేసినాను
దానిగూర్చి పదేపదే
తర్కింతువు లాభమేమి?

గడిచిన దానిని గురించి
కలతపడుటకన్న ప్రస్తు
తానికేది యుక్తమొ అ
ద్దాని నాచరించవలయు.

అన్నకు కోపము వచ్చిన
దని గ్రహించి కుంభకర్ణు
డన్నా! అట్లని తలచకు
మాలించుము నామాటలు

నేనిపుడే అని కేగుదు
వానరులను నమిలి మ్రింగి
రామలక్ష్మణుల వధించి
రాగల చింతించ వలదు.

నీ ఉప్పును దినుచుంటిని
నీకొరకై నాప్రాణము
లర్పింతును అన్నా! నను
అనుమానించకు మన్నా?

నా బొందిని ప్రాణములు-
న్నంత వరకు రాముడు నీ
వైపుకు కన్నెత్తియైన
పరికించడు భయమేటికి!

శూలముతో నిలచిన నను
చూడలేడు యముడైనను
నరవానరులను గురించి
వెరగుజెంద నీకేటికి?

నేనిపుడే అనికేగుదు
వానరులను తినివేతును
రామలక్ష్మణుల వధింతు
రాముని తలగొనితెత్తును.

సీతనిన్ను వరియించును
చిరకాలము చీకులేక
మధువు త్రాగుచును సీతా
వధువుగూడి సుఖియించుము.

విభీషణుడు నావలెనే
విన్నవించె ధర్మమార్గ
మది పెడచెవిపెట్టి తీవు
అతడు వెళ్లె నిన్ను విడిచి

నేను మాత్రమతనివోలె
నిన్ను విడిచి పోనుపోను
నీకొరకై నాప్రాణము
నీరాజన మొనరింతును

## కుంభకర్ణ యుద్ధం

అనుచు కుంభకర్ణుడు తన
అన్నకు ప్రణమిల్లి బయల్
వెడలెను రణభూమికి తన
వెంట మహాసేన రాగ

ఎవడు వీడు విభీషణా!
ఏమిటి ఈ ఆకారము
పర్వత మట్లున్నవాడు
ప్రాకారము దాటివచ్చె

అని రాముడు ప్రశ్నించగ
అనియెనిట్లు విభీషణుడు

పుట్టగనె అనేకజనుల
పొట్టబెట్టు కొనెను ప్రజలు
శరణువేడ సురపతి వ
జ్రాయుధమున వానిగొట్టె

వజ్రాయుధ ఘాతమునకు
బాధితుడై భీకరముగ
బొబ్బపెట్ట చతుర్భువన
ములును దద్దరిల్లిపోయె

అపుడువాడు అమరేంద్రుని
ఐరావతమను యేనుగు
దంతమునొకదాని బెరికి
తగ బొడిచెను పాకారిని

పారివచ్చి బ్రహ్మను జం
భారి శరణువేడుకొనెను
బ్రహ్మనతని నిద్దురలో
పడియుండగ శపియించెను

దశకంఠుడు పార్థించగ
ధాత కనికరించి ఆరు
నెలలు నిద్ర ఒక్కరోజు
మెలకువగొని యుండగలడు

అని తనశాపము నుపసం
హరణము గావించెకొంత
ఇతడు రావణునకు తమ్ము
డితడు నాకు అగ్రజుండు

ముక్కుసూటి మాటలాడు
మొక్కవోని శూరవరుడు
సీత విషయమై అన్నకు
చేసినాడు నీతిబోధ

నేటికి తొమ్మిది దినాలు
దాటి నాటి సభలోపల
సీత విషయమై అన్నకు
నీతిని బోధించినాడు

ద్వారంబున నుండి గాక
ప్రాకారము నవలీలగ
దాటివచ్చె రణభూమికి
దశకంఠుని తమ్ముడతడు

కొండనడచి వచ్చునట్లు
గోచరించు కుంభకర్ణు
గాంచి వానరులు మిక్కిలి
కలత జెంది కంపిల్లిరి

రణభూమికి రాగానే
వనచరులను పండ్లనోట
పడవేసుక తిన్నట్లుగ
పడవేసుక తినసాగెను.

అతడు బుసలుకొడితేనే
అసంఖ్యాకముగ ప్లవగులు
ఎగిరి దవ్వులోన బడిరి
దిగులు బుగులు పడిచచ్చిరి.

అతనిజూచి భయంభ్రాంతు
లై వానర భల్లూకము
లసువుల నరచేత బట్టి
అటుయిటు పరుగెత్తినారు

అతని పర్వతాకారము
అతని భయంకర రూపము
గని కపిభల్లూక సేన
గడగడ కంపించి పోయి,

చెల్లాచెదరై గుండెలు
జల్లనగా ప్రాణభీతి
పిక్కబలము జూపుచు పలు
దిక్కుల పరువెత్తినారు.

అపుడంగదు డడ్డు తగిలి
అనియెనిట్లు ఓ వానర
వీరులార! భయపడుటకు
నేరుచుకొన్నారెప్పుడు?

ప్రాణరక్షణము కొరకై
పారిపోదు రెచ్చోటికి?
అచ్చట మృత్యువులేదా?
ఎచ్చట అదిలేకుండును?

వీరమరణమొంది మీరు
కీర్తగడించుట మేలా?
పందలగుచు అపకీర్తిని
పొంది గతించుటమేలా?

ప్రాణరక్షణము కొరకై
పరుగులెత్తి పోవలయున?
పారక యిందుండి దాని
పరిరక్షణ చేయలేమ?

మాయరాక్షసులు మనలను
మాయచేసి భయపెట్టగ
వెఱబొమ్మను తెచ్చినారు
వెఱపేటికి దీనిజూచి

ఈ కిటుకును మీరలెరిగి
ఇక దీనిని పడగొట్టుడు
అంతదీనిపని ముగియును
ఆజికి వెనుదిరిగి రండు!

వానరసేనలు ధైర్యము
పూనివచ్చి రణముసేయ
కుంభకర్ణు వెఱబొమ్మను
కొండరాళ్లతో కొట్టిరి

రాళ్లవాన కుంభకర్ణు
రవ్వంత చలింపదయ్యె!
వానరాళ్లు దున్నమీద
వర్షించిన చందమయ్యె!

ఓరికుంభకర్ణ నీమ
హోన్నత దేహంబును గని
కపివీరులు గుండెలదరి
కంపిల్లిరి గడగడమని

మారుతి నీలుడు శరభుడు
మైందుడు ద్వివిదుడు ఋషభుడు
మొదలగు వానరవీరులు
కదన రంగమున దూకిరి.

**ద్వివిదుడు**

ద్వివిదుడొక్కశిఖరము గొని
విసరె కుంభకర్ణుమీద
కానీ అది వానిమీద
కాక వాని సేనలపై
బడిచంపెను ప్లవగుడంత
పర్వత శిఖరము మరొకటి
విసరె నదియువాని రథము
విధ్వంసము గావించెను.

భయపడిరాక్షసుని సమీ
పమున కేగలేకనేమొ!
దూరము నుండియె వైచిన
కారణాన నట్లాయెను.

**హనుమంతుడు**

హనుమడపుడు గిరిశిఖరము
లను చెట్లను తెచ్చి కుంభ
కర్ణుమీద విసరివేసె
కానివాడు శూలముతో
వాటిని చూర్ణము చేసెను
వాని బలమ్మతిశయించె

అంతటితో ఆగక కపు
లందర తనశూలధార
లకు బలిగావించుచుండ
రయమున మారుతి అప్పుడు

ఘనశిఖరము తెచ్చి కుంభ
కర్ణు మీద విసరి వైచె
ఆదెబ్బకు వ్యథజెందుచు
అసురుడు నెత్తురు గ్రక్కెను.

అంత టసురుడలుక జెంది
అద్రివంటి శూలముచే
హనుమంతుని వక్షస్థల
మును జీల్చగ ప్రహరించెను

రొమ్ముజీల్చబడి మారుతి
దిమ్మెక్కినవాడై స్మృతి
దప్పినేలబడి పోయెను
దనుజసేన హర్షించెను

## నీలుడు

భయపడి పరువెత్తుచున్న
ప్లవగుల నిల్పుచు నీలుడు
కొండశిఖరమొకటి తెచ్చి
కుంభకర్ణు మీదవేసె

వాడు దాని పిడికిటిచే
వడిగ ముక్కలుగ జేసెను
మోకాటను నీలాఖ్యుని
మోదనతడు స్పృహదప్పెను

## శరభాదులు

శరభాదులు వాని మీద
గిరిశిఖరంబులు గురిసిరి
అవి వానికి చీమలు పా
రాడినట్టులని పించెను.

ద్వివిద హనుమ నీలాదులు
తెగబడి పోరుచు రాక్షసు
బలధాటికి మూర్ఛితులై
పడిపోయిరి రణభూమిని

కపిసేనా సమూహాలు
కాళ్లమీద వీపుమీద
భుజముమీద బొజ్జమీద
పూన్కి ఎక్కిరక్కుచుండ

చేతికందినట్టి కపుల
నేతిముద్దలటు మ్రింగెను
కపులు ముక్కుచెవుల నుండి
గ్రక్కున బయటికి వచ్చిరి.

## అంగదుడు

వేసవివేడికి మాడిన
విపినము కార్చిచ్చుకు ద
గ్ధంబైనటు కుంభకర్ణ
కాలాగ్నికి కపిసేనలు
నాశనమగుటనుగని అం
గదుడు ముందుకురికివచ్చి

కుంభకర్ణు నెదుర్కొనగ
కొదమసింగమై వచ్చెను
ప్లవగుల రాజ్యానికి యువ
రాజు, ఇంద్రపౌత్రుడతడు

గిరిశిఖరముతెచ్చి వాని
శిరముపైన బడవైచెను
అంతవాడు మిగులనొచ్చి
అంగదు హతమార్చనెంచి

శూలమంగదుని మీదను
సూటిగ విసరెను అంగదు
డద్దానిని లాఘవమున
అవలీలగ తప్పుకొనెను.

అంతటితో ఆగక ఆ
అంగదుడా కుంభకర్ణు
అరచేతను చరచినాడు
అంత వాడు స్పృహతప్పెను

వెనువెంటనె తెలివితెచ్చు
కొనిదనుజుండెడమ చేతి
ముష్టిఘాతమున నంగదు
మూర్ఛిల్లగ జేసినాడు

## సుగ్రీవుడు

అంగదుడటోట్లటజూచి
అర్కసుతుడు సుగ్రీవుడు
కోపముతో గిరిశిఖరము
కుంభకర్ణుపై వేసెను

అది రాక్షసురొమ్ముదాకి
నంతనె ముక్కలు ముక్కలు
నై పడిపోయెను రాక్షసు
డాగ్రహోగ్రదగ్రుడగుచు

"ఋక్షరజుడి కొడుకువి సు
గ్రీవుడవీవేకద" అని
శూలమ్మును విసరెరాక్ష
సుడు, దానిని మధ్యలోనె

హనుమంతుడు పట్టివైచి
తనమోకాటికి నానిచి
విరచి పారవైచె నంత
వెరగుజెందె నసురసేన

అంతకుంభ కర్ణు డాగ్ర
హావేశముతో ఘనశిఖ
రమును తెచ్చి పడవేసెను
రవిసూనుని మీదనపుడు

రవిసూనుడు మూర్ఛనొంద
రాక్షసుడతనిని పట్టుక
పరుగెత్తెను లంకలోని
కరుణాత్మజుడంతలోన

మూర్ఛతేరుకొని రాక్షసు
ముక్కు చెవులు కొరికి తెంపి
వైచి గగన సీమ కెగసి
వచ్చి రాఘవునిజేరెను

పెద్దముద్గరంబును గొని
యుద్ధానికి పరుగెత్తుక
వచ్చి కుంభకర్ణుడు తన
వాళ్లెవరో పరవారెవ

రో చూడక వారందరి
రుధిర పానమొనరించెను

రక్తపిపాసుడు రాముని
రక్తము ద్రావగనెంచెను
రామాస్త్రమె తనరక్తము
ద్రావనుండెననితలపడు

కుంభకర్ణుమేని మీద
కోతుల గుంపులుబ్రాకెను
వాడుమైవిదల్చ క్రింద
పడి పోయిరి కపులందరు

కోతులనార్గుర నేడ్గుర
చేతబట్టుకొని నోటను
పడవేసుక మ్రింగుచుండె
భయకంపితులైరి కపులు

ప్లవగులు పరుగిడుచు రామ
భద్రువెనుక జేరుటగని
రామునిమీదికి వచ్చెను
రావణాసురుని తమ్ముడు

## లక్ష్మణుడు

నేనుండగ రామునితో
నీవు యుద్ధమొనరింతువ
నామీదికి రారా! అని
సౌమిత్రి సవాలువిసరె.

నిన్నుజంపిలాభమేమి?
నీ అన్ననుముందుజంపి
అనంతరము నిన్నుజూతు
నని ముందరిగెను దైత్యుడు

## రామునిచే కుంభకర్ణవధ

రాముని కెదురగ వచ్చెను
రావణాసురుని తమ్ముడు
రాముడ నేనే రారా!
రాక్షసుడా! అనిరాముడు
రౌద్రాస్త్రమువదలెను అది
రాక్షసు వక్షముజీల్చెను

అంత రాక్షసుడు చలించి
అదవదపడ వానిచేతి
ఆయుధమదిజారిపడెను
అంపవాన ఆగదయ్యె.

దనుజుడు గిరిశిఖర మొకటి
గొని రాముని మీదవిసరె
రామబాణములు దానిని
రాలగొట్టి పొడిగజేసె.

కదనభూమినుండి కుంభ
కర్ణు కదలనీక కపులు
వాని మీదికెగబ్రాకిరి
కానివాడు విదల్చగనె

కపులందరుపడిపోయిరి
గర్జించుచువాడు ముద్గ
రము త్రిప్పుచుయమునివోలె
రణస్థలిని దిరుగాడెను

రణావేశ వివశుడైన
రావణానుజుడుకపులనె
గాక రాక్షసులను గూడ
కబళించుచు దిరుగాడెను.

అల్లెత్రాటి మ్రోతదిక్కు
లన్ని నిండజేయుచు రఘు
కుల భూషణుడగు రాముడు
కుంభకర్ణుతో నిట్లనె

"నిలునిలు ఓ రాక్షసుడా!
నిలువుమునిన్నిపుడె యముని
దగ్గర కథితిగ పంపెద
తావకశౌర్యము నణచెద"

అపుడు కుంభకర్ణుడు శౌ
ర్యమున నిట్లు పలికినాడు
"వీడెవ్వడు విరూపుడని
వెక్కిరించకుము రామా!

రావణాసురుని తమ్ముడ
దేవకంతకుడను కుంభ
కర్ణుడ నన్నెరుగవె రా
ఘవనాతో తలపడెదవ!

నాముద్గరమును జూడుము
రామా! నేదీని చేత
దేవేంద్రుని నోడగొట్టి
తిని'' అని ముద్గరమూనిన

దక్షిణ హస్తమునుపైకి
తగ నెత్తెను. రాముడపుడు
అనిలాస్త్రముతో దానిని
అవలీలగతెగ వేసెను

దానిక్రిందబడి రాక్షస
వానరులెందరొ చచ్చిరి
దనుజు డపుడు యెడమచేత
పెను వృక్షము పీకితెచ్చి

రాముని కొట్టగ రాగా
రాముడపుడు హైంద్రాస్త్రము
వేసివాని వామకరము
వేవేగమె తెగవేసెను

దానిపాటునకు విరిగెను
తరువులు దొర్లెను శిలలును
చచ్చిపడిరి తరుచరులును
రొచ్చుచు రాక్షసుడప్పుడు

ఉరవడి ముందుకు రాగా
త్వరపడి రఘువీరు డర్థ
చంద్రద్వయి చేతవాని
చరణములను ఖండించెను.

కాలుచేతులును తెగినను
ఘటకర్ణుడు గుహనుబోలు

నోరుతెరచి ఘోషించుచు
శ్రీరాముని మ్రింగవచ్చె

తెరచి కొనిన నోటిలోన
శరముల నింపెను రాముడు
చురచుర చూచుచు నిశా
చరుడుముందు రాసాగెను.

అసిధారా నిశితంబగు
ఐంద్రాస్త్రము వేసి కుంభ
కర్ణు శిరము తెగవేసెను
కాకుత్స్థుడు శ్రీరాముడు

వృత్రాసురు నింద్రుడు వధి
యించి నట్లు కుంభకర్ణు
రాముడు వధియించివైచి
ప్రకాశించె సురలు మెచ్చ

కొండశిఖరమును బోలిన
కుంభకర్ణ శిరము నింగి
కెగసి నేల బడిపోవుచు
గృహగోపురములగూల్చెను

మొండె మెగసి పోవుచు నం
బుధినిబడుచు మకర సర్ప
ములను జంపగా జలము-
ప్పొంగివచ్చి కపులజంపె.

వాని పౌరుషంబేమన
వచ్చు చచ్చిగూడ వాని
మొండెమెగసివచ్చి శత్రు
వులపైబడి వధియించెను

తనుచెప్పిన నీతి వినని
దశకంఠుని కనువిప్పగ
నేమోయన ఖండితశిర
మెగసివచ్చి గోపురాల
గూల్చెను రాబోవుకీడు
గూర్చి తెల్పనోయనంగ!

కుంభకర్ణ పౌరుషం బ
కుంఠితమై యలరారెను
వాడు వీరమరణమొంది
స్వర్గధామమునుపొందెను

అవయవాలవన్నియు తెగి
అట్టెపోయిన గానీ
వెన్నుచూపకరి నెదిర్చి
వీరమరణమొందినాడు

వానిమేను ఖండఖండ
మైననేమి ప్రతిఖండిత
అవయవ మరిసేనల హత
మార్చిగాని నేలబడదు

మోసముతో వేసముతో
ముచ్చిలిడిన సీతను రా
మునకిమ్మన వినకున్నను
ముప్పున అన్నను వీడని
భ్రాతృవత్సలుడ! నీసరి
ధాత్రిలోన యెవడయ్యా!

పదకరములు నరుకబడియు
వైరికి వెన్నిడని నీవు

భండనమున వైరిచేత
భంగమొంది వెనుదిరిగిన
అన్న రావణునికన్నను
అధికుడ వీవేనయ్యా!

చెప్పిన విననట్టి అన్న
ఛీకొట్టగ అన్నువిడి
వైరిజేరు విభీషణుని
తీరు నీవుకాదయ్యా!

శౌర్యమందు శీలమందు
స్వార్థరహితమందునీకు
సముడెవ్వడు కుంభకర్ణ
శౌర్యశీల సంపన్నా!

## పంచమాశ్వాసం

### రావణనిర్వేదం

హతశేషులు కుంభకర్ణు
డట్లొటను చెప్పగవిని
రావణాసురుడు విషాద
దావాగ్ని దహించసాగె

కుడిభుజమౌ ఘటకర్ణుడు
కూలిపోయెనన రావణు
గుండెలోన కట్టుకున్న
కోట కూలినట్లాయెను

అంతులేని దుఃఖములో
అనుజుని ఘనవిజయంబులు
పదే పదే తలచుకొనుచు
పనలి పనలి దుఃఖించెను

కుంభకర్ణ చిత్రవధకు
కుమిలి కుమిలి శోషిల్లెను
అతని బలసాహసాలు
ఆత్మదలంచుచు నేడ్చెను.

విభీషణుని సలహాలను
వినలేదే అని పశ్చా
త్తాపతప్తుడై పోయెను
తప్పెరింగి కనుతెరిచెను

ఇంతగ చింతించుచు లం
కేశుని కభిమాన అహం
భావంబులు చావకతని
చావు దగ్గరగజేర్చెను.

## రావణ సుతానుజుల మరణం

కుంభకర్ణు మరణముతో
క్రుంగిపోవురావణు నో
దార్చి రణానికి సిద్ధం
బైరి అతనిసుతానుజులు

కపులకు రాక్షసులకు భీ
కరసంగ్రామము జరిగెను
ఇరువైపుల వారెందరొ
మరణించిరి యుద్ధమందు.

అంగదుచే నరాంతకుడు
హతమయ్యెను మారుతిచే
దేవాంతక త్రిశరు లొరిగి
దేహాంతకులైపోయిరి

మహోదరుడు నీలునిచే
మట్టిగరిచి పోయినాడు

మహాపార్శ్వుడును ఋషభుని
చే హతుడైపోయినాడు

అతికాయుడు లక్ష్మణ బ్ర
హ్మాస్త్రమునకు మరణించెను
అసురేంద్రుని గుండెలు నీ
రైపోయెను ఆశలుడిగె

కొడుకులు తమ్ములు రణమున
కూలిపోవుచున్నందుకు
నిశాచరేంద్రుడు మిక్కిలి
నిర్వీణ్ణుండైపోయెను.

## ఇంద్రజిత్తు మాయయుద్ధము

ఆశలన్ని అడియాశలు
నైపోవుచునుండగ ని
ర్వేదములోక్రుంగి దుఃఖ
వివశుడైన రావణుగని

ఇంద్రజిత్తు సమీపించి
ఇట్లనియెను తండ్రీ! నే
నుండగ నీవింత దైన్య
మొందనేల ఖేదపడకు

రణమున నేనిపుడే ఆ
రామలక్ష్మణుల గూల్చెద
విపినచరులనందర నే
విధ్వంసముగావించెద

చతురంగబలాలు వెంట
సాగుచుండ రథారూఢు
డైన ఇంద్రజిత్తు దారి
లోనె అగ్నికాహుతులిడె

అగ్ని ప్రసన్నుండై బ్ర
హ్మాస్త్రమ్మును ప్రసాదించె
రథము కదిలె నింద్రజిత్తు
రణరంగము ప్రవేశించె.

## ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్ర ప్రయోగం

అద్భుతగులు వానరసే
నా నీకము పైన బాణ
వర్షము కురిపించి కపుల
వలవల యేడ్పించినాడు

కన పడకుండగ రావణ
తనయుడు శరపరంపరల
కపుల మీద కురిపించుచు
కల్లోలము సృష్టించెను.

గంధమాదనుడు ద్వివిదుడు
మైందుడు నీలుడు అంగదు
డినసూనుడు జాంబవంతు
డిత్యాది మహాయోధులు

రావణసూనుని మాయల
రణధాటికి మూర్ఛితులై
పడిపోయిరి రణభూమిని
భయకంపితులైరి కపులు

రావణాత్మజుడు బ్రహ్మా
స్త్రమును ప్రయోగించినాడు
రామలక్ష్మణులు రాణువ
తో మూర్ఛితులై పోయిరి

చలన మింతలేక వారు
శవములట్లుపడుటనుగని

వారందరు చచ్చిరి అని
భ్రమసి ఇంద్రజిత్తు తిరిగి

లంకకేగి తన విజయము
రావణుతో చెప్పుకొనెను
తనయుని విజయమునకలరి
దనుజేంద్రుడు కడుపొంగెను.

## బ్రహ్మాస్త్ర బంధ విముక్తి (74వ సర్గ)

బ్రహ్మాస్త్రము విభీషణుని
పై అదిపనిచేయలేదు
కొంతవడికి తిన్నగ హను
మంతుడు మేల్కొనివచ్చెను.

వారిద్దరు దివిటీలను
బట్టుక తిరుగాడినారు
బహుకష్టముమీద జాంబ
వంతుడు కనిపించినాడు.

బ్రహ్మపుత్ర! క్రూరాత్ముని
బాణాలకు నీప్రాణము
బలిగాలేదు గదా! అని
ప్రశ్నించెను విభీషణుడు.

"రాక్షసేంద్ర! నిన్నునేను
వీక్షించగ లేనుగాని
కంఠధ్వనిబట్టి నిన్ను
కనుగొంటి విభీషణుడని

బాణతీవ్రతకు కన్నులు
కానరాకయున్నవి ఓ
విభీషణా! హనుమడు జీ
వించియె యున్నాడా"! అని

జాంబవంతుడడుగ విభీ
షణుడు చకితుడై ఇట్లనె-

అయ్యా! రామలక్ష్మణులు
నంగద సుగ్రీవాదులు
నేమైనారని అడుగక
ఏల హనుమనొకని గూర్చి
అడిగితి రొక హనుమమీద
అంత మమత్వమ తాతా!

అని విభీషణుడు పలుకగ
"అయ్యా! హనుమంతుడొకడు
బ్రతికియున్న అందరమును
బ్రతుకుదు" మదియెట్లందువ-

"హనుమంతుడు వేగమందు
అనిలసముడు, తేజమందు
అనలసముండతడు మనిన
మనకంతా జీవితాశ

అతడుబ్రతికియున్న యెడల
బ్రతికినట్లె మనమంతా
అతడు హతుండైన మనము
బ్రతికియు చచ్చినవారమె"

అనుచు ఋక్షవిభుడు విభీ
షణునితోడ వాక్రుచ్చెను
అంత హనుమ జాంబవంతు

నంఘ్రులపై వ్రాలి మరు
త్తనయుడ నేవచ్చినాడ"
నని అభివాదము చేసెను.

**హనుమంతుడు ఔషధగిరితెచ్చుట-**

అంతజాంబవంతుడు హను
మంతుని గాఢాలింగన
మొనరజేసికొని, హనుమా!
వినుమా! నామాటనిపుడు

బ్రహ్మాస్త్రప్రభావమున
పడియుండిన మనవారిని
రామలక్ష్మణులను నీవె
రక్షించగ జాలువాడ

వీవిపుడే జలధి ధాటి
హిమవంతముజేరి అచట
ఋషభశైల కైలాసము
రెంటినడుమ ఓషధ గిరి
కలదు దానిమీద దివ్య
కాంతుల మూలికలు గలవు

చనిపోయిన బ్రతికించెడి
ఘనమగు "మృత సంజీవని"
నాటిన ములుకులనుదీయు
మేటిదగు "విశల్యకరిణి"

గాయపు మచ్చలు మానగ
జేయును "సావర్ణకరణి"
విరిగిన ఎముకలను కుదర
గరిపెడి "సంధానకరణి"

ఇవినాలుగుగల కొండను
ఇపుడేగొని తేవలయును
అనిఋక్షవిభుండు పలుక
హనుమవెడలె వెనువెంటనె.

ఆరాతిరి హనుమ త్రికూ
టాద్రిమీదినుండి నింగి
కెగుర కొంత గిరివిరిగెను
ఇండ్లుకొన్ని కూలిపడెను.

జాంబవాను మాటబట్టి
సత్వరమే హనుమంతుడు
ఆ హిమగిరి జేరి ఔష
ధాద్రిని పెకలించుకగొని.

తెచ్చి సమీపించగనే
చచ్చిన వానరులందరు
బ్రతికినారు గాయపడిన
వారును నయమైనారలు.

ఔషధాల గాలిసోకి
నంతనె రఘుసోదరులును
నిదురలేచినట్లు లేచి
నిమ్మళముగ కనిపించిరి.

వానరసేనంత లేచి
వచ్చియుద్ధమునకు సిద్ధ
మైపోయెను గాయములవి
యన్ని మాయమైపోయను

క్షతగాత్రుండొక్కడైన
వెతకిచూడ కానరాడు
అందరు సమరోత్సాహకు
లై గర్జించుచునుండిరి.

వానరశవమొక్కటియును
కానరాదు రామదండు
సింహనాద మొనరించుచు
సిద్ధమయ్యె యుద్ధమునకు.

కాని రాక్షసుల కీఅవ
కాశము లేకుండ పోయె!
అరికి తెలియకూడ దనుచు
అసురేంద్రుడు రాక్షస శవ
ములను జలధి ద్రోయించెను
ముప్పునుకొని తెచ్చుకొనెను.

దివ్యౌషధముల కొండను
తిరిగి తీసికొని మారుతి
వెళ్ళి యథాస్థానములో
పెట్టి తిరిగి వచ్చినాడు

## వానరులు లంకను కాల్చుట

మోసముతో ఇంద్రజిత్తు
చేసిన అపకారమునకు
కినుకజెంది సుగ్రీవుడు
హనుమంతునితో నిట్లనె

కొడుకులు తమ్ములు రణమున
మడయుటచే శోకతప్తు
డై రావణు డనికి రాడు
అయితే మన మూర్ఖుందుమ!.

కావున మనమీరాత్రే
కాల్చివేయవలె లంకను
అని సుగ్రీవుడు కపులకు
ఆజ్ఞలిచ్చె నంతలోన

కాగడాలు చేతబట్టి
కపులగుంపు నగర ప్రా
కారాలకు నెగబ్రాకుచు
గంతులోన లంకజొరిరి.

రాక్షసులను తరిమికొట్టి
లంకాపురి భవనాలను
తగులబెట్టి గోపుర సౌ
ధాలనెల్ల కూలగొట్టి

అస్త్రములుంచిన శాలలు
అశ్వగజాదుల శాలలు
అసురులు వసియించు ఇండ్ల
వన్నింటిని తగలబెట్టి,

మర్కట భల్లూకసేన
మంటలవలె చెలరేగుచు
గర్జించుచు లంకలోన
కల్లోలము సృష్టించెను.

గుంపులు గుంపులుగ వచ్చి
కొంపలన్నిటికి నిప్పం
టించిరి భగభగమంటలు
మించిరేగి పోతుండగ

పసిపిల్లలు స్త్రీలు ముసలి
వాండ్లు లబో దిబో మనుచు
మంటలలో అల్లాడుచు
మాడిమసైపోయినారు.

నగరమంత మండుచుండ
నగమంతటి మోదుగు చె
ట్టది నిండుగ పూచినట్లు
అగుపించెను, అజ్వాలలు
ప్రతిఫలింపగా అంబుధి
రక్తాంబుధిగా దోచెను.

దేహంబులు కాలిపోగ
గేహంబులనుండి బయటి
కరుగుదెంచ కపులు వార
లందరపై దాడిచేయ

కపులకు రాక్షసులకు భీ
కర సమరముసాగె, ఘోర
నిస్వనములు నినదించుచు
నింగినేల నిండుకొనియె.

రామలక్ష్మణులు నగర
ప్రాకార ద్వారానికి
సమీపాన నిలచి ధను
ష్టంకారము చేసినారు

అదివిని రాక్షసుల గుండి
యలపిడుగులు పడినట్లయె
రామబాణ పరంపరలు
రావణుకోటలు గూలిచె.

## కుంభనికుంభాదుల వధ

కుంభకర్ణతనూభవులు
కుంభనికుంభులు రావణు
డంపగ వచ్చిరి వారికి
అండదండగా యోధులు

శోణితాక్ష యూపాక్షులు
శూరకంపన ప్రజంఘు
నాది వీరవరులు వారి
ననుసరించి వచ్చినారు.

రాక్షస వానర యోధుల
రణము భయంకరమాయెను
ఉభయసేనలందు పెక్కు
రొరిగిరి యుద్ధమొనర్చుచు

దొమ్మియుద్ధమందు అంగ
దుడు కంపను గూల్చివైచె
కంపనుడట్లొట జూచి
కత్తిదూసి శోణితాక్షు

రాగ వానిచేతికత్తి
లాగుకొనెను వాలిసుతుడు.

ఇనుపగదనుగొని రాక్షసు
డెదుర్కొనెను వాలిసుతుని
వారిద్దరి దొమ్మిపోరు
ఘోరముగా సాగుచుండ

యూపాక్ష ప్రజంఘనుల
త్వరవడితో వచ్చిశోణి
తాక్షుజేర, ద్వివిదమైందు
లంగదుకై వేవచ్చిరి.

ఆ ముగ్గురు రాక్షసులకు
ఈ ముగ్గురు వానరులకు
ఘోరభయంకర యుద్ధము
కొనసాగుచు నుండ నపుడు

అంగదుదెబ్బకు ప్రజంఘు
డడల చేతి కత్తి జారె
దానిని చేకొని ప్రజంఘు
తలనరికెను వాలికొడుకు.

యూపాక్షుండంగదుపై
ఉరవడితోరాగా ద్వివి
దుడు రాక్షసు నెదిరించెను
పిడిగుద్దులతో బొడిచెను

యూపాక్షుని రక్షణకై
ఉరికివచ్చి శోణితాక్షు
ద్వివిదునిగదతో గొట్టగ
వేగమె ఆకపి రాక్షసు

నేలబడగ ద్రోసి వాడు
నీల్గుదాక గొంతు పిసికె
ఇంతలోన మైందునిచే
అంతమొందె యూపాక్షుడు.

తమవీరులు నల్వురిట్లు
సమసిపోవ దైత్యసేన
భయపడి కుంభుని చాటుకు
పరుగులెత్తి చేరుకొనెను.

కుంభుడు కోపించి క్రూర
ఘోర సర్ప సమములైన
తీక్ష్ణబాణముల వేసెను
ద్వివిదుడు మూర్ఛితుడయ్యెను.

అనుగుసోదరుని పాటుకు
కినిసిమైందు డురుశిఖరము
గొని వేయగ దనుజుడు దా
నిని శరమున ఖండించెను

అంతటితో ఆగక ఆ
అసురేంద్రుడు నిశితబాణ
మును వేసెను మైందుడుర్వి
మూర్ఛితుడై పడిపోయెను.

మేనమామ లిరువురట్లు
మేది సొమ్మసిలి పడగా
అంగదు డురవడి శిఖరము
అసురునిపై పడవేసెను.

దానిని పొడిపొడిగ గొట్టి
దానవు డంగదు నిశితపు
శరములతోగొట్ట బాధ
సైపలేక కపిమూర్ఛిలె

అదిగని సుగ్రీవుడు వే
అసురరథముపైకి దూకి
వానివిల్లు విరిచి, "ఓరి
నీవు ధనుర్విద్యలోన
రావణుతో సరియగుదువు

విల్లు పారవైచి ప్రాణ
భీతి చేత వెన్నుచూపి
పరుగెత్తిన నీపితృవ్య
పటిమకు నీవే సముడవు

యుద్ధముచేసితివి అలసి
యుంటివి బడలిక తీరుచు
కొనిరా యుద్ధానికపుడు
కుంభుడ నాపటిమ జూడ

కుంభకర్ణుముక్కనుండి
సంభవించి నట్లుంటివి
ఆ ముక్కును తెగగొరికిన
నీమృత్యువునై వచ్చితి

సుగ్రీవుని అపహాసము
శూలమట్లు గ్రుచ్చుకొనగ

కుంభుడాగ్రహించి పట్టు
కొనె గట్టిగ సుగ్రీవుని

పట్టిన పట్టూడ దన్ని
ప్లవగ నాయకుడు కుంభుని
పట్టుకొని సముద్రములో
బడవేసెను వానినపుడు

వాడు పౌరుషమున లేచి
వచ్చి వానరునితో తల
పడి పోరాడుచు చివరకు
ప్లవగుని పోటుకు నీల్గెను.

అన్నను సుగ్రీవుడు హత
మార్చుటగని రోషముతో
పరుగున వచ్చె నికుంభుడు
పరిఘాయుధమూని అనికి

హనుమంతుడు రొమ్మువిరిచి
అసురునికెదురుగ నిలిచెను
అంతవాడు పరిఘను హను
మంతు రొమ్ము దాకవైచె

హనుమరొమ్ము దాకిన పరి
ఘాయుధమది ముక్కలయ్యె
అపుడు హనుమభూకంపము
నందున గిరివలె వణకెను.

వెనువెంటనె హనుమ నికుం
భుని పిడికిట బొడువవాడు
తెలివితప్పి కొంతవడికి
తెప్పిరి మారుతిపైబడి

పట్టుకొనగ హనుమవాని
పట్టువిదల్చుక నేలం

గూలదన్ని వాని మెడను
కాల నులిమి నులిమి చంపె.

## మకరాక్షవధ

రావణాజ్ఞ తలదాలిచి
రథముమీద సేనలతో
ఖరపుత్రుడు మకరాక్షుడు
ఉరవడించి చనుదెంచెను

వానిరథము మీదనున్న
ధ్వజము నేలమీద బడెను
కాళ్లు తొట్రుపడగా క
న్నీళ్లు అశ్వములు గార్చెను

రథసారథి చేతినుండి
ప్రిదిలి కొరడ జారిపడెను
దుమ్మురేపె యెదురుగాలి
దుశ్శకునంబులు దోచెను.

అయినను లెక్కించక మక
రాక్షుడు రాముని ముందుకు
రథమును పోనిమ్మని సా
రథి కాజ్ఞాపించినాడు

దానవ వానర వీరులు
తలపడి పోరాడుచుండ
మకరాక్షుడు రాముని ముం
దుకు వచ్చెను గర్జించుచు

దాశరథీ! నేను లేని
తరుణమందు మాతండ్రిని
వధించినావు నిన్నిపుడె
వధింతును యెటుపారిపోకు

అని మకరాక్షుడు పలుకగ
ఇనకులు డిట్లని పలికెను

వాగ్యుద్ధము చాలించుము
వధియింతును నిన్నిపుడే
అని రాముడు బాణవర్ష
మును కురిసెను దనుజునిపై

రామబాణముల ధాటికి
రథతురంగములుగూలెను
సారథి చచ్చెను రాక్షస
వీరుడు శూలము ధరించి

నేలమీద నిలబడి తన
శూలము త్రిప్పుచు రాముని
పై విసరెను అది రాముని
బాణానికి ముక్కలయ్యె

మకరాక్షుడు రామునితో
మల్లయుద్ధమునకు సిద్ధ
మైరాగా వాని రాము
డాగ్నేయాస్త్రమునగూల్చె

# షష్ఠా శ్వాసము

## ఇంద్రజిత్తు మరల మాయయుద్ధం

మకరాక్షుడు రణభూమిని
మడిసెనన్న వార్తనువిని
దశకంఠుడు దుఃఖితుడై
తనయు నింద్రజిత్తు బిలిచి

"ఓకుమార! నీవుమహా
యోధాగ్రణివమరేంద్రుని
రణమందు జయించినావు
రణకుశలత గలవాడవు

రామలక్ష్మణులను జంపి
రావలయును వారు పరా
క్రములు పొంచియైన, మాయ
ప్రయోగించియైన, కాన
రాకుండగ నైన, వారి
పోకార్చుటయే నీవిధి."

అనిచెప్పిన తండ్రియాజ్ఞ
గొని అగ్నినివేల్చి నల్ల
మేకను బలియిచ్చి, నలువ
మెప్పునుగొని బ్రహ్మాస్త్రము

గైకొని రావణతనయుడు
గగనవీధి నదృశ్యుడుగ
నుండి బాణవర్షంబును
ఉధృతముగా కురియించెను.

వాడుకాన రాకుండగ
వాడి బాణములు గురిసెను
వాడిఉనికి కానరాక
వ్యధజెందిరి రఘువీరులు

రఘువీరుల తనువులు మో
దుగువృక్షాలై పోయెను
రామానుజు డాగ్రహించి
బ్రహ్మాస్త్రము విడువదలచి

"ఆనతిమ్మమన్నా! బ్ర
హ్మాస్త్రమ్మును ప్రయోగించి
ఈసమస్త రాక్షసులను
ఇపుడే హతమార్చివైతు"

లక్ష్మణుమాటకు రాముడు
ఆక్షేపణగా నిట్లనె-

"అనుజా! శాంతింపుము బ్ర
హ్మాస్త్రమిపుడు విడువరాదు
కానరాకయున్న వారి
పైన దీని విడువరాదు

శత్రువెవడొ వాని జంప
సమంజసముకాని సర్వ
సంహారము తగదు నీవు
శాంతింపుము తమ్ముడా!

వానిమాయ చెడగొట్టితి
మేని వానరులె వీనిని
చంపగలరు అంతెందుకు
చంపుదునిపుడే వీనిని"

అనిరాముడు పలుకుచుండ
వినిన ఇంద్రజిత్తు జడసి
యుద్ధము మానినవాడై
ఉపాయముగ మరలినాడు

తానుయుద్ధమును మానిన
దాశరథియు మానుననుచు
పశ్చిమ ద్వారము వద్దకు
పరుగున వచ్చెను దనుజుడు

హనుమ డొకడె సీతను జూ
చినవాడని పశ్చిమ దిశ
కరుదెంచెను హనుమంతుం
డాదిక్కును గాచుచుండె

**హనుమ చూచుచుండ ఇంద్రజిత్తు మాయసీతను వధించుట**

మాయాసీతను జేసెను
మాయలమాంత్రికుడు ఇంద్ర
జిత్తు మాయసీతను తెగ
చెండాడెను హనుమజూడ

ప్రళయకాల రుద్రుడగుచు
పవనసుతుడు ఇంద్రజిత్తు
తో తలపడి పోరాడెను
తుదకుయిట్లు తలపోసెను

ఎవరికొరకు మనమంతా
ఈ యుద్ధము సేయుచుంటి
మా సీతను చంపివేసె
అసురాధము డింద్రజిత్తు

ఈ సంగతి రామునితో
ఇపుడే వివరించవలయు
అనంతరము రాముడేమి
ఆనతిచ్చు నదిచేతము

అని రాముని సమీపించి
వనచరసేనలతో హను
మంతుడు చనుదెంచి విషయ
మంతచెప్పె దుఃఖించుచు

హనుమంతుడు వెళ్లిపోగ
దనుజుడు తన యుద్దేశము
ఫలియించెనటంచు నికుం
భిలదేవ్యాలయము జేరి
తమ విజయార్థము హోమము
తగసేయగ మొదలుపెట్టె

"దశకంఠుని తనయుడు సీ
తాదేవిని చంపివేసె"
అని మారుతి చెప్పగనే
హా! అని రాముడు మూర్ఛిలె

తెప్పరిల్లి రాముడు కను
రెప్పలు తెరిచెను లక్ష్మణు
డార్డుడగుచు రామన్నను
ఆలింగన మొనరించెను

తానేడ్చుచు అన్నను ఓ
దార్చుచు లక్ష్మణుడిట్లనె

**లక్ష్మణుని ఓదార్పు**

"ధర్మమంటె ఇదియేనా?
ధర్మమాచరించువాని
కన్నీ కష్టాలేనా?
కన్నీళ్లే మిగిలేనా?

అధర్మముగ నున్నవాని
కన్ని సుఖములే కలుగున?
సదాధర్మ మాచరించు
జనునకన్ని యిడుములేన?

అక్రమాలుసేయువాడు
ఆనందముగా నుండున?
సక్రమాలు సలుపువాడు
సంకటములనే పొందున?

ధర్మము ధర్మము అంటూ
తండ్రి మాట నిలుపుటకై
సాధించిన దేమి అన్ని
సంకటాలె ప్రాప్తించెను

ఏడున్నదిరా ధర్మము
ఏదీ అది యెటు బోయెను
కానరాదు కనిపించిన
కష్టాలే వడ్డించును
కన్నీళ్లే కురిపించును

"ధర్మోరక్షతి రక్షితః"
తత్సూక్తి నిజంబగుచో
నిత్య ధర్మపరుడ వైన
నీకీ కష్టాలెందుకు?

ధర్మహాని చేయునట్టి
దనుజుడు సుఖముగ నుండెను
ధర్మాత్ముడవగు నిను సం
తాపాగ్నులు చుట్టుకొనెను

రామన్నా! ధర్మము నిను
రాజ్యహీనుగా జేసెను
అంతటితో ఆగక బ్రతు
కంత అడవి పాల్జేసెను

అర్ధాంగిని దుర్మార్గుడు
అపహరించుకొని పోయెను
కడగండ్లే కొనితెచ్చెను
కన్నీళ్లే కురిపించెను

దిక్కుమాలజేసి నిన్ను
వెక్కిరించు నీధర్మము
నిన్నడవుల పాలుజేసి
కన్నీళ్లే కురిపించెను

ఏడున్నదిరా ధర్మము
ఏదీ అది యెటు బోయెను?

దానికొరకు సర్వస్వము
ధారపోసినావు గదా!

అర్థహీనుగా జేసెను
అనర్థాలు కొనితెచ్చెను
అర్థరహితుడైన వాని
నసమర్థునిగా జేసెను

తండ్రిమాట నిలుపుట నా
ధర్మమనుచు రాజ్య త్యా
గము చేసితి దాని ఫలము
కష్టాలను కొనితెచ్చెను

ధర్మమాచరించ జయము
తథ్యమనుట నిజముకాదు
నిజమ్మైన ఏదీ అది
నీయెడ అది ఇట్లున్నది?

దిక్కుమాలజేసి మనల
వెక్కిరించు ధర్మము అది
శత్రువుచే వదినమ్మను
చంపించెను ఘోరమ్మిది

ధర్మము కొరకై రాజ్యము
ధారవోసి ప్రతి ఫలముగ
అర్థహీనుడై పోతివి
అనర్థాల పాలైతివి

నిను అభిషిక్తుని జేసెద
నని సభలో పలికి పిదప
నిన్నడవులకంపె జనకు
డన్నయ్యా నిర్దయుడై

పితృవాక్యము పాలించగ
ప్రతిన బూనినాడవందు

వట్లగుచో పితృవచనము
నన్నృతము కాకుండునట్లు

అభిషిక్తుడవై యుండక
అట్లేటికి పిదపచెప్పి
నట్టి మాటనిలుపుటకై
అడవుల కరుదెంచితీవు

మొదటచెప్పినట్టి మాట
వదలక పాటించియున్న
పట్టముగట్టుకొని మహా
భాగ్యశాలివై యుందువు

పిదప చెప్పినట్టి మాట
విపినాలకు పంపించెను
దానినేల పాటించితి
జ్ఞాననిధీ! దాశరథీ!

ఒకచో పాటించక వే
రొకచో పాటించుట అది
సత్యపాలనంబగునా
సత్యపరాక్రమశీలా!

ఏ వేళకు ఏదితగునొ
ఆవేళకు అదిచేయుట
సౌఖ్యప్రద మట్లుగాక
సంకటములు సంభవించు

ధర్మమూల మర్థంబు గ
దా! నీవప్పుడు ప్రాప్తిం
చిన రాజ్యము నర్థంబును
ఛిన్నముగావించుకొంటి

వట్లగుటను మూలమైన
అర్థము పోగా ధర్మము

అప్రధానమై పోయెను
అర్థముతోనే ధర్మము

అర్థహీనుడగు పురుషుడు
ఆచరించు పనులన్నియు
వేసవియందల్పనదుల
విధమునశించుచు నుండును

అర్థమూల మిదమ్ జగత్
అనెడి సూక్తి నిజము నిజము
పురుషార్థములన్ని అర్థ
ముల చేతనె సిద్ధించును

అర్థకాంక్ష కలిగి రాజు
వైయుండినచో ఈ దు
ర్గతి పట్టక సుఖముగ జీ
వితము గడుపు చుందువుకద!

అయినదేదొ అయినదిపుడు
అన్నా నాకానతిమ్ము
ఇంద్రజిత్తు చేసిన అప
కృతికి ప్రతీకృతిని సేతు

అనుమతిమ్ముమన్నా లం
కను రావణుతో కూల్చెద
ప్రతీకార కక్ష దీర
బాణాగ్నుల కురిపించెద

అని లక్ష్మణుడన్నను నో
దార్చుచుండ విభీషణుడు
అటకు వచ్చి జరిగిన వృ
త్తాంతమంత తెలిసికొనెను

ఇది సత్యముకాదు రామ!
ఇలాతనయ సురక్షితము

మాయలాడు ఇంద్రజిత్తు
మాయసీతనే చంపెను

మనమంతా భ్రమసి దుఃఖ
మున మునుగుచు యుద్ధప్రయ
త్నము మానుదు మంతలోన
తన హోమము పూరించును

వాడిప్పుడు నికుంభిలా
వనములోన బ్రహ్మశిరో
నా మాస్త్రము సాధించగ
హోమము చేయుచునుండెను

ఆహోమము పూరించెన!
అదృశ్యుడై పోరు సలుపు
అపుడు వానిజంపసాధ్య
మవదు దేవతలకునైన

వానిహోమమిపుడే వి
ధ్వంసము కావించవలయు
అట్లుగాక వానిజంప
ఆవంతయు వీలుపడదు

ఇంకొక్క రహస్యము విను
మెవడు నికుంభిలహోమము
విఘ్నమొనర్చునొ వాడే
వీని జంపుననె విధాత

కనుక రామచంద్రా! ల
క్ష్మణకుమారు నావెంటను
పంపుము వానరసేనా
ప్రముఖ వరులు తోడురాగ

## ఇంద్రజిత్తు వధకై లక్ష్మణుడు విభీషణ హనుమదాతులతో వెడలుట

విభీషణుని ప్రతిపాదన
వినిరాముడు లక్ష్మణునకు
హనుమ జాంబవాదులతో
అనికేగుట కానతిచ్చె

విభీషణుడు ముందునడువ
వెంట లక్ష్మణుడు వానర
సేనలతో నికుంభిలా
సీమాంతము జేరవచ్చె

అదిగదిగో కారుమేఘ
మట్లు దనుజసేన చుట్టు
ముట్టినదద్దాని చెదర
గొట్టిలోని కరుగవలయు

రాక్షససేనా పరివా
రమ్మది పెట్టని కోటగ
చుట్టుండగ మధ్యమఱ్ఱి
చెట్టున్నది దానిక్రింద

హోమమింద్రజిత్తు చేయు
చుండినాడు కదలకుండ
అపుడు తుఫాన్ వచ్చినట్లు
కపిసేనలు మీదబడెను

లక్ష్మణబాణాలు కురిసి
రాక్షసులను చెదరగొట్టె
హనుమబలపరాక్రమాల
కసురసేన తల్లడిల్లె

రాక్షస వానరసేనలు
రూక్షించుచు పోరాడిరి
రామదండుకాగ లేక
రాక్షసులెందరొ మడసిరి

కూలుచు తనసేనలు గ
గ్గోలు పెట్టుచుండ ఊర
కుండలేక ఇంద్రజిత్తు
హోమమాపి రథమెక్కెను

## ఇంద్రజిత్తు విభీషణ సంవాదము

పినతండ్రి విభీషణు ల
క్ష్మణు ప్రక్కన జూచినాడు
భగ్గున మండుచు ఇట్లని
పలికినాడు ఇంద్రజిత్తు.

కులద్రోహి! శత్రువుతో
కలిసిపోయి వంశానికె
ద్రోహము చేసిన నీచుడ!
దుర్మతి! అని తూలనాడె

అంత విభీషణుడిట్లనె
అల్పజ్ఞా! వదరదేల?
కులమందున గుణమందున
గుణము ప్రధానము తెలియుము

రాక్షస కులమున బుట్టిన
రాక్షసుడను కాను నేను
ధర్మానికి కట్టుబడిన
ధర్మపరుడ నియమపరుడ

పరస్త్రీల పరధనముల
హరించు వానితో క్రూర
కర్మునితో సోదరుడని
కలిసియున్న చేటు కలుగు

దహనమ్మైపోవు ఇల్లు
తనదే అని త్యజియింపక
అందేయుండిన వానికి
హానిరాక తప్పదు కద!

అందుచేతనే కద నే
నన్నను విడివచ్చినాను
ఇంటి దీపమని దానిని
ఎవ్వడైన ముద్దాడున?

విభీషనుండిట్లు చెప్ప
విలయమూర్తియై రావణి
హనుమపైనన్న లక్ష్మ
ణుని గనియిట్లని పలికెను.

## లక్ష్మణుచే ఇంద్రజిత్తు వధ

లక్ష్మణ! నీవపుడే వ
జ్రాయుధమును బోలిననా
బాణాలకు మీరిరువురు
పడిపోవుట మరచితివా!

అనిచెప్పగ మిగులక్రోధ
మున లక్ష్మణుడిట్లనియెను
కనిపించక యుద్ధమొన
ర్చిన మాయలు సాగవిపుడు.

మగవాడవు నీవైతే
మాయలు మంత్రాలు మాని
నాతో యుద్ధము సేయర!
దైత్యకులాధమ నీచా!

అనికవ్వించుచు లక్ష్మణు
డసురేంద్రుని నందనుపై
ప్రాణాలను తీయు బాణ
పరంపరల కురిపించెను.

తెలివి తప్పి వెనువెంటనే
తెప్పరిల్లి ఇంద్రజిత్తు
సునిశిత శరములతో ల
క్ష్మణ హనుమ విభీషణులను
వేధించెను బాధించెను
విలువిద్యా దురంధరుడు

అంత లక్ష్మణుడు క్రుద్ధుం
డై రావణి కవచమూడ
గొట్టెను బాణాలతోడ
దిట్ట నిశాచరుడప్పుడు

సునిశిత శరములతో గొ
ట్టెను లక్ష్మణు కవచముపై
కాని ధర్మ కవచమ్మది
కాసంతయు చెదరలేదు

రామానజుడింద్రజిత్తు
రథసారథిని వధించెను
తనరథమును తానె నడుపు
చును దనుజుడు పోరాడెను.

శరభ గంధమాదన రభ
స ప్రమాధి కపివీరులు
ఎగరివచ్చి గుర్రాలను
తెగచిరి రథమునుగూల్చిరి.

ఎవ్వరెరుగకుండ లంక
కేగి ఇంద్రజిత్తు వేరు

రథము నెక్కి తిరిగివచ్చి
రణము సేయగా దొడగెను.

వానర సేనల పై శర
వర్షము కురింపించుచు హిం
సించు ఇంద్రజిత్తు ధనువు
త్రుంచి వైచె లక్ష్మణుండు

ఇంద్రారి మరొక్క ధనువు
అందుకొనెడి వ్యవధిలోనె
లక్ష్మణ బాణాలు వాని
రొమ్మున గ్రుచ్చుక పోయెను.

అయినను చలియించక రా
మానుజు నెదిరించి పోరు
సలుపునట్టి ఇంద్రజిత్తు
శౌర్యమదెంతని పొగడుదు.

కవచమూడి పోయి నెత్రు
గ్రక్కుచు నిడుపాటి ధనువు
గొని ఇంద్రుని వలె శరముల
గురిపించెను లక్ష్మణుపై

అపుడు నరుడు ప్రళయకాల
యమునివోలె రెచ్చిపోయి
ప్రాణాంతకమగు శరములు
పగతుని పై కురిపించెను

వాడును వెనుదీయక క్రొ
వ్వాడి బాణముల వేసెను
వాటిని నడుమనె త్రుంచెను
వాటమెరిగి లక్ష్మణుండు

అంతియె కాకుండను పదు
నైన శరముతోడ వాని

సారథి తలద్రుంచెను ల
క్ష్మణుడెంతటి వడిగలాడు.

సారథి లేకున్నను ఆ
శ్చర్యమొదవ తురగములవి
పెనుగులాడకను రథికుని
మనసెరింగి వర్తించెను.

బాణత్రయమును లక్ష్మణు
ఫాలముపై నాటె ఖలుడు
బాణపంచకమును దనుజు
ఫాలముపై నాటె నరుడు.

విభీషణుని నొసలు దాక
వేసె శరత్రయమువాడు
అంత విభీషణుడు వాని
హయముల గదతో జంపెను.

హయములట్టు లొటరావ
ణాత్మజుండు నేలమీద
దూకి విభీషణుని శక్తి
తోగొట్టెను, అంతలోన
దానిని పడగొట్టెను పది
బాణంబుల లక్ష్మనుండు

విభీషణుడు తీవ్రాంబులు
వేసెనంత ఇంద్రజిత్తు
యమబాణమువేయ కుబే
రాస్త్రమేసె లక్ష్మణుండు

ఆ రెండస్త్రాలు పోరు
చంబరాని కెగసి కొట్టు
కొనుచు ముక్కలై పడిపో
యెను నేలను పిడుగులవలె

అర్కకులోద్భవుడు వారు
ణాస్త్రమేయ ఇంద్రజిత్తు
రౌద్రాస్త్రంబేసి దాని
రయమున ఖండించివైచె

ఆగ్నేయాస్త్రము వేసెను
అమరవైరి దానిని సౌ
రాస్త్రముతో నణచివైచె
అవలీలగ లక్ష్మణుండు

అసురాస్త్రంబేసె సురేం
ద్రారి అంత లక్ష్మణుండు
రౌద్రాస్త్రంబేసి దాని
చిద్రముగావించె కాని,

వాని జంపజాలదయ్యె
వాడు సమస్తాస్త్ర వేది
ఏ అస్త్రంబేసిన ప్రతి
యెరిగి ప్రతిఘటించగలడు.

బ్రహ్మాస్త్రంబేసిన ప్రతి
బ్రహ్మాస్త్రంబేయగలడు
అని రాముని దలచుకొనుచు
ఐంద్రాస్త్రము సంధించుచు

"రామచంద్ర మూర్తి సత్య
ధర్మ పరాక్రమవంతుం
డేని శరమ! ఈ రావణు
సూను సంహరింపుమ" అని

లక్ష్మణుడు వచించుచు ఐం
ద్రాస్త్రమేయ అదిరావణి
శిరమును తెగద్రుంచివైచె
చిటికెవేయునంతలోన

శ్లో॥ "ధర్మాత్మా సత్య సంధశ్చ
రామో దాశరథిర్యధి
పౌరుషేషాచా ప్రతిద్వంద్వః
తదైనం జహిరావణిమ్".

అమరనాథు నోడించిన
అసురేంద్రుని పెద్దకొడుకు
కూలుటచే సురలెల్లరు
పూలవాన కురింపించిరి.

వానర సేనలు జయజయ
ధ్వానమ్ములు చేసెను హత
శేషులు రాక్షససేనలు
చెదరి బెదరి పరుగెత్తెను.

**రాముని కృతజ్ఞతా గుణం.**

హనుమ విభీషణుల పైన
హస్తంబులు వేసి నడచి
వచ్చి లక్ష్మణుడు అన్నకు
వాలి నమస్కృతు లొనర్చె

సౌమిత్రి దశాస్య సుతుని
చంపివేసెనని విని రా
ఘవుడు హర్షమున పొంగుచు
కౌగిలించుకొనె తమ్ముని

తమ్ముని శౌర్యపరాక్రమ
ధైర్యసాహసముల బొగడి,
హనుమ విభీషణుల తోడు
కలరికృతజ్ఞతను దెలిపె.

వనచర వీరుల కెల్లర
కును పేర్పేరున కృతజ్ఞ
తల తెలిపెను కృతజ్ఞతా
ధర్మమూర్తి రామమూర్తి.

"రావణునకు కుడి భుజమగు
రావణి జంపి తివి నీవు
రావణుజంపుట నాకది
లఘుకార్యంబైయున్నది."

అని రాముడు తమ్మునకును
మనసారగ కృతజ్ఞతను
ప్రకటించెను కృతజ్ఞతా
భావంబది యెంత ఘనము!

అనుజన్ముని కౌగిలించు
కొని రాముడు సుషేణుతో
నిట్లనె "ఓ భిషగ్వరా!
ఈ లక్ష్మణుతో పాటుగ
గాయవడిన వారినెల్ల
చేయు మయ్య నిరామయుల"

రాముడట్లు కోరగనే
లక్ష్మణునకు తదితరులకు
సుషేణుడు వేళ్ల వాసన
చూపగనే వారందరు
యధావిధిగ నిరామయులు
నై వర్థిలి విలసిల్లిరి.

# సప్తమాశ్వాసం

## రావణ విషాదం

ఇంద్రజిత్తు మరణవార్త
ఎదకోతై బాధింపగ
దుఃఖంబున లంకేశుడు
తూలిపడెను నేలమీద

కొడుకా! ఇంద్రుని గెలిచిన
గొప్పశూరుడవు గదరా!
నరునిచేత ఈనాటికి
నాతండ్రీ! ఇట్లైతివ!

నాఅంత్యక్రియలునీవు
చేయవలసియుండగ నీ
అంత్యక్రియలను నేనే
ఆచరించ విధి విధించె

రామలక్ష్మణులు వానర
రాజు బ్రతకియుండగ నా
యెదములుకులవట్లెయుండ
నెట్లేగితి నాకమునకు?

తనదుఃఖానికి హేతువు
తానేయైయుండి పుత్ర
బంధుమిత్ర సహోదరుల
బలిపెట్టెను రణాహుతికి

స్వార్థానికి జాతినెల్ల
బలిపశువునుజేసినాడు
తనదురంహకారానికి
తాబలియై పోయినాడు

అతిశోకంబున బొగులుచు
దనుజేంద్రుడు మూర్ఛిల్లెను
కొంతవడికి తెలివివచ్చి
కోపముతో చెలరేగెను

కనుబొమ్మలు ముడివడగా
కనుగవ నిప్పులురాలగ
పిడికిళ్లు బిగించి ప్రళయ
భీకరుడై పట పట పట
పండ్లుగీటచును ఖడ్గము
బట్టి రావణుండిట్లనె-

ఏనాడును శోకమెరుగ
ఈనాడీసీత వలన
నాకీశోకము కలిగెను
నరికివైతు దానినిపుడె

అనిఖడ్గము దూసినాడు
అవనిసుతను వధియించగ
తా చేసిన పాపానికి
తత్ఫల మిదియని తలచక

## సీతను చంపబోవు రావణుని సుపార్శ్వుడు వారించుట

అపు డమాత్యుడగు సుపార్శ్వు
డడ్డుపడుచు నిట్లనియెను
"ప్రభూ! మీరువైశ్రావణు
భ్రాతలు పండితులు వేద
వేత్తలు మీరొక అబలను
కత్తి దూసిచంపుటయా?

ఇంతినిచంపితిరను మీ
కెంత టపఖ్యాతిగలగు!

అట్లుగాక శత్రువునే
హతమార్చినమేలు కలుగు

కానమీరు శత్రువునే
కడతేర్చుడు అపుడుమీకు
ఆమెవశ్యురాలగు మీ
రామెననుభవించవచ్చు

నీవిపుడీమెను చంపిన
నీకోరికదెట్లుదీరు?
నీకోరిక దీర్చుకొనగ
నీవారాముని చంపుము

సీతనుచంపినచో చ
చ్చిన నీకొడుకులు తమ్ములు
లేచివత్తురా! రాజా!
రిపుతోయుద్ధము తప్పున?

పైగా రాముడు మరింత
పగతోమనలందర నా
శము చేయునుకాని సంగ
రము చేయుటమానుకొనడు

యుద్ధమదెట్లును తప్పదు
సిద్ధపడుము యుద్ధమునకు
సీతాపతి జంపి సీత
జేపట్టిన కీర్తికలుగు

సంగరమునరామునినే
చంపలేక చచ్చెదనో
అనిఅనుకొనుచో యిపుడీ
మెను చంపిన లాభమేమి?

పౌలస్త్యా! ఈదినమే
పాల్గుణ బహుళ చతుర్దశి

సమరయత్నమిపుడు చేసి
సమరానికి రేపువెళ్లు

అనిన సుపార్శ్వాఖ్యుని సల
హామేరకు దశకంఠుడు
ఆజ్ఞలిచ్చె మూలబలము
ఆలముసేయగ వెడలెను

మృత్యువునోర్విప్పి వాని
కెదురుచూచుచున్నదట్లు
గాక వాని కింత జరిగి
కనువిప్పది కాదదెట్లు?

ఆశాపాశము వానిని
యమపాశమువలె లాగెను
పరధారవ్యామోహము
బడబాగ్నిని బడద్రోసెను

మదహంకారములు వాని
బధిరాంధునిగాజేసెను
మూర్ఖత్వ మగాధకూప
మున వానిని బడద్రోసెను

**రాముడు రావణుని మూలబలము నిర్మూలించుట**

చతురంగబలాలుకోట్ల
సంఖ్యలలో బయలువెడలె
రాక్షసవానరసేనలు
రూక్షించుచుపోరుసలిపె

పరస్పరము రాక్షసవా
నరసేనలు చంపుకొనెను
రక్తపుటేరులు పారెను
రణము భయంకరమాయెను

రాముడు గంధర్వాస్త్రము
ప్రయోగించి లంకేశుని
మూలబలమునంత మూడు
ముప్పాతిక ఘడియలలో
నాశనమొనరించె దవా
నలమడవిని గాల్చినట్లు

అపుడు దేవగంధర్వ మ
హర్షాదులు హర్షమొంది
రఘువీరుని శస్త్రాస్త్ర
ప్రయోగకౌశలము బొగడిరి

విస్మితులై చెంతనున్న
విభీషణ సుగ్రీవాదుల
గని "క్షణమున మహాసేన
లను త్రుంచుట మాయకాదు

ఈఅద్భుతశక్తి నాకు
నీశ్వరునకు మాత్రమె కల"
దని పలికెను రాము డతని
అస్త్రవిద్య బొగడ తరమె?

## రాక్షసస్త్రీలు విలపించుట

మూలబలము రామబాణ
ములకు కూలిపోవుట విని
లంకాపురిలోగల స్త్రీ
లందరు గొల్లున ఏడ్చిరి

తనమోహాగ్నికి లంకా
జనములనాహుతి జేసెను
ప్రభువైతన ప్రజలను స్వా
ర్థానికి బలిగావించెను

భర్తలకై తనయులకై
బంధుజనులకై రొమ్ములు
బాదుకొనుచు నొండొరులను
బట్టుక బిగ్గర యేడ్చిరి

పండినతలతో ముదతలు
వడ్డమొగముతో రాముని
ప్రేమించిన చుప్పనాతి
పీడదెంత తెచ్చిపెట్టె!

ముసలిముండ దీనిమూల
మునసే రావణుడు సీత
నపహరించుకొని తెచ్చెను
ఆపదకొని తెచ్చికొనెను

ఖరవిరాధకబంధాది
కర్కశరాక్షసులజంపి
వాలిని బలశాలినొకే
బాణముతో నేలగూల్చె

రుద్రుడొ విష్ణువొ దేవేం
ద్రుడొ లేదా యముడే యిట
రాముని రూపమున వచ్చి
రాక్షసులను జంపుచుండె

ఈనిదర్శనాలు చూచి
యెరుగడు రావణుడొకింత
మృత్యురూపమున రాముడు
ప్రత్యక్షం బైనాడని

రావణుతో పితామహుడు
దేవదానవాదులచే
మరణముండదనెనుకాని
నరులచేత కాదుకదా!

కావున రావణునకు రా
క్షసులకు ప్రాణాంతకమగు
నాశము సంప్రాప్తమయ్యె
నరునిచేత ఇదితథ్యము

మును దేవతలెల్లరు రా
వణుపీడ సహించలేక
హరుని వేడ వీనినాశ
నార్థము సృజియింతుస్త్రీని
అనిపలికెను అదియే ఈ
జనకజయైయుండుననుచు

ఈరావణుమూలముునను
ఇట్టిఉపద్రవము మనకు
దాపురించెనని గొల్లున
దనుజ స్త్రీ లేడ్చినారు

అడవిని కార్చిచ్చునడుమ
ఆడేన్గులు చిక్కికొన్న
మాడ్కిమహాభయమునుండి
మనలను రక్షించునెవడు?

ఈదుఃఖానికి కారణ
మెవడు రావణుడె కాదా!
తనకామాగ్నికి లంకా
జనతను బలిజేసెకదా!

ఎవరివలన హాని కలదొ
యెరిగి విభీషణుడు ముందె
ఆరాముని శరణుజొచ్చి
ఆపద తప్పించుకొనెను

అని దనుజస్త్రీ లెల్లరు
అంగలార్చుచొకరినొకరు

కౌగిలించుకొని బిగ్గర
గా ఏడ్చిరి లంకలోన

ఇంటింటను దనుజస్త్రీ
లేడ్పులువిని దశకంఠడు
నిట్టూరిచి కొంతవడికి
నిప్పుకొండవలెరేగెను

**రావణుడుతన ముగ్గురు**
**మంత్రులతో యుద్ధానికి వెడలుట**

పండ్లుగొరికి పెదవిగరచి
ప్రళయకాలరుద్రునివలె
కన్నులెర్రబార చెంత
నున్నవిరూపాక్ష మహా
పార్శ్వమహోదరులజూచి
పలుకులు తడబడనిట్లనె

"నా అజ్ఞగ శీఘ్రమెసే
నలతో యుద్ధానికి మీ
రందరు సిద్ధముకండని
ఆజ్ఞాపించుచుపలికెను

శీఘ్రమెనారథమును సం
సిద్ధపరిచి విల్లంబుల
గొని తెండిక చావక మిగి
లినసేనలు వెంటరండు!

రయమున సేనాధ్యక్షులు
లంకలోని యింటింటికి
పోయి రాక్షసులను యుద్ధ
మునకు రండు డనిపిలిచిరి

కూటముద్గరముల వాడి
గొడ్డండ్రను శతఘ్నులను

వివిధాయుధములగొని అరి
భీకరసేనలు వెడలెను

రథమునుగొని రథసారథి
రయమున వచ్చెను రావణు
డధిరోహించెను రథమును
అనికి వేగ తరలించెను

అతనివెంట మహోదరమ
హాపార్శ్వవిరూపాక్షులు
రథారూఢులై వెడలిరి
రాక్షససేనలతోడను

వారందరు నగరోత్తర
ద్వారముకడ చేరుకొనిరి
రామలక్ష్మణులతోపో
రాటము సాగించుకొరకు

నేడు నేనుశత్రువులను
నిహతులగావించి ఖరుని
కుంభకర్ణ ప్రహస్తు నా
కుమారునింద్రజిత్తును వ
ధించినందులకు బదులుగ
తీర్చుకొందు వారి ఋణము

అరులసంహరించి యుద్ధ
మందుననెవరెవరు తమదు
పతుల సుతుల సోదరులను
బాసిరొ వారందరకును
కన్నీళ్లను తుడిచివైతు
కడతేర్తును శత్రువులను

అనిరావణుడాగ్రహమున
ఆజిలోన ప్రళయకాల

యముడగుచు విజృంభించెను
అరిసేనల దునుమాడెను

వాని అస్త్రశస్త్రాదుల
బారిన పడిరామదండు
హతమై మిగిలిన సేనలు
ఆజినుండి పారిపోయె

## సుగ్రీవుని విజృంభణ

అప్పుడు సుగ్రీవుడు కో
పావేశముతో వేగమె
రణభూమిని దూకిపడెను
రాక్షసులను మర్దించెను

తమకుతామెవానర యూ
థాధిపతులు పెనుకొండల
పెకల్చితెచ్చి తమరేనికి
వెనుకనుండి అందించిరి

వానరసేనలు రాక్షస
సేనలపై రాలవాన
కురిపించెను పక్షులపై
కుంభవృష్టి కురిసినట్లు

రవిసూనుడు విసరినట్టి
రాలవానచే రాక్షస
సమూహాలు తలలుపగిలి
చచ్చిపడిరి నేలమీద

ప్రలయకాలవాయువు దె
బ్బకు కూలినచెట్లవోలె
రవిసూనుని వేగమునకు
రాక్షసతతి కూలిపడెను

సుగ్రీవునిచే రాక్షస
శూరసమూహము కొమ్మలు
తెగిన చెట్లమ్రోడులవలె
మొగము తప్పుకొని పోయెను

## సుగ్రీవునిచే విరూపాక్షవధ

అంత విరూపాక్షుడు ప్రల
యాంతకుడై రథమునుదిగి
ఏన్గునెక్కివచ్చి ప్లవగ
సేనల శరముల దునిమెను

కపిసేనాగ్రముననున్న
కపినాథుని సుగ్రీవుని
పై ఘోరభయంకరమగు
బాణవర్షమును కురిసెను

కినుకజెంది సుగ్రీవుడు
పెనువృక్షము పెకలించుక
వానిపెద్ద ఏన్గుముఖము
పైనగట్టిగా కొట్టెను

ఆదెబ్బకు గజము వెనుక
కరిగి నేల కొరిగి పడెను
అంత డాలుకత్తిబూని
అరిపై కసురుడు వచ్చెను

పెద్దబండ దనుజునిపై
విసరెను కపిరాజు కాని
వాడు తప్పుకొని కపివరు
వాడికత్తితో కొట్టెను

దెబ్బతిన్న సుగ్రీవుడు
బొబ్బపెట్టి పిడికిటితో
విరూపాక్షునుదుటిమీద
పిడుగుపాటువలె పొడిచెను

విరూపాక్షుడాదెబ్బకు
వివశుడయ్యె వానిముక్కు
చెవులనుండి రుధిరధార
సెలయేరై ప్రవహించెను

వికృతాక్షుడు వానికనులు
వెడలిరా మరింత వికృత
రూపుడగుచు ముక్కునోట
రుధిరము గ్రక్కుచుచచ్చెను

## సుగ్రీవునిచే మహోదర వధ

విరూపాక్షుడట్లగుటను
వినిరావణుడార్తిజెంది
చెంతనున్న మహోదరుని
చేరబిలచియిట్లనియెను

మహోదరా! మహాభుజా!
మహావీర! మహాశూర!
విపత్సమయమిపుడువచ్చె
రిపుసంహారమొనర్చుము

వీరా! నాఉప్పుదిన్న
కారణానఋణముదీర్చు
కొనుసమయమిదేవచ్చెను
దునుమాడుము శత్రువులను

నాఆశలు నీపై ను
న్నవి మహోదరా! నీవిక
శత్రువులనుచెండాడుము
జయమునాకు చేకూర్చుము

అనిరావణుడన్నమాట
కట్లేఅని మహోదరుడు
వడి రిపుసేనలపైబడె
మిడుత అగ్నిజొచ్చినట్లు

వాడిబాణములతో ఆ
వానరులను చెండాడెను
బాణపీడితులు వానర
ప్రభువు నాశ్రయించిరపుడు

సుగ్రీవుడు మహోదరుని
నిగ్రహించ నెదురేగెను
రాళ్లతోడ చెట్లతోడ
రాక్షసుపైదాడిచేసె

రాక్షసు డారాళ్లను చె
ట్లనుశరములతో గూల్చెను
ప్లవగుడంత నేలపైన
పరిఘనొకటిపొడగాంచెను

దానిని గొని సుగ్రీవుడు
దనుజు రథాశ్వములబొడిచి
కూల్చివైచె నంతవాడు
కోపముతో గద గ్రహించి

తేరునుండి క్రిందకుదిగి
పోరుకు సిద్ధంబయ్యెను
పరిఘనుచేకొని వానర
పతియుసిద్ధమైయుండెను

మహోదరుడు గదవిసరెను
మర్కటపతి పరిఘవిసరె
అవిరెండును కొట్టుకొనుచు
భువిపైబడెముక్కలగుచు

పరస్పరము వారిరువురు
బాహుయుద్ధమొనరించిరి
వారిరువురు ఆబోతుల
వలెపోరాడుచునుండిరి

నేలమీద సమీపాన
డాలుకత్తిపడియుండుట
గని దనుజుడు వాటిని చే
గొనె నంతట సుగ్రీవుడు

వేరొకడాలును కత్తిని
వేవేగమెచేకొని సం
సిద్ధమయ్యె వారిరువురి
యుద్ధముసాగుచునుండగ

దనుజుడు తనకత్తినిగురి
తప్పిప్లవగు చేతిలోని
డాలున గొట్టగఅది ఆ
డాలునందునిరికికొనెను

కత్తినూడలాగునపుడు
కపినాథుడు దనుజునితల
తెగనరికెను నిశాచరులు
మొగముదించుకొని పారిరి

## అంగదుచే మహాపార్శ్వవధ

కపినాథుడు మహోదరుని
కడతేర్చుట చూచిమహా
పార్శ్వుడుగ్రుడై శరముల
వానరులను పీడించెను

వాలిపుత్రుడాగ్రహించి
పరిఘనుగొని మహాపార్శ్వు

పై విసరెను వాడా దె
బ్బకుసారథితో మూర్ఛిలె

కొంత తఱికి తెప్పరిల్లి
కోపముతో దైతేయుడు
శరపరంపరలతో వా
నరుల మిగల బాధించెను

కోపముతో వాలిసుతుడు
గుదియనుగొని త్రిప్పిత్రిప్పి
విసరివేయవాని విల్లు
విరిగిపడెను నేలమీద

వెనువెంటనె వాలిసుతుడు
వేగ వాని మీదికురికి
కర్ణమూలమదరవాని
కణతపగులునటు చరచెను

క్రుద్ధుడగుచు వాడుగంద్ర
గొడ్డలి నంగదుపైబడ
వైచెనంత ఆవేటును
వాలిసుతుడు తప్పుకొనెను

క్షణమాగక కపివీరుడు
దనుజునిపైదూకి పడెను
పిడికిటితో వానిరొమ్ము
పిడుగుపోటువలె గ్రుద్దెను

పిడికిటి పోటునకువాడు
బొడబొడరక్తము గ్రక్కుచు
నేలకొరిగి మృతిజెందెను
నిశాచరులు పరువెత్తిరి

సింహగర్జనలతో కపి
సేనలు చేలరేగెను రా
క్షసుల రోదనలతో లం
కానగరము కంపిల్లెను

**రామరావణయుద్ధారంభం**

తనతో యుద్ధానికి వ
చ్చినయోధులు మువ్వురు చ
చ్చుటచే రావణుని మనసు
కటకటపడి రోషించెను

నేనొక్కడనే వైరుల
నిహతులగావించివైచి
రణమున చచ్చినవీరుల
ఋణముదీర్చుకొందునిపుడె

రథము శీఘ్రముగదోలుము
రఘుసోదరులున్నచోటి
కని సారథికనె రావణు
డతడట్లేయొనరించెను

దనుజేంద్రుడు తామసాస్త్ర
మును వేసెను దానికి వా
నరులందరు దగ్ధమగుచు
నలుదిక్కుల పరువెత్తిరి

వానరులట్లుగుటను రా
వణుడును తమపైకివచ్చు
టనుగని రాముడు నారిని
ఖణిల్లనుచు సారించెను

ఆనారిధ్వని కసురులు
అదిరిపడిరి, శలభమగ్ని
జొరినభంగి రఘురాముని
దరికివచ్చె దశకంఠుడు

తానె ముందు రావణుతో
తలపడగానెంచి లక్ష్మ
ణుడు వేసెను రావణుపై
వడివడి నిశితాస్త్రములను

ఆబాణములను రావణు
డవలీలగ త్రుంచివైచి
సౌమిత్రిని దాటుకొనుచు
రాముని మీదికి బోయెను

రామునిపై శరవర్షము
లంకేశుడు కురిపించెను
వాటి త్రుంచివైచె భల్ల
బాణమ్ములతో రాముడు

పరాజయమ్మెరుగని వా
రిరువురు ఒండొరుల బాణ
ములను నిలువరించుచు బహు
ముఖములతల పడిపోరిరి

వారిరువురి నడుమ పోరు
ప్రళయభయంకరమయ్యెను
ఆకాశము వారిరువురి
అస్త్రాలమయంబయ్యెను

తనఅస్త్రములన్నియు వ్య
ర్థంబగుటను జూచి రావ
ణుడు పదిబాణాలువేసి
నొప్పించెను రఘురాముని

అంతరాముడాగ్రహించి
ఆ అసురేంద్రుని అవయవ
ములనంతటపెక్కుబాణ
ములునాటగ బాధించెను

## లక్ష్మణ రావణ యుద్ధం

రథమున నుండుటచే గద
రావణుడింతగ కాల్నడ
నున్నఅన్నతో తలపడు
చుండెననుచు లక్ష్మణుండు

వాని కేతనమ్మునొక్క
బాణముచే దొరలజేసె
వేరొకబాణమున త్రుంచి
వేసె వాని సారథితల

వెనువెంటనె దిగ్గజకర
మును బోలినవానిధృఢ
మ్మగువింటిని తుంటలుగా
తెగచెను శరపంచకమున

అప్పుడు రావణునిఉత్త
మాశ్వములను విభీషణుడు
దిట్టతనమ్మున గదతో
కొట్టికొట్టి చంపివైచె

తన రథాశ్వముల జంపిన
తమ్ముడగు విభీషణుపై
ప్రబలకోపమున శక్తిని
ప్రయోగించె. తత్క్షణమున

సౌమిత్రి విభీషణు నా
శక్తి చేరు లోపలనే
శరత్రయము ప్రయోగించి
ఫరగున ఛేదించెదాని

అంతట లంకేశుడు వ
జ్రాయుధమును బోలు మహా

శక్తిని చేబూని విభీ
షణుని మీదవేయనుండ

**రావణుడుగంటలశక్తిచే లక్ష్మణుని మూర్ఛిల్లచేయుట**

లక్ష్మణుడా విభీషణుని
రక్షించుటకై శక్తిని
కరమూనిన రావణుపై
శరవర్షము కురిపించెను

లక్ష్మణు డట్లు విభీషణు
రక్షించుటచూచి రావ
ణుడు లక్ష్మణు వైపుతిరిగి
దుడుకుగ నిట్లని పలికెను

మిడిసి పడుచు విభీషణుని
విడిపించితివిక వానిని
విడిచిపెట్టి నీమీదను
విడిచెద నీశక్తినిపుడు

నీగుండెలు చీల్చివైచి
నీప్రాణములను తీయును
కాచుకొమ్ముమిదిగో అని
గంటలశక్తిని విడిచెను

వజ్రాయుధమట్లుశక్తి
వడిగాలక్ష్మణు మీదికి
వచ్చుచుండగని రాముడు
స్వస్తి లక్ష్మణున కనియెను

మహాసర్పరాజుమట్లు
మహాశక్తి లక్ష్మణు వ
క్షమున చీల్చుకొనిదిగ ల
క్ష్మణుడు నేలపైనబడెను

లక్ష్మణు దుర్దవస్థను గని
రాముడు దుఃఖితుడయ్యెను
గుండెద్రవించెను కన్నుల
నిండుకొనెను బాష్పజలము

కొంత తడవు కర్తవ్యము
గూర్చితలంచిన వాడై
ప్రలయకాలరుద్రుడివలె
ప్రచండుడైజృంభించెను

గాయపడిన తమ్ముని ఒక
కంటగనుచు రావణుతో
చేయుచుండె సంగ్రామము
శ్రీరాముడు రణధీరుడు

తమ్ముని రొమ్మున దూసుక
ధరణిలోన నాటుకొన్న
రావణు శక్తిని బయటికి
లాగి విరచి పారవైచె

అట్లు రాముడన్యకార్య
మందుండగ సమయమిదే
యని రావణు డాయనపై
అస్త్రములను గుప్పించెను

మొదటియుద్ధమందు అలసి
పోయినాడటంచు రాము
డసురుని కొట్టక వదలెను
ఆసంగతి వాడెరుగును

ధర్మమ్మును పాటించుట
ధర్మపరులకే తెలియును
అధర్మమును పాటించుట
అధర్మపరులకె తెలియును

దనుజుని బాణాలు లెక్క
గొనక రాము దనుజు లక్ష్మ
ణుని గట్టిగ కౌగిలించు
కొని సుగ్రీవాదుల కనె

**మూర్ఛితుడైన లక్ష్మణుని కపులకప్ప గించి రాముడు రావణుతో పోరుట**

కపులారా! మీరీల
క్ష్మణుని గాచుచుండవలయు
నేనిపుడే పాపకర్మ
నీచరాక్షసుని చంపుదు

రావణుడో రాముడో కా
కీవసుమతి నిద్దరుంట
మిథ్య అగును తేల్చివైతు
మీరు చూచుచుండుడనుచు

వీరవిక్రమముతో రఘు
వీరుడుజ్రృంభించి దనుజ
విభునిమీద శరవర్షము
విరతిలేక కురిపించెను

వారిరువురు యమరుద్రుల
పగిది బయంకరశరములు
విడుచుచు పోరుచునుండగ
జడిసె సకలభూతమ్ములు

**రావణుడుపరాజితుడగుట**

అసురేంద్రునమోఘమైన
అస్త్రశస్త్రములు రాముని
అస్త్రపరంపరధాటిని
ఆగలేక వ్యర్థమయ్యె

తనువంతయు తూట్లుపడగ
దశకంఠుడు రణభూమిని
రామునెదుట నిలవలేక
లంకకు పరుగెత్తి నాడు

## మూర్ఛిల్లిన తమ్ముని చూచి రాముడు దుఃఖించుట

రాముడపుడు సౌమిత్రని
సమీపించి శోకముతో
గళమున గద్గదమదరగ
పలికెనిట్లు సుషేణుతో

సుషేణాఢ్య! నాతమ్ముని
చూచితివా నెత్తురులో
తడిసియెట్లు నేలమీద
దైన్యస్థితి పడి నాడో!

వీడు రాజ్యభోగాలను
విడి నాతో వచ్చినాడు
నేను వీనితో పరలో
కానికిపుడె పోగలాడ.

ప్రపంచమున నెక్కడైన
భార్యలు ప్రాప్తించగలరు
బంధువులును నెక్కడైన
ప్రాప్తము కాగలరు కాని

(తోడబుట్టి నట్టి వాడు
దొరుక గలడ ఎక్కడైన)
భ్రాత సహోదరు డెచ్చట
ప్రాప్తించును సుషేణాఖ్య!

నా బహి ప్రాణమైన
నాతమ్ముడు నాముందే
ఇట్లగుటను నాశౌర్యము
ఎంత సిగ్గుపడుచున్నది.

తమ్ముడు దురమున హతుడై
దుమ్ములోన పడియుండగ
ఈ యుద్ధము నాకేటికి?
ఇంక నాకు సీతేటికి?

రాజ్యముతో కానీ నా
ప్రాణముతో కానీ ఈ
యుద్ధముతో కాని ఏ ప్ర
యోజనమున్నది నాకిక?

అనినిట్టూర్చుచు పొగులుచు
కనుల నీరు నిండ శోక
మున విలపించెడు రాముని
గని సుషేణు డోదార్చెను

రామ ప్రభూ! ఇటుచూడుము
ఏమిటి నీ వైక్లబ్యము?
నీతమ్ముడు మృతుడుకాడు
నీవిటు దుఃఖించనేల?

అరచేతుల నరుణిమ కా
సంతైనను తగ్గలేదు
కనుల తేజ మారలేదు
కళ మోమున తొలగలేదు.

గుండె కొట్టుకొనుచున్నది
నిండాయుష్మంతుడితడు
మృతుడుకాడు మూర్ఛితుడిత
డిక దుఃఖించకు రఘువర!

## హనుమంతుడు ఓషధగిరి తెచ్చుటలక్ష్మణుడుమూర్ఛతేరుట

అని హనుమని గని సుషేణు
డనె నిట్లని ఓ హనుమా!
మరల నీవు ఓషధగిరి
కరిగి దాని దక్షిణశిఖ
రాన వెలయు నట్టి విశ
ల్యాది నాల్గు దివ్యౌషధ
ములగొని శీఘ్రమెరమ్మని
పలికెనంత హనుమంతుడు

ఓషధగిరి కేగినాడు
ఓషధులెట్టివొ తెలియక
దక్షిణశిఖరమునే గొని
తరలి వేగ వచ్చినాడు

ఆ సుషేణుడోషధులను
తీసి నలిపి వాసన చూ
పించగనే లక్ష్మణు డే
పీడలేక లేచి నిలచె

## పోరుకు ప్రోత్సహించుట

వానరులందరు హర్ష
ధ్వానమ్ములు చేసినారు
రాముడు తమ్ముని కౌగిట
ప్రేమారగ గ్రుచ్చినాడు.

సౌమిత్రీ! నాభాగ్యవ
శమ్మున నీవిట్లు యముని
బారినబడియును శీఘ్రమె
బ్రతికి వచ్చినావయ్యా!

నీవు మరణమొందినచో
జీవితమే నా కెందుకు?
సీతయేల? రావణవధ
చేసి గెలిచి యలరనేల?

నీవు బ్రతికి నావునాకు
నింకేమియు వలదనుచును
రాముడు దీనముగా మా
ట్లాడుట విని లక్ష్మణు డనె

"అన్నా! భీరుడి వలె మా
ట్లాడెదేల? బ్రతుకుటమది
కాదు శత్రువధయే ము
ఖ్యము కావున జృంభించుము.

రావణుజంపి విభీషణు
రాజుజేతునని ప్రతిజ్ఞ
చేసి యిట్లు భీరుని వలె
చెప్పదగునె మహావీర?

నే నుండని పోనీ నా
కై నీ కార్యమును నిలుప
వలదు నీ ప్రతిజ్ఞను కా
పాడు కొనుము రఘువీరా!

సూర్యుడస్తమించులోన
శూరాగ్రణి! ఈ రావణు
డంతము కావలె నని నే
నాకాంక్షించుచు నుంటిని."

అనుచు లక్ష్మణుడు రామ
న్నను నిండుగ ప్రోత్సహించె
రణోత్సాహియై రాముడు
ధనుర్బాణములు చేకొనె

ఇంతలో మరొక్కరథ
మెక్కిరావణుడు వచ్చెను
వింటి నారి మ్రోయించుచు
వెంటనె రాముడు వచ్చెను

## ఇంద్రుపనుపున మాతలి రామునకు రథముతెచ్చుట

రాక్షసపతి రథము మీద
రామవిభుడు నేల మీద
వారిద్దరి సంగ్రామము
తీరు సమము గాకుండెను.

అదిగని గంధర్వాదులు
అమరపతికి తెలిపినారు
వెంటనె మాతలి కాజ్ఞా
పించినాడు దేవేంద్రుడు.

రథసారథి మాతలి నా
రథముతోడ రామవిభుని
కడకు పోయి రావణ వధ
కై తోడ్పడ నంపితినను

ఇంద్రుని సారథి మాతలి
ఏ తెంచెను రథము తోడ
ఇంద్రుడాడినట్లు రామ
చంద్రునితో వివరించెను

రథము మీద కవచధను
ర్బాణమ్ములు మెఱుపు వంటి
శక్తియు గలవవి గ్రహించి
సమరము గావించుమనెను.

ఇనకులభూషణు డారథ
మునకు ప్రదిక్షణము చేసి
చేమోడ్చి రథారోహణ
చేసె రణోత్సాహి యగుచు

# అష్టమాశ్వాసం

## రామరావణ సంగ్రామం

రావణు డప్పుడు వేరొక
రథము నెక్కి వచ్చినాడు
రథారూడుడై వచ్చిన
రాముని గని వగచినాడు

రామరావణులకు నడుమ
రణము భయంకర మయ్యెను
కనువారల కాయుద్ధము
గగ్గురు పాటొనరించెను.

రాక్షస పతి గాంధర్వా
స్త్రమును ప్రయోగించ దాని
గాంధర్వా స్త్రము తోనే
కడతేర్చెను శ్రీరాముడు

దైవాస్త్రము దైత్యుడేయ
దైవాస్త్రముతోనే దా
శరథి దాని నివారించ
ఛండ కోపమున దైత్యుడు

కాలకూట విషసర్పము
ఖంబులు గల రాక్షసాస్త్ర
మును ప్రయోగించినాడు
మనుకులాబ్ధి సోమునిపై

రామమూర్తి గరుడాస్త్రము
ప్రయోగించి నాడప్పుడు
దాని నుండి గరుడుని రూ
పాన బాణములు వెడలెను.

అవి పాముల బాణములను
హతమార్చెను తృటిలోపల
అదిగని రావణుడుమిగుల
ఆగ్రహోగ్రదగ్రుడగుచు

అనివార్యంబగు బాణము
లను వర్షము వలె రాముని
మీదను మాతలి మీదను
మెసల నీక కురిపించెను.

అదియు గాక బాణసమూ
హమున రామ రథాశ్వముల
బాధించెను రథకేతువు
బడగొట్టెను రథమునడుమ

అదురాత్ముడొనరించిన
అసాధ్య కార్యములజూచి
దేవదానవాదు లెల్ల
దిగ్భ్రాంతిని ప్రకటించిరి

రావణరాహువె గెలుచునొ!
రామచంద్రుడే ఓడునొ!
ధర్మాధర్మాల మధ్య
తగవు తీర్చు వాడెవడో!

ధర్మమనగ దైవశక్తి
దానికతీతంబెయ్యది?
అధర్మమన అసురశక్తి
అద్దానికి గెలుపెయ్యది?

రాముడురణమందున జయ
రాముడు కాలేడేమో!
అనిపించె నొకింతసేపు
అయిన మరుక్షణములోన

తెప్పరిల్లి రఘువీరుడు
తీక్ష్ణాక్షుల వీక్షించెను
మూడులోకములు గడగడ
లాడునట్లు రూక్షించెను.

అదిగని దశకంఠుగుండె
లదరి తల్లడిలి పోయెను
గగన మందు ఖగసంఘము
కర్కశరావము నింపెను.

పుడమి వడకె కొండలు గడ
గడ లాడెను కడలి కలత
పడెను మేఘములు నురిమెను
పిడుగులు పెళపెళ రాలెను.

దానవదైత్యులు ఋషివి
ద్యాధరాది దేవతలును
వారివారి పక్షంబుల
వారిజయముకాంక్షించిరి.

అంతలోన రాక్షసపతి
అతిభీకర శూలా యుధ
మును చేకొని రామునిపై
పూన్కివిసరి వైచినాడు.

రావణుశూలము తనపై
రానుండగ రాముడింద్ర
శక్తిని గొని విసరగ రా
క్షస శూలము విరిగి పడెను

అంతటితో ఆగక రో
షావేశముతో రాముడు
రావణుతేరిని గుఱ్ఱము
లను శరములతో గొట్టెను.

నిశిత బాణములతో ఆ
నిశాచరుని వక్షమ్మును
ఛేదించెను వాని నొసలు
భేధించెను బ్రద్ధలవగ

తనువు చీల్చబడి నెత్తుట
తడిసిన వాడై పూచిన
అశోక కాంతితో శరా
హతి బాధల దురపిల్లెను.

ఓ నీచ నిశాచరుడా!
నేను లేని సమయంబున
సీతనపహరించి నప్పు
డే తెలిసెను నీ శౌర్యము.

శూరుడవా? అన్యసతీ
చోరుడవై వీరుడవా?
సిగ్గుమాలినట్టి పనిని
చేసి గర్వపడుచుంటివ?

తపోబలుడవై కుబేరు
తమ్ముడవై ఎంతటి ఘన
కార్యము సాధించినావు
ఘనకీర్తి లభించెనులే.

పరదారాపహరణ మను
పరమ నింద్య కృత్యమ్మును
చేసి శూర వీరుడనని
సిగ్గులేక తలచెదవా?

నిను నీవే శూరుడ నని
అనుకొంటివి దొంగవోలె
సీత నపహరించితివే
సిగ్గులేద అట్లనుకొన?

నాయెదుటనె నీవు సీత
నట్లు బలాత్కారముగా
గొని పోయత్నించియున్న
నిను యమపురి కంపియుందు.

నాభాగ్యవశాన నీవు
నాకంటను బడితివిపుడె
తప్పు కొనగలేవు నిన్ను
దండధరుని కర్పింతును.

అని ప్రహస్య పరుషోక్తుల
నీనుచు రావణునిపైశర
పరంపరలు కురిపించెను
భంగపడెనునిశాచరుడు.

కాంతి మాసి కలత జెంది
ఖలుడు రావణుడు భీతిలి
విల్లు నెక్కుపెట్టలేక
డిల్లపోయి వివశుడయ్యె

గరళము గ్రక్కెడు ఉరగము
గరుడునితో పోరగలద?
ఘీంకరించు మత్తేభము
కేసరి నెదురించగలద?

రావణుస్థితి జూచి వాని
రథసారథి రథము నపుడు
దురమునుండి తప్పించుక
ధూరముగా గొనిపోయెను.

కొంత ఘడికి తెప్పరిల్లి
కోపముతో దశకంఠుడు
ఏరా! రణభూమి నుండి
తేరునేల తెచ్చితిటకు?

రణభూమిని వెన్నుచూపె
నని నాకప కీర్తి తెచ్చి
తిట్లు చేయుటకు రిపుచే
ఎట్టి లంచమును గొంటివి?

అని నిందా రోపరణ చే
సెను సారథిపై రావణు
డవివేకముతో వివేకి
యైనవాని దూషించుచు

పచ్చకామెరుల రోగికి
ప్రతిది పచ్చగా నగుపడు
మంచి చేయువానిని నయ
వంచకుడను కుమతి యెపుడు

అపుడా సారథి యిట్లనె
అధిపా! నామాట వినుడు!
తేరెందుకు మరల్చితినో.
కారణమును వివరింతును.

భండనమున మీరప్పుడు
బడలియుండుటను గంటిని
కదనోత్సాహము మీలో
కనపడ కుండుట గంటిని

గవితతి జడివానకు ది
గ్భ్రమ గొనినటు రథాశ్వములు
అలసిసొలసి డిల్లపోయి
కలవళ పడినటు గంటిని.

చెడునిమిత్తములు మన క
ప్పుడు గోచరమగుచుండెను.
ఇత్యాదులచే మీహిత
మెంచి యిట్లుచేసినాడ.

అని పలికిన సారథివా
క్యమున కలరి దశకంఠుడు
సుందర హస్తాభరణము
సూతునుకు బహూకరించె

రావణాజ్ఞతో సారథి
రథమును రణరంగానికి
తోలినాడు రాము నెదుట
దురముసేయ నిలిపినాడు.

ధర్మహానిచేయు నట్టి
దశకంఠుని కెట్లు జయము
సిద్ధించు? నధర్మమునకు
సిద్ధించు నదెట్లు జయము?

## ఆదిత్య హృదయం

అపుడు యుద్ధమును చూచుట
కై సురలను గూడి మహా
మునిఅగస్త్యుడటకు వచ్చి
ఇనవంశజుతో నిట్లనె-

"ఇనకుల భూషణరామా!
ఏనునీకు శత్రునాశ
నార్థము ఆదిత్యహృదయ
మను మంత్రము చెప్పెద విను

ఇది ముమ్మారు పఠించిన
నాదవు నీకు జయము శుభము
అక్షయ ఫలసిద్ధి కలుగు
ఆపై సిద్ధించు జయము.

అనుచును "ఆదిత్యహృదయ"
మను మంత్రము నుపదేశిం
చెను దాశరథికి అగస్త్య
ముని ముఖ్యుడు కూర్మి మిగుల

రావణు సంహరణార్థము
రాముడు ముమ్మారు పఠిం
చెను భక్తిని ఆమంత్రము
రణారంభమునకు ముందు-

ఈమంత్రము ప్రక్షిప్తం
బేమోయని తలచిన, తన
వంశమూలపురుషుడైన
అంశుని అనివిజయార్థము
సంస్మరించి యుండు రామ
చంద్రుడు నిస్సంశయముగ

దైవబలంబది మర్త్యున
కవశ్యమనియెంచి అగ
స్త్యుడురాముని కాదిత్య
స్తోత్రమును పదేశించెను?

## ఆదిత్య హృదయ స్తోత్రం

హరిః ఓం



తతో యుద్ధపరిశ్రాంతం సమరే చింతయా స్థితమ్,
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్.

దైవతైశ్చ సమాగమ్య ద్రష్టు మభ్యాగతో రణమ్,
ఉపాగమ్యాబ్రవీద్రామం అగస్త్యో భగవాన్ ఋషిః

రామ! రామ! మహాబాహో! శృణు గుహ్యం సనాతనమ్,
యేన సర్వా నరీన్ వత్స! సమరే విజయిష్యసి.

ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రు వినాశనమ్,
జయావహం జపే న్నిత్యం అక్షయ్యం పరమం శివమ్.

సర్వమంగళ మాంగల్యం సర్వపాపప్రణాశనమ్,
చింతాశోక ప్రశమనం ఆయుర్వర్ధన ముత్తమమ్.

రశ్మిమంతం సముద్యంతం దేవాసుర సమస్కృతమ్,
పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్.

సర్వ దేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః,
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః.

ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివః స్కందః ప్రజాపతిః,
మహేంద్రో ధనదః కాలో యమః సోమో హ్యపాంపతిః.

పితరో వసవః సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః,
వాయు ర్వహ్నిః ప్రజాఃప్రాణాః ఋతుకర్తా ప్రభాకరః.

ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్,
సువర్ణసదృశో భానుః స్వర్ణరేతా దివాకరః.

హరిదశ్వః సహస్రార్చిః సప్తసప్తిః మరీచిమాన్,
తిమిరోన్మథనః శంభు స్త్వష్టా మార్తాండకో$^2$ంశుమాన్.

హిరణ్యగర్భః శిశిర స్తపనో భాస్కరో రవిః,
అగ్నిగర్భో$^2$దితేః పుత్రః శంఖః శిశిరనాశనః.

వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజుస్సామ పారగః,
ఘనవృష్టి రపాంమిత్రో వింధ్యవీథీ ప్లవంగమః.

ఆతపీ మండలీ మృత్యుః పింగళః సర్వతాపనః,
క(ర)వి ర్విశ్వో మహాతేజా రక్తః సర్వభవోద్భవః.

నక్షత్ర గ్రహ తారాణా మధిపో విశ్వభావనః,
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్! నమో స్తుతే.

నమః పూర్వాయ గిరియే పశ్చిమాయాద్రయే నమః,
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః.

జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః,
నమో నమ స్సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః.

నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః,
నమః పద్మప్రబోధాయ మార్తాండాయ నమో నమః.

బ్రహ్మేశా నాచ్యుతేశాయ సూర్యా యాదిత్యవర్చసే,
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపు షే నమః.

తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మ నే,
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః.

తప్తచామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే,
సమస్తమో$^2$భినిఘ్నాయ రవయే లోకసాక్షిణే.

నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః,
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః.

ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః,
ఏష ఏవాగ్నిహోత్రం చ ఫలం చై వాగ్నిహోత్రిణామ్.

వేదాశ్చ క్రతవశ్చైవ క్రతునాం ఫలమేవ చ,
యాని కృత్యాని లోకేషు సర్వ ఏష రవిః ప్రభుః.

ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషు చ,
కీర్తయన్ పురుషః కశ్చి న్నావసీదతి రాఘవ!

పూజయ స్వైన మేకాగ్రో దేవదేవం జగత్పతిమ్,
ఏతత్ త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి.

అస్మిన్ క్షణే మహాబాహో! రావణం త్వం వధిష్యసి,
ఏవ ముక్త్వా తతో$^2$గస్త్యో జగామ చ యథాగతమ్.

ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకో భవత్తదా,
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్.

ఆదిత్యం ప్రేక్ష్యం జప్త్వేదం పరం హర్ష మవాప్తవాన్,
త్రిరాచమ్య శుచి ర్భూత్వా ధను రాదాయ వీర్యవాన్.

రావణం ప్రేక్ష్య హృష్టాత్మా జయార్థం సముపాగమత్,
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతో$^2$భవత్

అథ రవి రవద న్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః,
నిశిచరపతి సంక్షయం విదిత్వా
సురగణ మధ్యగతో వచ స్త్వరేతి.

ఓం తత్ సత్.

## రావణసంహారం

అపు డనేక అవశకునా
లగుపించెను రావణునకు
అన్నియుశుభశకునమ్ములె
అగుపించెను రాఘవునకు

తన అవశకునాలను గని
తనకుచావు తప్పదనుచు
తెలిసి గూడ దశకంఠుడు
తెగిచి పోరగా సాగెను

అన్నితనకు శుభశకునము
లగుపించుటచే రాముడు
అమితోత్సాహమును గలిగి
అని లోన విజృంభించెను

కినుకబూని రామునిధ్వజ
మును గూల్చగ దశకంఠుడు
ఎన్ని బాణములు వేసిన
అన్నివ్యర్థమై పోయెను

అపుడు రామచంద్రమూర్తి
అల్లెత్రాడు లాగి ఒక్క
బాణమేయ అది రావణు
ధ్వజమును తెగనేలరాల్చె

రామరావణులు పరస్ప
రము బాణములను వేయుచు
ఒకరినొకరు వధియించగ
ఒడుపులతో పోరాడిరి

రథములపై వారిద్దరు
రణకౌశలమును జూపుచు
సరి ఉజ్జీలుగ సమరము
సాగించిరి భీకరముగ

ఇరుసేనలు ఆయుధాల
ధరించి తల పడియును తమ
నేతల పోరాటము గని
నిశ్చలులై నిలుచుండిరి

రావణు రాక్షసనేనలు
రాముని వానరసేనలు
కనులార్పక కనుచు వారు
కనుపించిరి చిత్రములటు

రామరావణుల యుద్ధము
భీమంబై గగుర్పాటు
కలుగజేయునంతభయం
కరముగ జరుగుచునుండెను

ముసలగదాపరిఘాయుధ
ములమ్రోతలచేత శరా
పుంఖపాతముల చే అం
బుధులు క్షుభితమగుచుండెను

అపుడు దేవగంధర్వమ
హర్షాదులు రామ రావ
ణుల సంగ్రామముచూచుచు
పలికిరిట్లు చకితులగుచు

గగనానికి గగనమె సరి
కడలికి కడలియె సమంబు
రామరావణాలమునకు
రామరావణాలమె సరి

క్రుద్ధు డగుచు రఘురాముడు
క్షురబాణము వింటదొడిగి
లంకేశుని జ్వలితకుండ
లముల శిరము తెగవేసెను

నేల మీద అపుడా తల
రాలిపడగనే ఆతల
వంటిదె వేరొక తల రా
వణునకు వెంటనె మొలచెను

మొలచిన ఆరెండవ శిర
మును రాముడు శీఘ్రముగా
ఖండించెను వెను వెంటనె
కనపడె వేరొక శిరస్సు

దానిగూడ వజ్రసదృశ
బాణము చే ఖండించెను
ఈ విధముగ ఒకటి పిదప
ఇంకొక్కటి మొలచిన శత
శిరముల రాముడు ఖండిం
చెను కాని వృథాప్రయాస!

రావణాసురుని ప్రాణము
పోవునట్లు కవిపించదు
ఖరవిరాధులను చంపిన
శరములకిపుడే మయ్యెను.

అని చింతా పరుడైనను
అప్రమత్తుడై రావణు
యురము పైన రఘురాముడు
శరవర్షము కురిపించెను.

అంత రావణుడు కుపితుం
డై రఘురాముని మీదను

ముసల గదా వర్షంబును
మెసలనీక కురిపించెను.

అయిరువురి సంగ్రామము
రేయి బవళ్లును జరిగెను
రాత్రి కాని పవలు కాని
రామరావణుల సమరము
నందు విరామం బొక క్షణ
మైన కలుగ కున్న దహో!

ఆ భీకరసంగ్రామము
నందు రామునకు విజయము
కలుగ కుండుటను గని మా
తలి రామునితో పలికెను

ఓ రామ ప్రభు! నీ విటు
వైరి బాణములకు ప్రతిగ
బాణములను వేసెదు రా
వణుడు హతమ్మగుటెప్పుడు

పౌలస్త్యుని చంపుటకై
బ్రహ్మాస్త్రము తప్ప వేరు
అస్త్రాలేమియు వానిని
హతమార్చగ లేవువినుము.

నీవిక బ్రహ్మాస్త్రము సం
ధించి విడువు మంతవాడు
చచ్చుట తప్పదు బ్రహ్మా
స్త్రముతో వాని వధించుము

అని మాతలి పలికినంత
మను వంశీకుడు రాముడు
బ్రహ్మాస్త్రము వదలెను అది
ప్రళయ భీకరముగ వచ్చి

రావణు గుండెల దూసుక
ప్రాణముల హరించి తిరిగి
శ్రీరాముని తూణీరము
చేరుకొనెను అణకువతో

## యతోధర్మస్తతో జయః

రామరావణుల సమరము
నేమందును రసప్రియా!
ధర్మహాని చేయు వాని
తలనరుకుట తథ్యమయా!

ధర్మానికి విజయమని అ
ధర్మానికి నాశనమని
గొంతు లెత్తి యుగయుగాలు
ఘూర్ణిల చెప్పిన సత్యము.

ఆనాటికి ఈ నాటికి
నానాటికి నిత్యమనీ
జగజగాలు మార్మ్రోగగ
చాటుచు చెప్పిన సత్యము

ఈ సత్యము తరతరాలు
ఎంతగ ఘోషించి నా
కుమతికి అది వినపడునా
కుక్కతోక చక్కపడున?

కులమెంతటి గొప్పదైన
గుణహీనుండై యుండిన
పౌలస్తుండై రావణు
వలె నశించి పోకుండునే?

"అధర్మస్య నాశోస్తు!
ధర్మస్య విజయోస్తు"

అను నానుడి నానాటికి
వినిపించును తథాస్తు!

కామ మోహ మౌఢ్యాహం
కారాలకు లోనగుటను
బంధుమిత్ర సమేతముగ
వధ్యుడయ్యె లంకేశుడు.

పరదారను చెఱబట్టిన
పాపాత్ముడు నశియించెను
వానిని బలపరిచి నట్టి
వారెల్లరు నశియించిరి.

దుర్మార్గుడు నశియించుట
సన్మార్గుడు గెలుపొందుట
నానాటికి చాటిచెప్పు
నగ్నసత్యమిదేనయా!

ధర్మానికి విజయమని -అ
ధర్మానికి నాశనమనీ
నానుడిని నదించునయా
నానానుడును రసిప్రియా!

## రావణ మరణం సర్వలోక పర్వదినం

పరమ దూర్త రావణుడటు
మరణించగనే సమస్త
భూతంబులు దిగులుమాని
మోదాంబుధి దేలియాడె.

దిశలు తేటగానయ్యెను
దివిజదుందుభులు మ్రోగెను
పూలవానలే కురిసెను
గాలి హాయిగా వీచెను.

నింగి విమలమై యొప్పెను
నేలవణకుటను మానెను
అర్కుడు బెదరక మెరిసెను
అంబుదు డదరక కురిసెను.

ఆడవారు నిర్భయముగ
అడవినైన అర్ధరాత్రి
యందైనను స్వేచ్ఛగ దిరు
గాడగల్గి నారప్పుడు.

రావణ సంహారముచే
దేవతలే కాదు సకల
మానవులును ప్రాణమాన
హానిలేక మనగలిగిరి

సుర లింద్రుని చుట్టుకొన్న
కరణి లక్ష్మణునితో సు
గ్రీవ విభీషణులెల్లరు
శ్రీరాముని చుట్టు కొనిరి.

వారనేక విధముల కై
వారంబులు గావించుచు
శ్రీరాముని చుట్టు జేరి
సింహనాదములు చేసిరి

చావక మిగిలిన రాక్షస
జాలము భయవిహ్వాలలై
దిక్కుమాలి లంకవైపు
పిక్కబలము చూపించిరి.

**విభీషణ విలాపం**

అన్న కళేబరము చూచి
ఆర్తిజెంది విభీషణుడు
"విన్నావా! నామాటను
అన్నా"! అని విలపించెను.

**రావణ రాణుల విలాపం**

అంతః పుర రాణులంద
రతని శవము కౌగిలించు
కొని గుండెలు బాదుకొనుచు
గోలుగోలు నేడ్చినారు.

**మండోదరి విలాపం**

పట్టమహిషిమండోదరి
పట్టరాని దుఃఖముతో
భర్త కళేబరము మీద
బడి బిగ్గరగా నేడ్చెను.

**రావణునకంత్యక్రియలు**

రాణులనోదార్చి పంపి
రావణునకు నంత్యక్రియ
లాచరించు విభీషణా!
అని పలికెను రామవిభుడు.

అంతఃపుర రాణులనో
దార్చి పంపి విభీషణుడు
అగ్రజునకు శాస్త్ర విధిగ
అంత్యక్రియలాచరించె.

**విభీషణ పట్టాభిషేకం**

అనంతరము రాముడు ల
క్ష్మణు తో నిట్లని పలికెను
అనుజా! నీవిపుడు విభీ
షణు రాజును జేయవలయు.

నేను పురము ప్రవేశించ
నియమవిరుద్ధముగావున
లక్ష్మణ! నీవిపుడే ఈ

లంక కేగి విభీషణుని
లంకకు పట్టమ్ముగట్టి
రావలయును శ్రీఘ్రముగా.

అని రాముడు పలికినంత
అట్లేయని లక్ష్మణుడు వి
భీషణు లంకకు రాజ్యా
భిషిక్తునిగ నొనరించెను.

**రాముడు సీతకు తన విజయవార్త**
**తెలుపుటకు హనుమంతుని పంపుట**

ఆపిమ్మట రాముడు పవ
నాత్మజు గని ఇట్లని యెను-

పవనసుతా! విభీషణ
ప్రభువుల ననుమతి గైకొని
లంక కేగి సీతకు నే
రావణు వధియించితినని
చెప్పి ఆమె సందేశము
శ్రీఘ్రమెగొని మరలిరమ్ము.

అని అనగనె హనుమంతుడు
అశోకవనమునకు వెళ్లి
సీతకు రామునిమాటలు
చెప్పి ఆమెనలరించెను.

అమ్మా నిను పీడించిన
అసురాంగనలను చంపెద
ననుమతిమ్ము మని అడిగిన
హనుమ కామె యిట్లనియెను.

"వారు నిరపరాధులు తమ
ప్రభుసేవా పరాయణలు
చంపవలదు వారిని" అని
జనకజ హనుమకు చెప్పెను.

"అమ్మా! మీరేమని రా
మయ్యతోడ చెప్ప మందు"
రని అడిగిన హనుమన్నకు
జనకజ ఇట్లని పలికెను.

"శుభచరితా! నే రాముని
చూడ గోరుచున్నా నను"
మని పలికిన సీతమాట
విని మారుతి తిరిగి వచ్చి
సీతాసందేశ వార్త
శ్రీరామునితో చెప్పెను.

క్షణముసేపు కళ్లు మూసి
కొని ఆలోచనలో బడి
ఇనవంశుడు నిట్టూరిచి
ఇట్లనెను విభీషణుతో

"జనకనందినికి మంగళ
స్నానముచేయించి యిటకు
గొనిరమ్మ"ని అనగ విభీ
షణు డట్లే గావించెను

రాక్షసభట రక్షణతో
రామసతిని పల్లకిలో
గొనివచ్చెను విభీషణుడు
ఇనకులభూషణుచెంతకు

పల్లకిలో వచ్చు రామ
భద్రునిసతి సీతమ్మను
చూడ కుతూహలముతోడ
వేడుక పడు వానర భ
ల్లూకవరుల నెట్టగ క
ల్లోలము చెలరేగుట విని

విభీషణా! వీరి నిట్లు
వేధించెదరేల వీర
లందరు నావారె సీత
నందరు చూచుటకర్హులు

"అమ్మహిజను పల్లకి దిగి
రమ్మనుమను" అనురాముని
పలుకులు లక్ష్మణ మారుతి
ప్లవగనాథ విభీషణుల
కర్ధము కాకుండెను రా
మయ్య కెడద కలచె నెదో!

**సీతరాముని దర్శించుట**
**రాముని కఠినోక్తులు**

జనకాత్మజ విభీషణుని
వెనుకనుండి నడచివచ్చి
సిగ్గుచేత శిరమువాల్చి
శ్రీరాముని యెదుట నిలచె

కొంగుతోన ముఖము గప్పి
కొనుచు 'ఆర్యపుత్రా'! యని
గద్గద సంబోధించుచు
కన్నీరొలుకుచు ఏడ్చెను

తనయెదుటను లజ్జాభర
మున నిలిచిన సీతను గని
ఎడదమసలు కోపము రా
ముడు వెడలంగ్రక్కబలికె

"ఓశుభాంగి! ఇదిగో నే
యుద్ధములో శత్రువును జ
యించి నిన్ను పొంది వెల్ల
డించితి నాపౌరుషమును

పగతుడు నాయెడ జూపిన
పరాభవము తుడిచి వైచి
నా ప్రతిజ్ఞ తీర్చుకొంటి
నాకోపము నార్చుకొంటి

నేనులేని సమయరంబున
నీచుడు నిన్నపహరించె
అదైవిక పరాభవము
నార్చితి నాపౌరుషమున

అవనిసుతా! నాకుకల్గి
నట్టి తిరస్కారము తొల
గించుటకై రావణువధి
యించినాను కోపముతో

ఇదియంతయు నీకై నే
నే మాత్రము చేయలేదు
నామానము రక్షించుట
కై మాత్రమె చేసినాను

ఇల్లాలిని తాబుట్టిన
ఇంటను తడవుండ నిచ్చె
నేని దాని శీలము సం
దేహింపందగు నందురు

నీవు దీర్ఘకాలము పరు
నింటనున్న కారణాన
జనశంకితచారిత్రవు
వనజాక్షీ నిను వదలితి

కను కలకల వాని ముంగ
టను దీపము బాధితమగు

నటుల నీవు నాముందట
కటువై నను బాధింతువు

నీవిక యెచ్చోటి కైన
నేగుటకు ననుజ్ఞ నిడితి
దేవరు లింటైనను సు
గ్రీవ విభీషణుల యిండ్ల
నైన నుండవచ్చును వన
జాక్షీ నిను విడనాడితి

తరుణీ! నీ దివ్యమనో
హరరూపము జూచుచు రా
క్షసుడు నిన్ను చిరకాలము
సైచి ఊర కుండలేడు

కావున నీవిన్నినాళ్లు
రావణునింటను నుంటివి
ఎట్లునిన్ను స్వీకరింతు
నే సీతా చెప్పగదవె?

రోషముతో రాముడిట్లు
రూక్షించుచు పలుకుటవిని
సిగ్గుతోడ శిరము వంచి
సీత మిగుల దుఃఖించెను

## సీతసమాధానం

కన్నీళ్లను తుడుచు కొనుచు
గద్గదకంఠమున సీత
తనపతి రామునితో ఇ
ట్లని పలికెను మెలమెల్లగ

"వీరా! పామరునివోలె
వినగరాని అనగరాని
మాటలు నన్నంటివి నీ
మాటలు బాణాలమించె

నీవనుకొనునట్లు నేను
నీచురాల కానె కాను
చెడునడతలుగల కొందరి
స్త్రీలనెంచి స్త్రీజాతిని
శంకింతువు శంకవలన
సత్యహాని చేయతగునె!

హనుమంతుడశోకవనము
నందు చెట్టుమీదనుండి
నిశాచరునితోడ నాత్ర
ణీకారము విని నీతో
చెప్పలేద? ఊరక నా
శీలము శంకించెదవా!

అసురుడు నను వివశురాల
నైయుండగ బలత్కార
ముగగొని తెచ్చెను నేనై
ముచ్చట పడివచ్చితినా?

హనుమను పంపిన నాడే
అతనివెంట నీసంశయ
సందేశము పంపియున్న
చచ్చియుందునేనపుడే

హనుమనుండి ఆవార్తను
విని మీకీ యుద్ధశ్రమ
తప్పియుండుకద! ఇంతటి
తడవేటికి చేసితిరొకొ!

అసురుడు నన్నపహరించి
నపుడు వానిశరీరమును

తాకిన దోషిని నేనని
తలచి నన్ను వదలెదవా?

పరాధీనురాలనగుట
వాని తాక వలసివచ్చె
ఇందున నాదోష మేమి?
ఇది దైవికమేకాదా!

నాశీలము భగ్నమవక
నాలోనే యున్నది నా
మనస్సంత నీయందే
తొణకక బెణకకయున్నది

నాఅవయవములు మాత్రము
నావశమ్ము తప్పియుండె
వానిని విడిపించుకొనుట
నే నశక్తు రాలనైతి

కావున నేనేమిసేయ
గలదాన నశక్తురాల
నాదోషంబేమున్నది
నను విడిచెద నందువీవు

ననురక్షించెడి భారము
అనుక్షణమునీదే కద!
అసురు డపహరించునప్పు
డాక్రందన చేసినాను

అసురు డెత్తుకొనిపోయే
టపుడు మిమ్ము బిలచి బిలచి
ఆక్రందించితి విన రా
దయ్యెమీకు విధివశమున

అబలను నన్నపుడు నీవు
అదుకొనగ రావైతివి

ఇదియంతయు దైవిక మని
యెంచక నన్నిట్లందువు

ఈవు సకలశాస్త్రజ్ఞుడ
వీవు సకలలోకజ్ఞుడ
వీవు శంక కారణమున
ఈదండన విధియింతువ?

శంక బూని నాకిట్టి క
ళంకమంట గట్టెదవా
సందేహంబున దండన
శాసించుట న్యాయమగున?

అడుదానిననినన్నిటు
లనరానట్లాడినావు
అనుమానముతో నిజమును
కనజాలక నున్నాడవు

నేనుభూమినుండి పుట్టి
నాను జనకరాజేంద్రుని
పుత్రికనైయున్న నన్ను
పూన్కివిచారించకుండ

నాభక్తిని నాశీలము
నడిఏటను ముంచినావు
నాపుట్టువు నానడవడి
ఛీపెట్టుచు దూఱినావు

అల్పమానవునివలె కో
పాగ్నికి లోనై నీవిటు
నాశీలము సంశయించి
నన్నవమానించినావు

నీవు సకల శాస్త్రజ్ఞుడ
వీవు సకల ధర్మజ్ఞుడ

నీవు సర్వలోకజ్ఞుడ
నీవిట్లానరించదగున?

సందేహంబునదండన
శాసించుట తగదని శా
స్త్రమ్ములు ఘోషించుటవిని
సత్యహాని చేయుదువా?

అని గద్గద కంఠముతో
కనుల నీరు జలజలమని
రాల్చుచు లక్ష్మణుతో ఇ
ట్లని పలికెను సీతాసతి

## అగ్నిపరీక్ష

ఈ అసత్య అపవాదము
నేనిక భరియించలేను
చితి పేర్చుము నేనింకను
జీవింపగ కాంక్షించను

ఈ అవమానాగ్నికన్న
ఆ చితాగ్నియే మేలగు
అది తనువును కాల్చిచంపు
ఇది చంపకకాల్చుచుండు

ఈ అవస్థ కిదే మందు
ఇక చితిపేర్చుము లక్ష్మణ
పతి విడిచిన ఇల్లాలికి
చితియే మేలగు నాయన

నాపాతివ్రత్యమ్మును
నాపతి నిరసించుచు న
ల్గురిలో నను త్యజియించుట
ఘోరమంతకన్న అగ్ని

బడి చచ్చుట యే మేలగు
బ్రతుక నేల పతివిహీన!

జానకి మాటలు విని ల
క్ష్మణుడు అన్న మొగము జూచి
కనుసైగల నతని సమ్మ
తిని గనుగొని చితిపేర్చెను

పతికి ప్రదక్షిణము చేసి
ప్రణుతులనర్పించి దేవ
బ్రాహ్మణులకు కేలుమోడ్చి
ప్రజ్వలించు అగ్నిజేరి
చేతులు జోడించి భక్తి
సీతాసతి ఇట్లన్నది

"రామునందె నాహృదయము
లగ్నంబై యున్న యెడల
హుతాశనుడు నను దహించ
కుండ నిపుడు రక్షించుత!

నేను మనోవాక్కర్మల
చే నాపతి నతిచరించ
నట్టిదాన నేని నన్ను
అగ్నిహోత్రుడోముగాక!

సకల భూతములు నను స
చ్చారిత్రము గలదానిని
గానెంచెద రేని నన్ను
గాపాడుత హుతాశనుడు!

అమలమైన నడవడి నా
దైయుండగ చెడిపోయిన

దానిగ నను రాముడెంచె
నేని అగ్ని నను గాచుత!"

అని పలుకుచు సీతాసతి
అగ్నిహోత్రునకు ప్రద
క్షిణముచేసి నిర్భీతిగ
అనలములో ప్రవేశించె

త్రిలోకాలలో నుండెడు
దేవదానవాదు లపుడు
అగ్ని ప్రవేశించుచున్న
అవనిసుతను వీక్షించిరి

సీత అట్లు ఆజ్యాహుతి
రీతి అగ్ని బడుచుండగ
హాహాకారాలు చేయు
చాక్రోశించిరి జనములు

జనుల ట్లాక్రోశించగ
విని రాముడు దుఃఖితుడై
కనులు చెమ్మగిలగ దృష్టి
కలతనొంద చింతించెను

లోకుల అపవాదమునకు
లోలో పల కలగి సీత
కిట్టిస్థితి కలిగించితి
నేయని వగచుచు రాముడు

సీతఅగ్నిలోన ప్రవే
శించుచున్న నూర్కొండెను
చేదైనను ఔషధమును
సేవించక తప్పనట్లు

## బ్రహ్మాదులు వచ్చిసీతనిష్కళంక యనిరామునితో చెప్పట

బ్రహ్మ రుద్ర ఇంద్రాదులు
పరుగున రాముని వద్దకు
వచ్చి చేతులెత్తి యిట్లు
పలికినారు బిగ్గరగా

ఓరామా! సర్వలోక
కారణభూతుడవు నీవు
సీతయిట్లు అగ్నిప్రవే
శించఉపేక్షించెదవా!

నీవే నారాయణుడవు
ఈ వైదేహియే లక్ష్మి
రావణసంహారార్థము
నీవీభువి వచ్చినావు

నిన్నునీవు తెలిసికొనక
నీసీతను అగ్నిపరీ
క్షకు పెట్టితివా నీవొక
సామాన్యమనుష్యుడవా!

అని బ్రహ్మాదులు పలుకగ
మనుజకులశ్రేష్ఠు డిట్లు
పలికినాడు బ్రహ్మాదులు
పరవశించిపొంగపోవ-

"నేను దశరథాత్మజుడను
మానవుడను మానవ మ
ర్యాదల పాటించుటె నా
అభిమత మదె నాధర్మము

ధర్మోరక్షితి రక్షితః
తత్సూక్తిని పాటింతును

ధర్మపాలనమున జగత్
కల్యాణము సిద్ధించును

అనిరాముడు పలుకుచుండు
నంతలోన హుతాశనుడు
మనుజాకృతితో తనబడి
మహిజ నెత్తుకొని వచ్చెను

## అగ్నిదేవడు సీతనిష్కళంకయని రామున కప్పగించుట

"దాశరథీ! ఈమె నీదు
ధర్మపత్ని సీత ఈమె
యందు పాప మేమిలేదు
సందేహించకు మీమెను

రాక్షసుడీమెను యెన్నో
రాజ్యభోగముల ప్రలోభ
పెట్టినను వధించెదనని
బెదిరించిన లొంగలేదు"

అనుచు అగ్నిహోత్రుడు సీ
తమ్మను శ్రీరామవిభున
కప్పగించి నాడప్పుడు
హర్షాశ్రులతో రాముడు

"సర్వలోకసాక్షీ! ఈ
జనకాత్మజ నిష్కళంక
శీలగ నిశ్శంక విశ్వ
సించియున్నవాడనైన

ఖలురావణునింట దీర్ఘ
కాలమున్న స్త్రీని నేను
చేపట్టినచో లోకము
ఛీకొట్టక మానదనుచు

లోకములో నొకడనైన
లోకపద్ధతిని నేనిటు
పరుషముగా ప్రవర్తించ
వలసివచ్చెనని పలుకుచు

ఇప్పుడుముల్లోకంబులు
ఈమెశీలమును కీర్తిం
చును" అని సీతాదేవిని
సుస్మితుడై కౌగిలించె-

## రాముని కృతజ్ఞత-వత్సలత

ఇంద్రుడపుడు రామునితో
ఏదైనా వరము కోరు
కొనుమని అడిగిన యంతనె
ఇనకులు డిట్లని పలికెను

"నాకోసము వానర భ
ల్లూకంబులు యుద్ధమందు
మరణించిరి వారినెల్ల
మరల బ్రతుకజేయగదవె"!

అని అర్థించిన రాముని
ప్రార్థన మంగీకరించి
మరణించిన వనచరులను
సురపతి బ్రతికించినాడు

ఆరాతిరి రాముడు తన
వారలతో గడిపి ఉదయ
మేమేల్కొన విభీషణుడు
కై మోడ్చి "జయోస్తు! పలికి,

"శ్రీరామా! స్నానాదులు
చేయగ దయచేయుడు నా

సత్కారములను గొని నను
సంతృప్తుని గాజేయుడు"

అపుడురాముడిట్లనె ఓ
అసురేంద్రా! సుగ్రీవా
దులనే స్నానాదులకై
పిలువుము నాకిపుడువలదు

వనవాసము గడువు గడిచె
అనుజుడు భరతుడు నాకై
ఎదురుచూచుచుండును నే
నిపుడె బయల్వెడలవలయు

బహుదూర మయోధ్య వేగ
పయనము సాగించవలయు
వ్యవధిలేదు వేవేగమె
బయల్దేర వలయు నిపుడె

ప్రభువర! పుష్పకమున్నది
వగపేటికి ఒక్కరోజు
లో నయోధ్య జేరగలదు
దానిగూర్చిచింత వలదు

అని విభీషణుడు పుష్పక
మునుగొనితెచ్చెను అందున
నెందరు గూర్చున్నను వా
రందరకును చోటౌసగును.

వానరభల్లూక వీర
వరుల కందరకు విభీష
ణుడు మణి ధన వస్త్రాదుల
నిడి సమ్మానము చేసెను

విశ్వకర్మనిర్మితమగు
విమానమది వచ్చియుండె

సీతా లక్ష్మణుల తోడ
శ్రీరాముడు పుష్పక మధి
రోహించుచు వానర వీ
రులకును సుగ్రీవునకును
విభీషణునకును సెలవిడి
వీడుకొలుపు చెప్పుకొనెను

స్నేహితుడా! సుగ్రీవా!
నీసేనలతో కిష్కిం
ధకువెళ్లుము విభీషణా!
ధర్మపాలనముసేయుము

అనగనె సుగ్రీవ విభీ
షణులు మేముగూడ అయో
ధ్యకువత్తుము రామా మీ
అభిషేకము తిలకింతుము

మమ్ములమీతోవచ్చుట
సమ్మతించు రామా! అని
ప్రార్థించిరి రాముడు దర
హాసముతో సమ్మతించె

సీతాలక్ష్మణుల తోడ
శ్రీరాముడు పుష్పకమె
క్కెను భానుజ విభీషణులు
వనచరులును రాక్షసులును
అధిరోహించిరి పుష్పక
మపుడది రివ్వున లేచెను

అదిఅయోధ్యకభిముఖమై
ఆకసాన పయనించెను
పూలవానలే కురిసెను
గాలి హాయిగా వీచెను

# నవమాశ్వాసం

## అయోధ్యకు ప్రయాణం

పుష్పకమ ట్లంబరాన
పోవుచుండ రాముడు నలు
దిశలను పరికించుచు వై
దేహికిట్లు చెప్పదొడగె

"సీతా! చూడుము త్రికూట
శిఖరముపై వెలసిన లం
కానగరముదాని విశ్వ
కర్మ వినిర్మించినాడు

ఇలాతనయ! చూడుమిదే
ఇక్కడనే లోకహింస
కుని రాక్షసరాజు రావ
ణుని చంపితి నీకొరకై

ధరాతనయ! సాగరమును
దాటుచునున్నామిదిగో
సేతువునీకై నిర్మిం
చితిని దీనినలునిచేత

ఇదే ఇసుకతిన్నెలపై
నేనుమూడహోరాత్రులు
జలధిదాటుదీక్ష దర్భ
శయనముపై గడిపినాను

సముద్రుడిచటనె నాకు ప్ర
సన్నుడయ్యె రాక్షసపతి
విభీషణుడు నన్నుశరణు
వేడుకొన్న దిచ్చోటనె

సీతా! సుగ్రీవుని కి
ష్కింధవచ్చెనదే చూడు
వాలినొకే బాణముతో
వధియించితి నిచ్చోటనె"

"అనఘా! సుగ్రీవుని భా
ర్యలతో తక్కిన వానర
యోధుల భార్యలతోడ అ
యోధ్యవెళ్లకోర్కెగలదు!"

అనిజానకికోరినంత
అట్లే అనిరాముడనెను
పుష్పకమది కిష్కింధా
పురివెలుపల దిగిపోయెను.

వానరకాంతలు సుగ్రీ
వానతిగొని ముస్తాబయి
పుష్పకమెక్కి రయోధ్యా
పురమువెళ్లసంబరాన

పుష్పకమదిఎగిరి సాగి
పోవుచుండగా రాముడు
ఇదిగిదిగో! సీతా ఇదె
ఋష్యమూకనగము, నీవు
నగలుమూటగట్టి ఇదే
నగము మీద పడవైచితి(వి)

కపివీరుని మన హనుమను
కలిసికొన్న దిచ్చోటనె
అగ్నిసాక్షి రవిసుతు స్నే
హము చేసినదిచ్చోటనె

సుదతీ! నీవీ అడవుల
చూడగదే నేనిచటనె
నినుయెడబాసిన కారణ
మున యెంతగ విలపించితి!

ఇదిపంపానదిచూడుము
ఇటనే శబరిని గంటిని
దీర్ఘబాహువుల కబంధు
తెగటార్చితి నిచ్చోటనె

జనస్థానమదిగో! అ
చ్చట జటాయు నీకొరకై
రావణునెదిరించి పోరి
ప్రాణములర్పించెనచట

చూడుచూడుమచ్చోటనె
చుప్పనాతి భంగపడెను
ఖరదూషణత్రిశిరస్కుల
ఖండించితి నచ్చోటనె

అదేఅదే గోదావరి
అదిగో మనపర్ణశాల
అటనుండియె నినురావణు
డపహరించుకొని పోయెను.

నిన్నుచెఱబట్టుకపోయెడి
నీచరావణుని రథమ్ము
నడ్డుకొనగ రథచాలు
వడ్డదదిగొ రథపుగుట్ట!

దోపిడి నెదిరించబోయి
రాపిడి వడిగాయపడ్డ

ధరాధరము జడమ్మైనను
దూరాగతము నెదురించెను

రాపుడు గాయమ్ముకన్న
దోపుడునరికట్ట లేని
మనోబాధ తననెంతో
మసలించుచునున్నదనుచు

ఈనాటికి ఏనాటికి
నైన నీవిషాదగాథ
రథపుగుట్ట వినిపించును
రసప్రియుడు రచియించును

అల్లదిగో! అగస్త్యముని
ఆశ్రమంబు అదె సుతీ
క్ష్ణాశ్రమంబు అదె శరభం
గాశ్రమంబు తిలకించుము

అచ్చటనే మహాకాయు
డగు విరాధరాక్షసాధ
ముడు నినుగొని పోవుచుండ
వడివడివాని వధించితి.

అదిగో! అత్రిమహాముని
ఆశ్రమంబు నీవచ్చట
అనసూయా వృద్ధతప
స్వినిని భక్తిసేవించితి(వి)

సీతా! నీవటుచూడుము
చిత్రకూటమదె వచ్చెను

నను భరతుడు రాజ్యముగొను
మని ప్రార్థించినదిచటనె

అదే యమున అదే త్రిపథ
అదే గంగ అదే భర
ద్వాజాశ్రమ మంద్రుమనము
వాసముంటి మొక్కదినము.

కొంతదూర మందున మన
గుహుని శృంగబేరపురము
మరియు కొంత దూరమ్మున
మన అయోధ్యాపురమ్మ
కనిపించుచున్నదదిగొ!
కల్యాణీ! చూచితివా!

వనవాసము నుండితిరిగి
వచ్చిన వారల మగుటను
ప్రణమిల్లుదమీనగరికి
ప్రణయసఖీ! భక్తితోడ."

అని రాముడు పుష్పకము మ
హర్షి భరద్వాజాశ్రమ
మునకు సమీపాన దింపి
మునికి ప్రణుతులర్పించెను.

భరద్వాజముని ముఖ్యుడు
పరమహర్షమున రామా!
రాక్షసవధచేసి ధర్మ
రక్షణ గావించివావు

నీకొక వరమిచ్చెద నే
నిచ్చెడి అతిథ్యముగొని

రేపయోధ్యకేగు మనిన
ఋషిముఖ్యున కట్లేయని,

మహర్షి! నేనయోధ్యకేగు
మార్గములో వృక్షతతులు
ఫలవంతములై సుమధువు
లొలకించుచు నుండవలెను.

అట్లే అగుగాక అని మ
హర్షి పలుకగా అచ్చటి
వృక్షములన్నియును కల్ప
వృక్షములటు విలసిల్లెను.

తనవెంటను వచ్చునట్టి
వనచరులకు మధురాహా
రాలను సమకూర్చినాడు
రాముడెంత గుణవంతుడు

## భరతునకు ముందు వార్త

పావని తో ముందు వార్త
భరతున కంపుచు మార్గము
నందు శృంగి బేరపురము
నందు గుహుని కుశలమడి
పిదప అయోధ్యానగరికి
వెళ్లవలయు అనిరాముడు,
"హనుమా! భరతునితోనే
ననినట్లుగ చెప్ప వలయు-

వనవాసము పూర్తిచేసి
జనకజ తో లక్ష్మణు తో
క్షేమముగా వచ్చితి"నని
చెప్పవలయు నింకను విను.

తాను నన్ను కలిసికొన్న
తావు చిత్రకూటము విడి
నప్పటినుండి ఘటిల్లిన
అన్ని సంగతులు చెప్పుము

చెప్పగ వినునప్పు డతని
చిత్తమెట్లు స్పందించునొ
అతని ముఖము అతని దృష్టి
అతని మాట అతని ప్రవ
ర్తనమది యెట్లుండు తెలిసి
కొనవలయును వాయుసుతా!

ముఖము మాడ్పు వంటిచిహ్న
ములు గనిపించినచో శీ
ఘ్రమె నీవిటురావలయును
రాజ్యకాంక్ష గలవాడని.

రఘువంశజుడెవ్వడైన
రాజ్యమేలవచ్చు భరతు
డేరాజ్యము కాక్షించిన
నేనందుకు సమ్మతింతు

అట్లుగాక నను జూచుట
కై తహతహ పడుచునుండి
రాజ్యము నాకిచ్చుట కా
రాటపడుచునుండె నేని
ఇచటికి రావలదు మేమె
అచటికి రాగలము హనుమ!

పదియు నాలుగేండ్లు రాజ్య
భాగ్య మనుభవించిన వా
డిపుడు దానివదలు కొనుట
కిష్టపడడు ఇది లౌక్యము

ఇది ఉత్తమ రాజనీతి
ఇది భరతునకే పరీక్ష
అతి వ్యవధి దేశబహి
ర్గతుని ఆస్తి పరతంత్రము!

హనుమ బయవ్వెడలి అయో
ధ్యను జేరకముందు శృంగి
బేరములో గుహుని కలిసి
శ్రీరాముని రాకతెలిపె

అచటినుండి నంది గ్రామ
మరగి భరత విభుని కలిసి
సీతా లక్ష్మణులతోడ
శ్రీరాముడు వచ్చె ననుచు
దాశరధి వచించిన వృ
త్తాంత మంత వివరించెను.

## రామునిరాకవినిభరతుడు ఆనంద పరవశుడగుట

భరతుడపుడు హర్ష బాష్ప
భరితాక్షులతో హనుమను
కౌగిలించుకొని విలువగు
కానుకలిచ్చుచు నిట్లనె

జనుడు బ్రతికి యుండెనేని
శతవర్షములకు నైనను
ఆనందము పొందగలడు
అనెడు సూక్తినిజమయ్యెను.

## అయోధ్యనలంకరించుట

భరతు నాన శత్రుఘ్నుడు
స్వాగత సన్నాహంబులు
ప్రారంభించెను మంగళ
వాద్యంబులు మొదలయ్యెను.

శుచిస్నాతులై పౌరులు
శుభ్రవస్త్రముల ధరించి
కదలివచ్చినారు నంది
గ్రామానికి హర్షముతో

సుమంత్రాది అష్టమంత్రి
ప్రముఖులు సేనాధి పతులు
స్వర్ణాభర ణాలంకృత
సామజములపై వెడలిరి.

విశాలమై నట్టి రాజ
వీధులన్ని ధ్వజము లెత్తి
మంచి గంధపరిమళసుమ
మాలలతో భూషించిరి.

కౌసల్యా సమిత్రలును
కైకేయిని గూడి రథము
మీద బయల్దేరినారు
మోదసంభ్రమాలతోడ

చాతుర్వర్ణాలవారు
సహజకళాకారులు సం
స్తుతిపాఠకులును మధుర
శ్రుతిగాయకులును వచ్చిరి.

## భరత రామసమాగమం

పరివారము నంది గ్రామ
పొలిమేరను చేరుకొనెను
శిరమున నంజలిఘటించి
భరతుడు ముందున నడిచెను.

అందరెదురు చూచుచున్న
ఆ విమానమపుడు క్రింద
దిగి ఆగెను గుండెబరువు
దిగినట్లనిపించె నహహా!

విమానంబు నుండి రామ
విభుడు జానకీలక్ష్మణ
సమేతుడై దిగి వచ్చెను
జటాజూటజయరాముడు.

ఆనందాశ్రువులు రాల్చు
చగ్రజు పాదాలు కడిగి
పాదనమస్కృ తులొనర్చె
భ్రాతృభక్తుడగు భరతుడు.

కనులు చెమ్మగిల రాముడు
కౌగిలించుకొనె భరతుని
సౌభ్రాత్రత కాదర్శుడు
సకలసద్గుణుడు రాముడు.

భరతుడు సీతాదేవికి
ప్రణామాల నర్పించెను.
అనుజన్ముని లక్ష్మణు గా
ఢాలింగనమొనరించెను.

ప్రణమిల్లెను శత్రుఘ్నుడు
రామన్నకు లక్ష్మన్నకు

నమ్రత సీతమకు పాద
నమస్కృతుల నొనరించెను.

భరతుడంత సుగ్రీవుని
పరిష్వంగమొనరించుచు
అర్కజ! మానలుగురిని
ఐదవ సోదరుడ వీవు

సమయములో ఉపకారము
సలుపువాడు మిత్రుడగును
అపకారము చేయువాడె
అరియగును కదాఅనియెను.

ప్రీతి వచనములతోడ వి
భీషణుతో మా భాగ్యవ
శాన మీసహాయముచే
సాధింపంబడె కార్యము.

అనుచు నతని కౌగిలించు
కొనె భరతుడు ఆపిమ్మట
అంగదనల నీల సుషే
ణాది వానర ప్రముఖుల
నాలింగన మొనరించెను
ఆత్మీయత పొంగిపొర.

అడుగులు తడబడ రాముడు
నడచి వచ్చి ముగురమ్మల
పాదాలకు నుదురు సోక
భక్తితోడ ప్రణమిల్లెను

జానకి తన ముగురత్తల
చరణాలకు ప్రణమిల్లెను
వారి భక్తి పరిపూర్ణత
వారాశిని తలపించెను.

పురోహితుండగు వసిష్ఠ
మునిముఖ్యసుధన్వ సుమం
త్రాది ప్రముఖులకు ప్రణమిలి
ఆదరమున కుశలమడిగె.

పురజనులందరు తామర
మొగ్గలవలె ప్రణామాంజ
లులు ఘటించి రామయ్యకు
పలికిరి సుస్వాగతమ్ము.

భరతుడు మును తనకిచ్చిన
పాదుకలను తెచ్చి స్వయ
మ్ముగ రాముని పాదాలకు
మ్రొక్కితొడిగి ఇట్లనియెను.

మహారాజ! నీ రాజ్యము
మరల నీకు నప్పగించు
చున్నాడను గాన నీవ
యోధ్యకు దయచేసి నీదు
రాజ్యము నీవేలు కొనుము.
రామా! జగదభిరామా!

భరతుని సౌభ్రాత్రత గని
వనచరపతి సుగ్రీవుడు
రాక్షసపతి విభీషణుడు
చక్షులశ్రువులు గార్చిరి.

రాముడు భరతుని సౌభ్రా
త్రతకు నలరియతనిని తన
ప్రక్కన గూర్చుండ జేసి
పరివారము వెంట రాగ
విమాన మందున నంది
గ్రామానికి విచ్చేసెను.

## నందిగ్రామంలో రాముడు.

రాముడెందులకు నంది
గ్రామానికి వచ్చె అయో
ధ్యకు నేరుగ రాకూడదా?
అందుకేమి కారణమో!

రాజ్యభోగ ప్రలోభాన
రాజమాత కాదలంచి
పదునాల్గేండ్లడవిలోన
వాసముండి బ్రతికి తిరిగి
వచ్చె తాము అనుభవించు
భాగ్యమునకు చేటువచ్చె.

అని కైకేయమ్మకు మన
మున కంటక మనుపించెనొ!
అట్లుండిన తనకయోధ్య
కరుగుటెందు కనితలచెనొ!

అని ఇంగితమెరిగి భరతు
డంజలి శిరమున ఘటించి,
అన్నయ్యా! ఇప్పుడు మా
యమ్మ మనసు మారియుండె
నీరాజ్యము నీకిచ్చుట
కారాటము జెందుచుండె.

నాకిచ్చిన నీ రాజ్యము
నీకిచ్చెద గడువు తీరె
నీవిక దానిగ్రహింపుము
నిర్వహింపలేను దీని

తురగము మాదిరిగ ఖరము
పరుగులెత్త జాలనట్లు

హంసయెగురు తీరునవా
యసము యెగుర జాలనట్లు

నీవలె ఈ రాజ్యభార
మేను మోయజాల రామ!
నీవిక ఈ రాజ్యమును గ్ర
హించి యేలుకొనుము రామ!

అనుభరతుని మాటలువిని
అట్లేకానిమ్ము మనుచు
రాముడనెను భరతుడు హ
ర్షామోదమ్మున పొంగెను.

శత్రుఘ్నుడు ఆజ్ఞనిడగ
క్షౌరకళాచణులు రామ
లక్ష్మణ భరతులకు ముప్వ
రకును క్షౌరములు చేసిరి.

ఆపిమ్మట శుచిస్నాతు
లైరివారు. అపిమ్మట
సుగ్రీవ విభీషణులును
శుచిస్నాతులైనారలు

వారందరు దివ్యమైన
వస్త్రాభరణాలంకృతు
లై అయోధ్యకేగుటకై
అపుడు సిద్ధమై పోయిరి.

అపుడు దశరథేశుని భా
ర్యలు నందరుజేరి స్వయము
గా సీతాదేవి కలం
కారము లొనరగ జేసిరి.

కౌసల్యాదేవి స్వయము
గా వానర స్త్రీలకు సొ
మ్ములు చీరలు నిచ్చివారి
నలంకరించుకొనంజేసె.

## అయోధ్యకు వచ్చుట

అందరట్లు శుచిస్నాతు
లై ఆభరణాలు దాల్చి
కొనిన పిదప దివ్యరథము
కొనితెచ్చె సుమంత్రాఖ్యుడు

రామచంద్రమూర్తి దివ్య
రథమునెక్కిపయనించెను
రథమువెంట హనుమంతుడు
రవిసూనుడు పయనించిరి.

వానరనారీజనమ్ము
వైదేహిని ననుసరించి
అయోధ్యానగరిని జూడ
అపేక్షించి బయల్వెడలె

పురోహితుడు స్వస్తివాక్య
ములు పలుకగభరతుడు సా
రథిగ నుండ శ్వేతచ్ఛ
త్రము శత్రుఘ్నుడు బట్టగ

సౌమిత్రియు విభీషణుడు
చామరములు పట్టుకొనగ
వానరపతి సుగ్రీవుడు
భద్రగజము మీదవెడల
మానుషరూపము ధరించి
వానరశ్రేష్ఠులుతొమ్మిది

వేలఏన్గులెక్కిబయ
ల్వెడలిరాగ వైభవముగ

శంఖారావాలు మ్రోగ
జనులానందముతో కల
కలధ్వనులు సేయ, స్వస్తి
కముల వాద్యములు మొరయగ

మంగళ వాధ్యాలు మొరయ
మంగళాక్షతలు చేకొని
విప్రులు కన్యలు గోవులు
విపుల మీద ముందునడువ

స్వస్తి ముఖులు స్వస్తి స్వస్తి
స్వస్తి యనుచు పలుకుచుండ
జయజయమను ధ్వనులమధ్య
జయరాముడయోధ్యజేరె .

## పట్టాభిషేకం

పితృదేవుని గృహముజేరి
మాతృదేవతలు ముచ్వురి
కంజలి ఘటియించి మ్రొక్కి
అనంతరము భరతుజూచి,

అనుజా! నాఉత్తమ గృహ
మందువిడిది సుగ్రీవున
కేర్పరుచుము తదితరులకు
నేర్పరుచుము తగువసతుల

అని చెప్పగనే భరతుడు
వనచరపతి సుగ్రీవుని
చేయిపట్టుకొని రాముని
శ్రేష్ఠభవనమున దింపెను

అర్కసుతా! రేపే ప
ట్టాభిషేకమున్నది అభి
షేకజలము నదుల నుండి
శీఘ్రమె తెప్పించగలరు.

అనిభరతుడు కోరగనే
అభిషేకజలంబు తేగ
హనుమజాంబవంతాదుల
కాజ్ఞలిచ్చి పంపించెను

వృద్ధ వసిష్ఠుడు బ్రాహ్మణ
వితతిగూడి, జానకితో
రాముని గూర్చుండ జేసె
రత్నఖచిత పీఠముపై

స్వర్ణకలశములతో శత
పంచనదులనుండి జలము
గొనితెచ్చిరి వేగదర్శి
హనుమ ఋషభఋక్షవరులు

చతుస్సముద్రాల నుండి
జలమునుగొని నల సుషేణ
గవయ ఋషభ వరులు రత్న
కలశమ్ములతో తెచ్చిరి.

వసిష్ఠ వామ దేవాదులు
వసువు లింద్రు నభిషేకిం
చిన చంము అభిషేకిం
చిరి రాముని వైదిక విధి.

అనంతరము ఋత్విజులును
అవని సుర్థులు కన్యకలును
అమాత్యులున్నూ పురజనులును
అభిషేకించిరీ రాముని.

రత్నఖచిత మకుటంబది
బ్రహ్మ నిర్మితంబైనది.
తనపూర్వికుడైన మనువు
ధరియించిన మకుటంబది.

దాని వసిష్ఠుడు రాముని
తలపై ధరియింపజేసె
వేదమంత్ర పఠనముతో
విప్రవరులు దీవింపగ

శత్రుఘ్నుండపుడు శ్వేత
ఛత్రము పట్టుక వీచెను.
విభీషణుడు సుగ్రీవుడు
వింజామరములువీచిరి.

పాడిరి గంధర్వులు దివి
ఆడిరి అచ్చరవెలదులు
మొరసెను దివి దుందుభులవి
కురిసెను పువ్వుల వానలు

తరువులు ఫలములు గాచెను
ధరణి సస్యములు పండెను.
పూల పరిమళము జిమ్మెను
గాలి హాయిగా వీచెను.

దేవేంద్రుడు పవనునిచే
దివ్య రత్నహారాలను
పంపించెను శ్రీరామ
ప్రభువరునకు కానుకగా

ఆరఘురాముడు తనప
ట్టాభిషేక సమయంబున
గో వృష భాశ్వాల వేల
కొలదిగ దానముచేసెను.

మణి రత్న సువర్ణ వస్త్ర
ధన దానములను చేసెను
పాత్రులైన బ్రాహ్మణులకు
బంగరునాణెములిచ్చెను.

మణిఖచితంబైన పసిడి
మాలను బానుజు కొసగెను
వజ్రఖచితబాహుపురుల
వాలితనూజునకిచ్చెను.

రాముడు ముత్యాల మాల
భూమిజ మెడలో వేసెను.
ఆమె దాని పైకి తీసి
రాముని వైపే చూచెను.

అది గ్రహించి రాముడు" నీ
కభిమానంబెవరి మీద
ఎక్కువొ వారికె దానిని
ఇవ్వు" మనెను మరుక్షణమె
ఆమె దాని హనుమకిచ్చె
ఆముచ్చట అపురూపము.

హనుమంతుడు దానిని
తనమెడలో ధరియించుకొనెను
అపుడాతని కనులనుండి
ఆనందాశ్రులు కురిసెను.

రాముడిచ్చె సీతమ్మకు
ఆమె హనుమకిచ్చె దాని
ఆయిరువురి ప్రేమ మాల
అందున సీతారాముల
మూర్తులగని హనుమంతుడు
మురిసి మురిసి పులకించెను.

ఇనతనూజునకు విభీష
ణునకు జాంబ వంతునకును
తగురీతిగ విరివిగ స
త్కారములొసగెను రాముడు

ద్వివిదమైంద నలసుషేణ
గవయ ఋషభఋక్షనీలు
రాది ప్లవగ వీరవరుల
కందరకును వారు వారు
వలచినట్టి కనక వస్తు
వర్గములిడి తృప్తిపరిచె.

ప్లవగ వృద్ధులకు వానర
వరులకెల్లరకును వస్త్ర
కనక భూషణముల నిచ్చి
గౌరవించి తృప్తిపరిచె.

వానర పతి సుగ్రీవుడు
వనచరాదు లెల్లరు రఘు
వరు రాముని అనుమతిగొని
తిరిగి చనిరి కిష్కింధకు

అర్కకు లేశుని కులధన (వి1)
మగు శ్రీరంగ విమానము
మణిభూషలతో విభీష
ణునకు నిచ్చిగౌరవించె.

విభీషణుడు దారిన కా
వేరెరేవు మీద విమా
నమును దింపి సంధ్యావం
దనమొనర్చి తిరిగి వచ్చి.

చూడ విమానము కదలక
సుస్థిరముగనిలిచి పోయె!
లంకనుండ నొల్లక శ్రీ
రంగ డచట వెలసి పోయె!

## ఉత్తర శ్రీరంగం (౨౨)

అదికృష్ణానదీతీర
ప్రాంత మందు పాలమూరు
గడ్డన సూగూరునేలు
రెడ్డి ప్రభువులు నుండిరి.

ఆరాజుల కిలు వేలుపు
శ్రీరంగడు కాన సుగూర్
భూపాలుడు గోపాల్రావ్
తేపకు శ్రీరంగ మేగు.

తనకొక తరి స్వప్నములో
దర్శన మిడి స్వామి గరుడ
రూపములో కొరివిపాడు
చూపి అచట వెలయ గోరి

కానయపలె సమీపాన
తానొక వాల్మీక మందు
నున్నానని వెలికి తీసి
ఒనర ప్రతిష్టంచుమనెను.

కలలో కనుపించినటుల
గరుడపక్షిచూపినటుల
మూర్తి లభించెను ఆలయ
మును కట్టి ప్రతిష్ఠించెను.

కొరివిపల్లె శ్రీరంగా
పురము పేర వర్ధిల్లెను
రంగని మహిమను ఉత్తర
రంగక్షేత్రము వెలసెను.

ధరణీశుడు మేటి శిల్పి
వరుల చేత శ్రీరంగని
ఆలయమును నిర్మించెను
అది అద్భుతమై వెలసెను.

తన ఆస్థానీమున ఫాతే
దారులు విశ్వజ్ఞ గోత్ర
విశ్వబ్రాహ్మణుల పర్య
వేక్షణలో మేటి శిల్పి
ముఖ్యులచే కట్టించెను.
మొటాటి రెడ్డి భూపాలుడు.

శిల్పకళా వైభవమును
క్షితిని చాటుచును ఉత్తర
రంగ క్షేత్రమ్మనంగ
రంగారెడు ఆలయమది.

తదుపరి శ్రీరంగసము
ద్రము త్రవ్వించెను స్వామికి
నిత్యారాధనలకు నై
నియమించెను తగువారల

అర్చన రక్షణ కైంక
ర్యాదులుకొనసాగుటకై

ఇనాములిచ్చి వారివారి
కేర్పాటుల గావించెను.

పరంపరగ శంకరమ్మ
దొరసాని మహాత్మురాలు
అనల్ప శిల్పకళలు చిందు
అపురూపంబైన గోపు
రము కట్టించెను శిల్పక
ళావైభవమది చాటును.

ఆరాజులు ఆశిల్పులు
ఏరీ వారెటు బోయిరి!
ఇంత శిల్ప సౌందర్యము
నిచట విడిచి యెటు బోయిరి!

వారి శిల్ప కళావైభ
వంబది ఈ నాటికి సు
స్థిరమై మన సంస్కారపు
సిరులెగబోయుచునున్నది.



## రామరాజ్యవైభవం.

లక్ష్మణుతో రాముడు యువ
రాజు పీఠమధిష్ఠించు
మని యెంతగ వేడిన అత
డందు కొప్పుకొన డయ్యెను.

అన్నను సేవించుకొనుట
కన్న గొప్ప పదవి తనకు
లేదని కైంకర్యము ని
ర్విఘ్నముగా సాగాలని,

భరతుడు తనకన్న పెద్ద
వాడుండగ యౌవరాజ్య
మున కర్హుడ కానని ల
క్ష్మణుడు సమ్మతించ డయ్యె

భరతుని వలె లక్ష్మణుడును
భాగవతోత్తముడు ధర్మ
బద్ధు డంత కన్న మించి
పరమ భ్రాతృకైంకర్యుడు.

లక్ష్మణు నభిమతము నెరిగి
రాముడు భరతునియౌవ
రాజ్యమునకు నభిషిక్తుని
గాజేసెను యథావిధిని.

పౌండరీక అశ్వమేధ
వాజపేయమనుమున్నగు

యాగములను మానవక
ల్యాణార్థము గావించెను.

రామరాజ్యమందు ప్రజలు
క్షేమారోగ్యాలతోడ
సిరిసంపదలలరారగ
జీవించిరి సౌఖ్యముగా.

రాముని పరిపాలనలో
ప్రజల కీతి బాధలేదు
పితరులు తమబిడ్డలకై
ప్రేతకార్యమొనరించరు.

చోరసర్ప భీతి లేదు
క్షుదాహతులు లేరెవ్వెరు.
అవినీతికి తావులేదు
అనృత మాడువారు లేరు.

అన్యాయము ధౌర్జన్యము
అగుపించదు మచ్చుకైన
అకాలమృత్యువనారో
గ్యాలు లేవు సుంతయైన

ఆశ్రితజనపక్ష పాత
మావంతయు కనిపించదు
లంచానికి పంచానికి
లాలూచీ వినిపించదు

అక్రమాలు కానరావు
అధికారులు వంచించరు
కరువుకాటకాలు లేవు
కామాంధులు లేరెవ్వరు.

ఎంతవరకు కావలెనో
అంతవరకు మేఘంబులు
వర్షించుచు కర్షకాళి
హర్షాంబుధి దేల్చుచుండె.

వర్ణాశ్రమ నియమములను
పాటించి స్వధర్మకర్మ
నిరతులై సమస్త ప్రజలు
నిండు జీవనము గడిపిరి.

ఆడపడుచు నట్టడవిని
అర్థరాత్రి ఒంటరిగా
నిర్భయముగ నడచిప్రయా
ణించునెంత భద్రతయో!

సుఖశాంతులు వర్ధిల్లెను
శోకతప్తులెవరు లేరు
ధర్మహానిచేసి జనుల
దగా చేయు వారులేరు.

అన్నివర్గములవారల
కందరకును సుఖశాంతుల

నందజేసిఒకే న్యాయ
మందరకందుచునుండెను.

రాముడు పదివేల వత్స
రములు రాజ్యమును సేవా
నిరతి ప్రజల తనబిడ్డల
కరణి గనుచు పాలించెను.

రామ రాజ్యమిదే ఇదే
క్షేమానుగ్రహధామము
పదునొకండు వేల యేండ్లు
పాలించిన రాజ్యమిదే!

ఇదే ఇదే రామ రాజ్య
మిదే ప్రజా రాజ్యమిదే
ప్రజాక్షేమమునకై పరి
పాలించిన రాజ్యమిదే!

రామరాజ్య మంటే నే
ప్రజారాజ్యమై వెలసెను
రామరాజ్యమంటేసం
క్షేమరాజ్యమై విరిసెను.

రామరామ యనెడిమాట
క్షేమానికి పూలబాట
రామాయణ మనెడిపాట
ప్రజలకు రతనాల మూట

సామాజిక హితమెంచని
దోమాయణమిది కాదయ!
సామాజిక హితమెంచెడి
రామాయణ మిదేనయా!

ప్రజలకొరకు తనసర్వ
స్వమునైనను విరజిమ్మెను
ఆదర్శ ప్రభుత కొరకు
ఆలునైన త్యజియించెను.

ప్రజలకొరకు పాటు పడెడి
ప్రభువు కొరకు ప్రజలుకాని
ప్రజలరక్తమును పీల్చెడి
ప్రభుతకొరకు ప్రజలుకారు.

కమ్మని పాలిచ్చు గవిని
గడ్డివేసి సాకరా! ?
రక్తము పీల్చెడి నల్లిని
రాచిరాచి చంపరా?

గానము వినింపించికరుచు
ఖలు మశకము చంపరా!?
వాగ్దానము వమ్ముపరుచు
వానిగద్దె దింపరా ! ?

పదునొకండు వేల యేండ్లు
పాలించెను రామప్రభు

గడువుదాటకుండగనే
గద్దెదిగును దోమప్రభు!

ప్రభువు ప్రజాసేవకుడై
ప్రగతికై శ్రమించుచుండు
ప్రజాహితంబెంచనట్టి
ప్రభువుగద్దెదిగుచునుండు

సేవాభావమున ప్రజా
క్షేమానికి కాని ప్రభుత
నానాటికినెగడకుండ
నాశనమగుచుండుగదా!

ప్రభువులు శాసకులుగాక
ప్రజల నుపాసించువారు
శాసకులకు నానాటికి
చక్కని సందేశమ్మిది.

ఇది శ్రీమద్రామాయణ
మిది విశ్వశ్రేయకావ్య
మిది చదివిన వినిన వారి
కిహ పరార్థములు కలుగును
(ఉపాసన-సేవ- ఉపాసకుడు సేవకుడు)

**ఫలశ్రుతి**

రామకథాశ్రవణము భవ
రాహిత్యము గావించును
జడత్వమను తిమిరమ్మును
యెడదనుండి తొలగించును.

ఇదివిశ్వశ్రేయ కావ్య
మిదిప్రచారమొనరించిన
విశ్వమనెడి తోటలోన
విశ్వశాంతి విరబూయును.

పదివీ వ్యామోహమనెడి
పంకిల మెద క్షాళించును
అహమను అంధత్వము పో
కార్చి కండ్లు తెరిపించును.

సౌజన్యము సౌదర్యము
జలదములైవర్షించును
మోడుబ్రతుకు లిగురించును
బీడుపోలాలేపండును.

సౌశీల్యము సంస్కారపు
సౌరభమై వెదజల్లును.
సౌభాగ్యము పండించును
శాంతిసౌఖ్యముల గూర్చును.

అభీష్టాలు సిద్ధించును
అరిష్టాలు వైదొలగును
భవపాశములను ద్రుంచును
పరమపదము చేకూర్చును.

రామకథాశ్రవణముతో
గ్రహపీడలు నశియించును
సకల విఘ్నములు తొలగును
సకలసంపదలు కలుగును

రామాయణ పఠనముతో
సమస్తదేవతలెగాకను
పితృదేవతలును సంతృ
ప్తిని జెందుచుదీవింతురు

దీనిపఠించిన వారలు
దీర్ఘమాయురారోగ్య
శ్రీలు యశశ్రీ విజయ
శ్రీలు గలిగి సుఖియింతురు

రామాయణమెవరుగాన
ప్రచురణాది రూపములో
ప్రకటమొనర్తురొ వారికి
సకల శుభంబులు కలుగును.

తెనుగుగేయ కావ్యమ్మిది
తేనెవంటి తీపికలది
దీనివినిన పఠియించిన
వాని జన్మతరియించును.

ఇది శ్రీమద్రామయణ
మిదిచదివిన వినిననూ
భుక్తిముక్తులను పొందిము
ముక్షువు తరియించునూ

## మంగళగీతి

మంగళమగుతను
మంగళమగుతును
మంగళకరుడగుసీతాలక్ష్మణ
సంగతుడగు భద్రాచలవిభునకు
మంళమగుతను
మంగళమగుతను

శ్రీకల్యాణగుణాభిరాముడగు
ఈకృతిభర్తకు ఈకృతికర్తకు
మంగళమగుతును
మంగళమగుతును
మహీజనాళికి మంగళమగుతను

కం॥ శ్రీమన్మంగళ నామా!
ప్రేమామృత జలధిసోమ! శ్రితకల్పద్రుమా!
రామా శ్రీభద్రాచల
ధామా! ఈకృతిని గొనుమ దశరథరామా!

**మంగళమహత్ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ**

**వివరణ** [2]**:-**

అభినవవాల్మీకి, కవిసార్వభౌమ విరుదాంకింతులు హొసదుర్గం కృష్ణమాచార్యులు విరచించిన "ఉత్తరరంగా మహాత్మ్యమున శ్రీరంగాపురము ఉత్తరశ్రీరంగముగా అభివర్ణితము" మహబూబునగర్ జిల్లా సర్వస్వము.

శ్రీరంగాపురం ఉత్తరశ్రీరంగం: ఇది పదహారవశతాబ్దంలో వెలసినది. పాలమూరు జిల్లా పూర్వం వనపర్తి సంస్థానంలో శ్రీరంగాపురంలో శ్రీరంగనాథ స్వామి దేవాలయం అద్భుత శిల్పకళావైభవంతో విలసిల్లినది. అంతకుముందు ఇచట కస్తూరి రంగనాయక స్వామి వారి గుడి ఉండేదని జనశ్రుతికలదు. ఈ ఊరుకు కొరివిపాడు అని పేరుండేది. శ్రీరంగనాథస్వామివారి ఆలయనిర్మాణంతో శ్రీరంగాపురం అనుపేరు వచ్చింది. ఈ ఆలయనిర్మాత: అష్టభాషా బహిరీ బలవంత్ సవైరాజాగోపాల భూపాలరావు (1595) ఇతడు శ్రీరంగనాథస్వామి భక్తుడు సూగూరు రాజధానిగా గలవాడు.

గోపురనిర్మాత: సవైరాజా బహిరీ బలవంత్ మొదటి రామేశ్వరరావు గారి భార్య శంకరమ్మ దొరసానిగారు శ్రీరంగనాథ ప్రీత్యర్థం గోపురకైంకర్యం (1804)

శ్రీరంగాపురం రచయిత స్వగ్రామం.

**వివరణ** [1]**:-**

(రామేణ సర్వకామైశ్చ యథార్హం ప్రతిపూజితః)
లబ్ధ్వా కులధనం రాజాలంకాం ప్రాయాద్విభీషణః

(రాముడుయోగ్యతానుగుణముగా సకలకామితములనొసగి సత్కరింపగా) రాక్షస రాజగు విభీషణుడు ఇక్ష్వాకు కులధనమైన శ్రీరంగవిమానముగైకొని లంకకు పోయెను.

-వాల్మీకి రామాయణము యుద్ధకాండము 131వ సర్గ
-తాత్పర్యకర్త శ్రీచలమచర్ల వెంకటశేషాచార్యులు

"రామాభిషేకమును దర్శించివీడుకోలు సందర్భమున విభీషణుడు కులక్రమానుగతమగు లంకారాజ్యము అతనికి లభించినను అతనికి సంతుష్టిలేక పోయెను. రామవిశ్లేషమును అతడు ఓర్వలేనివాడై నిలచియుండెనట. శ్రీరాముడు అతని మనోరథమును ఎరింగి లంకను పాలించుటకు అతనిని ఎట్లైనను వెనుకకు మళ్లింపవలెనని అనేక విధములుగ ప్రయత్నించెను. చివరకు ఇక్ష్వాకు కులధనముగ బ్రహ్మగారిచే ఒసంగబడిన శ్రీరంగము అనుపేరుగల రంగనాథుడు వేంచేసి ఉండెడి విమానమును ఒసంగివెనుకకు వెళ్ళమని నిర్బంధించి వెనుకకు పంపెనట. కులధనమనగ వారి వంశములో పూర్వమునుండి ఆరాధింపబడుచున్న అర్చామూర్తి. ఆమూర్తినే విభీషణునకు

ఒసంగెను అది ఉభయకావేరీ మధ్యభాగమున ఉండిపోయెను. లంకవైపు చూచుచు రంగనాథుడు ఆలయములో శయనించి ఉండును. ఆవిమానము ప్రణవాకారముగ ఉండును. విమానముపైని కూడ శ్రీరంగనాథుని మూర్తి లంకనుచూచు వేంచేసిఉండును.

-ప్రవచనశిరోమణి శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులవారి

-తత్త్వదీపిక శ్రీమద్రామాయణం యుద్ధకాండం.

పద్మపురాణమందే గాక నరసింహపురాణమున నిట్లు చెప్పబడెను.

"రావణం దేవకంటకం సభాంధవంహత్వా సీతారామారాయపునరయోధ్యాం ప్రాప్యభరతాభిషిక్తో విభీషణాయ లంకారాజ్యం విమానం వాదత్వాతః ప్రేషయామాస! సతుపరమేశ్వరో విమాన స్థోవిభీషణేన నీయమానో లంకాయావాపి రాక్షస పూర్యాం వసతుమనిచ్ఛన్ పుణ్యారణ్యం తత్రస్థాపితవాన్"

- నృసింహ - 27 వ అధ్యాయము

"అనగా దేవకంటకుడైన రావణుని బంధువులతోడ జంపి సీతను గ్రహించి అయోధ్యకువచ్చి భరతునిచే నభిషేక మంగీకరించి విభీషణునకు లంకా రాజ్యము విమానమును నొసగి యాయనను పంపెను. ఆపరమేశ్వరుడు విమానాస్థుడై విభీషణునిచే దీసికొని పోబడి రాక్షసపురియగు లంకయందుండనొల్లక పుణ్యారణ్యమందు స్థాపితుడయ్యెను."

-మందరము-యుద్ధకాండ.

## యుద్ధకాండపారాయణ ప్రయోజనం

1. నాగపాశ విమోచనం గరుడుని రాకవరకు (50వ సర్గ) నిత్యపారాయణం సర్వవిధవిపత్తులను తొలగించును
2. బ్రహ్మాస్త్రబంధవిముక్తి తెలుపు 74వ సర్గ పారాయణం సర్వరోగముల నివారించును
3. ఆదిత్యహృదయమును తెలుపు 107వ సర్గ పారాయణం శత్రువిజయం సాధించిపెట్టును.
4. బ్రహ్మాదులు రామునిస్తుతించు 120వ సర్గపారాయణం రామానుగ్రహమును సంపాదించిపెట్టును.
5. శ్రీరామపట్టాభిషేకసర్గ పారాయణం సర్వాభీష్ట ఫలప్రదముగా ప్రసిద్ధిబడసినది.

యుద్ధకాండ రామాయణ మునకేమణికిరీటము.
దీనిపారాయణము సర్వశుభముల గూర్చును.

"యుద్ధకాండప్రశస్తి" **శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులుగారు**

## యుద్ధకాండలో ముఖ్యాంశాల తేదీ వివరాలు

ఫాల్గుణ బ॥ పాడ్యమి నాడు సముద్రము చేరిరి. అనాడే విభీషణునకు అభయ ప్రదానంజరిగెను. పాడ్యమి, విదియ, తదియ, మూడు రోజులు దర్భశయనం. చవితి, పంచమి, షష్ఠి, సప్తమి, అష్టమి 5 రోజులు సేతుబంధనం అష్టమి నాడే సాయంకాలం సేవేలారోహణం. నాటిరాత్రి ప్రాతః కాలములో సుగ్రీవరావణుల ద్వంద్వయుద్ధం.

"అర్కునిలో నల్లమచ్చ అగుపడుచున్నది" సూర్యునిలో నల్లమచ్చలు వచ్చినపుడే జపాన్‌యుద్ధం బర్మాయుద్ధం జరిగినది. ఇది పదకొండేండ్ల కొకసారి వస్తున్నట్లు పరిశోధకులంటున్నారు. సూర్యునిపై మచ్చలు వచ్చినయేడు యుద్ధాలు జరుగుతవనే సూచన దీన్ని బట్టి మనరామాయణ కాలం నుండియే కనిపిస్తుంది. - సాహిత్యారాధకుడు కపిలవాయి లింగమూర్తిగారు.

ఫాల్గుణ బ॥ నవమి అంగదరాయబారం, దొమ్మిపోరు అనాటిరాత్రే నాగపాశబంధం విమోచనం అనాడే ధూమ్రాక్ష వజ్రదంష్ట్రులవధ అకంపనవధ దశమినాడు.

ఫాల్గుణ బ॥ దశమి మధ్యాహ్నం ప్రహస్తవధ- రావణ భంగపాటు. కుంభకర్ణవధ. బ్రహ్మాస్త్రబంధమోక్షములు దశమినాటిరాత్రి చర్య. అంతా 8-30 రాత్రికి ముగిసింది. ఆ రాత్రే వానరులు లంకనుకాల్చుట. కుంభనికుంభులవధ - మకరాక్షవధ. యుద్ధం ఆరంభమై రెండుదినములలో మూలబలం, ఇంద్రజిత్తు, రావణుడు ముగ్గురు మంత్రులు తప్ప అందరు హతమైరి.

ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, - ఇంద్రజిత్తు మాయసీతను చంపుట, లక్ష్మణ ఇంద్రజిత్తుల యుద్ధం. లక్ష్మణుడు ఇంద్రజిత్తును చంపుట.

చతుర్దశి సూర్యోదయంనుండి మూలబలం మూడుముప్పాతిక ఘడియలలో నాశనముకాగా రావణుడు యుద్ధానికి అనాడే ముగ్గురు మంత్రులతో బయల్వెడలెను. నాటి సాయంకాలం రేయిబవళ్లు రావణ యుద్ధం జరిగి మరునాడే ఏడవదినమున రావణవధ జరిగింది. అనగా ఎనిమిదవనాటి ఉదయం పూచ్చామావాస్య గడియలలో రావణవధ జరిగెను.

"నేటికి తొమ్మిది దినాలు దాటినాటి సభలోపల
సీతవిషయమై అన్నకు నీతిని బోధించినాడు"

కుంభకర్ణుడు ఫాల్గుణ బ॥ పాడ్యమినాడు రావణ సభకువచ్చి మాట్లాడి ఆనాటి రాత్రినుండి నిద్రలోనుండెను. 9రోజుల నిద్రతరువాత అనగా ఫాల్గుణ బ॥ పాడ్యమి నాటిరాత్రి నుండి నవమి రాత్రి వరకు నిద్రలోనుండి దశిమినాడు మేల్కొలుపబడి యుద్ధంచేసి ఆనాడే రామునిచే వధింపబడెను

మూలంః "మందరం" యుద్ధకాండ.



# రసప్రియ ఫోతేదార్ కేశవాచార్య

(Rtd. Chief Planning Officer/Dy. Director Planning & Statistics)

స్వగ్రామేరి ... శ్రీరంగాపురం (వనపర్తి) మహబూబ్‌నగర్ జిల్లా.

అభిరుచులు : కవిత్వం, చిత్రలేఖనం, తత్వశాస్త్రం, చరిత్రపరిశోధన.

రచనలు : రసప్రియ రామాయణం (గేయకావ్యం) : పర్ణశాల, (అరణ్యకాండ), సీతాన్వేషణ (కిష్కింధకాండ), సుందరకాండ, బాలకాండ, అయోధ్యాకాండ - రావణవధ (యుద్ధకాండ), రాజరాజేశ్వరీ శతకం, భద్రగిరి శతకం, మాతృశ్రీ, కేసరగిరి రామలింగేశ్వర నక్షత్రమాల, సీతారామతారావళి, అమరస్మృతులు (ఖండకృతి) శ్రీ షిరిడి సాయి చరితామృతము, అభ్యుదయ కిరణాలు (అముద్రితం) శ్రీరంగనాథ శతకం, (అముద్రితం)

పర్ణశాల : సరళంగా గతివైవిధ్య తరళంగా రచించిన పర్ణశాల రసహృదయులకు ఆనందహేల. ఇందుకు కేశవాచార్య అభినంద్యులు -డా॥ సి. నారాయణ రెడ్డి

'ఈ పర్ణశాల కవితా సౌవర్ణశాల' - డా॥ దాశరథి.

'ఇందలి గేయములు సెలయేటి వలె నప్రతిహతగతికములై సహజమనోహరముగా జాలువారుతున్నది' - డా॥ దివాకర్ల వేంకటావధాని.

సీతాన్వేషణ : నేటి హైందవ సమాజమునకు రామాయణ మహాభారత గాధలేపునరుజ్జీవన హేతువులు ఈ పరమార్ధమును గ్రహించిన గ్రంధకర్త రామాయణ రచనను చేపట్టినందుకు వారిని అభినందించుచున్నాను. - గడియారం రామకృష్ణ శర్మ.

సుందరకాండ : అజరము, అమరము, రసప్రియ గేయరామాయణం. సర్వదాకృత కృత్యులైన శ్రీరసప్రియగారు ఈ కావ్యరచన ద్వారా రససిద్ధులైనారు. తెలుగులోని శ్రీమద్రామాయణం కావ్యవారాశిలో అమూల్యమైన అనర్ఘరత్నం వీరి యీ సుందరకాండ. - మధురకవి కొలిపాక మధుసూదనరావు.

రసప్రియ రామయణం మహారాష్ట్రభాషలోని నరహరిదాసు రామయణానికి సాటిగా నిలుస్తుంది. - కపిలవాయి లింగమూర్తి

బాలంకాండ: శ్రీ రసప్రియ రచించిన రామాయణగేయకావ్యం తనసౌకుమార్యంతో ఆ బాల గోపాలము నలరించగలదని, తెలుగునేల నాలుగుదిశల ప్రసరించి భక్తిపర వశమొనరించి నాల్గు కాలములు నిల్వగలదని యాశించెద. -డా॥ మల్లాది గోపాలకృష్ణ శర్మ.

రసప్రియ ఫోతేదార్ కేశవాచార్యుల వారు వృత్తి రీత్యా సంఖ్యలవారు. వారిది అక్షరప్రవృత్తి. వారుగేయ బాలకాండ, వాల్మీకిని అనుసరించి రచించారు. వాల్మీకి రామయణం వారికి అభిమానదైవం. వారికవితలో సౌలభ్యంఉంది. అర్ధమవుతుంది చెప్పడం వారిలక్ష్యం. రసంవచ్చి చేరుతుంది. ఈ కావ్యస్రష్ఠ రసప్రియ కేశవాచార్యులను వారికుటుంబాన్నీ సీతారాములు సంపూర్ణంగా అనుగ్రహించాలని ఆశీర్వదిస్తున్నాను . - డా॥ దాశరధి రంగాచార్య.

అయోధ్యాకాండ: వాల్మీకులవారు కావ్యరూపంలో ధ్వని విశేషంగా అందించిన నిగూఢార్ధాలను కేశవాచార్యులవారు వాచ్యంగా మహాజనానికి నివేదించారు.రసప్రియరామాయణం విద్యావంసులకు మాత్రమే ఉద్దేశించబడింది కాదు. సర్వజనానికీ అందుబాటులో ఉండాలని రచించబడింది. అకారణం వల్లనే దీన్ని గేయ రామాయణంగా పాడు కోవటానికీ చదువుకోవటానికీ వీలుగా రచించారు ఆచార్యులవారు. బహుగ్రంథరచయితలైన శ్రీకేశవాచార్యులవారు ఈగేయ రామాయణంవల్ల రసప్రియులైన సర్వజనులకు పరమాప్తులు కాగలరు. తథాస్తు ! - డా॥ వి.వి.యల్. నరసింహారావు.

# కృతజ్ఞతావిష్కరణ

నాయీ గ్రంథముద్రణకు అర్థించగానే దయతో ఆర్థిక సహాయమేర్పరిచిన గౌరవనీయులు శ్రీ ఎ. గిరిధర్ ఐ.ఎ.యస్. జిల్లా కలెక్టర్ ఖమ్మం గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

ఈ కావ్యానికి తమ అభిప్రాయము వ్రాసి పంపిన మిత్రులు ఆచార్య యస్వీ రామారావు డీన్, ఫాకల్టీ ఆఫ్ ఆర్ట్స్ (రిటైర్డ్) ఉస్మానియా విశ్వవిద్యాలయం వారికి నా నమఃసుమాంజలులు. - రచయిత

# స్తంభాద్రి సౌరభాలు

మ॥ వనలక్ష్మీ దరహాసచంద్రికలతో పాల్వంచ విద్యుల్లతాం
గన శోభాభ్యుదయాంగ వీచికలతో నానా ప్రవాహాలతో
ఖనిజశ్రీ కనకాభిషేకములతో కంబాద్రి ఆంధ్రావనీ
స్తన దుగ్ధంబయి గ్రాలు భద్రగిరి సీతారామ చంద్ర ప్రభూ!

మ॥ స్థిర సౌఖ్యంబులగూర్చు స్తంభగిరి ధాత్రీమండలంబందు కి
న్నర మున్నేరు మరేరు తాళి శబరీ నాగార్జునా గౌతమీ
ఝురులుప్పొంగుచు శీతలోదకములన్ క్షామాగ్ని జల్లార్పని
ద్ధరణీ పాలన సేతు భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

మ॥ ఝురులుప్పొంగిన పుణ్యభూమి, అటవీసౌభాగ్య లక్ష్మీకృపా
ఝురులుప్పొంగిన భాగ్యసీమ, ఖనిసస్యక్షీరముల్ జేప బల్
సిరులుప్పొంగిన జీవగడ్డ, ఇదినీ శ్రీపాద సంస్పర్శచే
తరహించున్ గద స్వామి! భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

మ॥ ఇట లంకేశుడు సీతనెత్తుకొని పోయెన్ గర్భశోకాగ్ని క్రిం
గుట భూదేవికి గుండియల్ గమిలి బొగ్గున్ దేర 'కోల్ మైను' లి
చ్చట వర్థిల్లె పరోపకారమొనగూర్చన్ సజ్జనుల్ మాన రెం
తటి సంతప్తులు నైన భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

మ॥ మునుపిచ్చోట జటాయురావణునితో పోరాడుచున్ గూలి రా
ల్చిన క్రొన్నెత్తుటి చుక్కలీకెలివి మిర్చీధూమ్ర పత్రాకృతుల్
గని ద్రవ్యాయుధమూని గాటనెడి కక్షన్ ఘోరదారిద్ర్యమన్
దనుజున్ గూల్చను గాదె భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

నా భద్రగిరి శతకము నుండి - రసప్రియ

చిన్నమొత్తాల పొదుపు పథకాలు జీవన వనాల కమృతోదకాలు




మీ సొమ్మును

చిన్న మొత్తాల పొదుపు

పథకాలలో పొదుపు చేయండి.

 సొమ్ముభద్రత

 అధిక రాబడి

 పన్నురాయితీలు

సొమ్ముభద్రత భవిత బంగారం

**చిన్న మొత్తాల పొదుపు**

జిల్లా కలెక్టర్, ఖమ్మం.

పొదుపు కథనుండి..

"కట్టెపుల్లగడ్డిపోచ పిట్టనోట తెచ్చితెచ్చి
పుట్టబోవు పిల్లలకయి కట్టుచుండు గూడునొకటి
ఓహో! చీమలబారులు ఆహారము పొదుపుచేయు
ఏమియింత చిన్నప్రాణి! ఎంతగొప్ప పొదుపురాణి!
ముందు ముందు బ్రతుకు కొరకు ముద్దుగ తమ ఆహారము
పొదుపు చేయు చీమలహహా! బోధచేయు మానవునకు"
(1965లో స్మాల్ సేవింగ్స్ సంస్థ వారు నిర్వహించిన రాష్ట్రస్థాయి జాతీయగేయపోటీలలో ప్రథమ బహుమతి నందుకున్న గేయం. HINDU)

-రసప్రియ